" సావు పుటక లేనిదమ్మ నేస్తమన్నదీ -
జనమ జనమ కది మరీ గట్టిపడుతదీ..."

మధురమైన ప్రణయకథ - ఆత్రేయ, మహాదేవన్‌ల గానసుధ




# మూగమనసులు

నిర్మాత సి.సుందరం. దర్శకుడు ఆదుర్తి సుబ్బారావు

శ్రేషిలింస్ విడుదల

# ఈ సంచికలో





ముఖచిత్రం : 'చక్రనేమి' లో మాధవి వేషవినోదం

చిత్రకారుడు : వడ్డాది పాపయ్య



"కెందామర" రచన చాల గొప్పగా వుంది. ప్రతినెలా శ్రీ బైరాగి సాహిత్యం 'యువ'లో చదవాలనికూడా వుంది. ఈ నెల ముఖచిత్రాలంకరణ శోభాయమానంగా, మరీ ఆకర్షణీయంగా వుంది. కథలలో "నిజం దాగదు" నాకు నచ్చింది.

— బలివాడ వెంకటరామారావు

అదపాక.

నా అభిమాన 'యువ' మాసపత్రికలో ప్రచురిత మవుతున్న చక్రనేమి సీరియల్ నవల చాలా బావుంది.

ఇంతటి ప్రతిభావంతంగా చలన చిత్రానికి పనికివచ్చే విధంగా, చదువుకోవడానికి హాయిగా, ఆసక్తివుండే విధంగా ఆకర్షణీయమగు శైలిలో నవలను రూపొందించిన రచయిత్రి కోడూరి కౌశల్యాదేవి గారికి నా హృదయపూర్వక మయిన అభినందనలు తెలుపుకుంటున్నాము. 'చక్రభ్రమణం' త్రోవనే 'చక్రనేమి' గూడా తెర కెక్కగలదని, ఆకాంక్షిస్తూ...

— మీ అభిమాని

అమర్

ఫిబ్రవరి నెల యువలో "శాంతించిన సముద్రము", "నిజం గాగదు" అనే కథలు చాలా బాగున్నాయి. రచయితలకు నా ధన్యవాదములు. "అడవి బూచిన వెన్నెల", "ఆలోచనాలోచన" అనే వర్ణ చిత్రములు, ఈ నెల యువకి వన్నె తెచ్చి నవి. "చక్రనేమి" సీరియల్ రసవత్తర ముగా ఉంది.

— *గుండుమళ్ళ వెంకటరామారావు*
శ్రీకాకుళం,

అలవాటు పడిన జీవితం నుండి, తప్పించినా ? అనుకున్నంత ఆశించినంత త్వరగా మానుకొని బయట బడుట 'అసాధ్య' మని చాటినకథ — 'పులిబోను.'

'శాంతి' చేసిన ప్రయత్నం విఫలం కావడమే కాకుండా 'వేశ్య'గా జీవిస్తున్న 'శోభ' నుండి నిప్పులాంటి నీతిగావుండే నగ్నసత్యాన్ని గ్రహిస్తుంది !

ఫిబ్రవరి సంచికకు 'పులిబోను' కథ మణిపూసలాంటిది.

ఇలాంటి చక్కటినీతిని ప్రబోధించే కథా 'రచయిత'కు అలాంటి అత్యుత్తమ కథలు అందిస్తున్న 'యువ' సంపాదకులకు నా హృదయపూర్వక అభినందనలు.

— ప్రహశ్రీ
అనంతపురం

యువ

సచిత్ర మాసపత్రిక

సంచాలకుడు : చక్రపాణి

సంపుటి 9 మార్చి 1964 సంచిక 3


# ఆంధ్రలో సత్యాగ్రహం

ఆంధ్రదేశంలో ఇప్పుడొక సత్యాగ్రహం సాగుతూవుంది. ఇది చిత్రమైన సత్యాగ్రహం.

ఇటీవల, ఆంధ్ర ప్రభుత్వం భూమిశిస్తును పెంచింది. ఎంత పెంచిందనే విషయాన్ని పరిశీలనగా చూస్తే, ఏ రైతూ భరించలేనంతగా ఏమీ పెంచినట్లు కనపడదు. మరీ ఎక్కువగా పన్ను పడినచోట, ఎకరానికి ముప్ఫయి రూపాయలు తేలుతుంది. అయితే, ఇలాటి పన్ను పడిన భూమిలో ఎకరానికి అధమం పధ్నాలుగు బస్తాలైనా ధాన్యం పండుతుంది. ఈ లెక్కన చూస్తే, ఎకరంలో పండిన పంటలో పధ్నాలుగవ వంతు మాత్రమే, రైతు చెల్లించే పన్ను.

పూర్వకాలంలో, రైతుకు రాజు ఏ సదుపాయాలూ కల్పించని రోజులలో, ఏడాదికి రెండు మూడు గ్రామాలమీద బందిపోటులు వచ్చిపడి దోసుకుపోయే రోజులలో, ఏడాదికి ఒకసారైనా రాజు దండయాత్రలకు బయలుదేరి గ్రామాలలో నిలవవున్న ధాన్యాన్ని సైనికులకోసం భుక్తం చేసుకునే రోజులలో, రాజుకోసం, రాజ్యం

కోసం తప్ప తమకోసం బ్రతకడం రైతుకు తెలియని రోజులలో, భూమిమీద పండే పంటలో ఆరవవంతు నుంచి నాల్గవవంతు దాకా పన్నుగా రాజులు వసూలు చేసేవారు. ఈనాడు, రైతు అలాటి శోచనీయ స్థితిలో లేడు. రైతుల క్షేమంకోసం, వ్యవసాయాభివృద్ధికోసం, ప్రభుత్వం ఎంతో డబ్బు ఖర్చుపెడుతున్నది. ప్రజలు ఇస్తేనేకదా ప్రభుత్వానికి డబ్బు వచ్చేది. వస్తు సామగ్రుల మీద అమ్మకపు పన్నుల విషయంలో పట్టణవాసులూ, గ్రామస్థులూ ఒకే పద్ధతిలో పన్ను చెల్లించినా, ఇన్‌కంటాక్సు చెల్లించేవారు, హెచ్చు రేటులో లెక్కచూస్తే తమ ఆదాయంలో నూటికి 80 వంతులదాకా పన్నురూపంలో ప్రభుత్వానికి చెల్లిస్తున్నారు.

1939 లో సెటిల్మెంటు విధానాన్ని ప్రభుత్వం రద్దుచేసింది. ఆ విధానం రద్దు కాకుండా వున్నట్లయితే, ఈపాటికి భూమిశిస్తు నాలుగు రెట్లయినా పెరిగివుండేది. 1939 నాటి ధరలతో పోలిస్తే, ధాన్యం ధర యీనాడు పదిహేనురెట్లు పెరిగింది. ధాన్యం ధరతోపాటు, ఇతరవస్తువుల ధర లన్నీ పెరిగాయి. 1939 లో బస్తా ధాన్యం రెండు, రెండున్నర రూపాయలకు అమ్మిన రైతు, బస్తా ధాన్యాన్ని దాదాపు ఇరవై రూపాయలకు అమ్ముతున్న రోజులలో, 1939 లో చెల్లించిన రేటులోనే పన్నులను చెల్లిస్తా ననడం సబబేనా ?

కాని, యీనాడు రాష్ట్రంలో సాగుతున్న సత్యాగ్రహం నిజంగా రైతులు చేస్తున్న సత్యాగ్రహం కాదు. రైతుల మేలుకోసం ఏవో త్యాగాలు చేస్తున్నా మని రైతులను నమ్మించి, రాబోయే ఎన్నికలలో రైతుల ఓట్లను సంపాదించడానికి ప్రయత్నం చేస్తున్న రాజకీయ పార్టీలు చేస్తున్న సత్యాగ్రహ మిది. రాష్ట్రం మొత్తంనుంచి వచ్చే వార్తలనుబట్టి చూస్తే, యీ సత్యాగ్రహం దాదాపు పూర్తిగా కమ్యూనిస్టుపార్టీ ఆధ్వర్యాన జరుగుతున్నట్టు కనపడుతోంది.

సోషలిస్టు వ్యవస్థను స్థాపించడమే పరమావధి అని కాంగ్రెసుపార్టీ నిర్ణయించి నప్పటినుంచీ, కమ్యూనిస్టుపార్టీకి బలం నూటికి తొంభై పాళ్లు పోయింది. పంచవర్ష ప్రణాళికలద్వారా కాంగ్రెసుపార్టీ దేశంలో అభివృద్ధి పథకాలను, ప్రజా సంక్షేమ కార్యక్రమాలను అమలుజరపడంతో కమ్యూనిస్టుపార్టీ ప్రజలకు ఏ విధమైన ఆశలనూ

చూపడానికి వీలులేకుండా పోయింది. కాని, పన్ను కాస్త ఎక్కువైందంటే ప్రతి వ్యక్తీ ప్రభుత్వంపట్ల ఆగ్రహం చూపిస్తాడు. పాతికేళ్లుగా అదనపు పన్ను అనేది ఎరగని రైతు, హఠాత్తుగా యీనాడు పన్ను ఎక్కువైందంటే కొంత నిరసన భావాన్ని చూపకపోడు. కాని, ఆ నిరసన భావాన్ని ఒక ఉద్రేకంగా రెచ్చగొట్టే రాజకీయపార్టీ లేకపోయినట్లయితే, దేశ సంక్షేమ కార్యక్రమాలకు పన్ను చెల్లించడంలో రైతు కష్టపడడు. భూములను ప్రభుత్వపరం చేసుకొని, రైతులను కూలీలుగా ఉపయోగించి, రైతు పండించిన పంటలో రైతు తినడానికికూడా సరిగా మిగల్చక పంటను స్వాధీనం చేసుకోవడమే ప్రణాళికగా గల కమ్యూనిస్టుపార్టీ, రైతు సత్యాగ్రహం చెయ్యకపోయినా రైతు పేరుమీద పార్టీ మనుష్యులతో సత్యాగ్రహాన్ని సాగించడం చిత్రమే. ప్రజల శ్రేయస్సు నిజంగా కోరినట్లయితే, కమ్యూనిస్టుపార్టీ సత్యాగ్రహం చెయ్యవలసినది పన్నులకు వ్యతిరేకంగా కాదు; రోజు రోజుకూ పెరిగిపోతున్న ధరలకు వ్యతిరేకంగా.

పంట పండిన వెంటనే రైతు దగ్గరనుంచి ధాన్యాన్ని మిల్లు యజమానులు కొనేస్తున్నారు. వీరు రైతుకు ఇచ్చే ధర, ధాన్యపు బస్తాకు దాదాపు పదిహేను రూపాయలు, రెండు ధాన్యపు బస్తా లయితే ఒక బస్తా బియ్యం. బస్తా బియ్యం ధర ముప్ఫయి రూపాయలు. కాని, ఏభై రూపాయలకు తక్కువలో బియ్యం ధర లేదు. అంటే ముప్ఫయి రూపాయల పెట్టుబడికి, ఇరవై రూపాయల లాభం అన్నమాట. ఇది, నూటికి సుమారు 67 వంతులు. మిల్లు యజమానులకు వచ్చే ఇంత లాభం, మరే యితర వ్యాపారంలోనూ వుండదు. ఈ ధర కాక, తవుడు, పొట్టు అమ్మినందుకు వచ్చే లాభం వేరు. బియ్యం ధర పెరగటానికి కారకులు మిల్లు యజమానులే గాని రైతులు కారు.

ధాన్యపు వ్యాపారంలో మొదటి అమ్మకంమీద అమ్మకంపన్ను లేదు. అంటే రైతు అమ్మినప్పుడు అమ్మకంపన్ను లేదు. ఆ తరువాత మిల్లునుంచి అమ్మకం జరిగినప్పుడు అమ్మకంపన్ను వుంది. చాలామంది మిల్లు యజమానులు, యీ పన్నును ఎగవెయ్యడానికి ఒక పద్ధతిని కనిపెట్టారు. అదేమిటంటే, రైతు దగ్గర

నుంచి ధాన్యం కొన్నప్పుడు తాము ధాన్యం కొన్నట్టు పద్దు వ్రాయరు. రైతు తనవద్ద ధాన్యం నిలువ వుంచినట్టు, రైతుపేరుమీదనే ధాన్యం నిలువ చూపిస్తారు. అమ్మి నప్పుడు, రైతే అమ్మినట్టు వ్రాస్తారు. ఈ కిటుకు ప్రభుత్వానికి తెలియదా! తెలిసీ ప్రభుత్వం చెయ్యగలిగింది ఏమీ లేదా?

ధరలు పెంచడంలో కూడా మిల్లు యజమానులకు వున్న సౌకర్యం, సామాన్య రైతుకు లేదు. ధాన్యపుబస్తాల తాకట్టుమీద, మిల్లు యజమానులకు బ్యాంకులు అప్పు ఇస్తాయి. కొన్ని వేలబస్తాల ధాన్యాన్ని కొనడానికి, లక్షలలో బ్యాంకినించి అప్పు తీసుకొని, కొన్నధాన్యాన్ని విడుదల చెయ్యకుండా నిలవవుంచి, ప్రజల ఆకలిబాధను అవకాశంగా తీసుకొని ఇష్టంవచ్చిన ధరకు ధాన్యాన్ని అమ్మే సదుపాయం మిల్లు యజమానులకు వుంది. ఈ సదుపాయాన్ని సద్వినియోగం చేసుకుంటున్న సత్పురుషులు మిల్లు యజమానులలో చాలామంది ఉన్నారు.

ఈ పరిస్థితులను తొలగించి, న్యాయమైన ధరకు బియ్యం దొరకేటట్టు చూడడం ప్రభుత్వధర్మం. ప్రభుత్వం యీపని చేసిననాడు, రైతులు ఎక్కువ చేసినందువల్ల బియ్యంధర పెరిగిందనే భ్రమ ప్రజలకు వుండదు. రైతు ఎక్కువ ధరకు ధాన్యాన్ని అమ్మడానికి కారణం, పన్నులు ఎక్కువకావడమే అనే దురభిప్రాయంకూడా ప్రజలకు వుండదు. అలాటప్పుడు ఏపార్టీవారు ప్రారంభించినా, పన్నుల సత్యాగ్రహంలో పాల్గొనడానికి, రోజుకూలిపద్ధతిలో కూడా ఎవరూ ముందుకు రారు.

ధరలను అదుపులో వుంచిననాడు, ప్రభుత్వం పన్నులను కొంచెం ఎక్కువగా వేసినా ఎవరూ బాధపడరు.



# చిత్రవార్తలు

ఫిబ్రవరి 7 వ తేదీన మన ఉపరాష్ట్రపతి న్యూఢిల్లీలోని శిశు సంక్షేమ భవనానికి ప్రారంభోత్సవం చేశారు.





ఆంధ్రప్రదేశ్ నూతన ముఖ్యమంత్రి
శాసనసభా నాయకుడు
శ్రీ సంజీవరెడ్డితో



*చరిత్రాత్మకమైన గడియారం*

ఉప్సర్డల్ విశ్వవిద్యాలయంలోవున్న ఈ చరిత్రాత్మకమైన గడియారం 1655 లో తయారు చేసింది. ఈమె మెడలో ధరించిన గడియారం 1548 నాటిది. ఆమె చూపుతున్న దండం భారత దేశానిది. రెండువేల సంవత్సరాలనాటి యాత్రికుల దిక్సూచీ దండం అది. (యు. పి. ఎస్.)



ఆంధ్రప్రదేశ్ గవర్నరు సోవియట్ సర్కస్‌బృందంతో గోషామహలు స్టేడియంలో.

ఆంధ్రప్రదేశ్ ఆర్థిక మంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డి లెజిస్లేటివ్ అసెంబ్లీ ముందు 21-2-64న 1964-'65 సంవత్సరానికి బడ్జెటు అంచనా ఉంచినారు.



*శరత్ చెప్పిన కథ :*

# చంద్రముఖి

ఏదో పత్రికలో ఓ మాటు శరచ్చంద్రునిపైని దుమ్మెత్తి పోస్తూ, దుయ్యబడుతూ ఓ వ్యాసం పడింది. శరత్ బాబా వేళ తన నేస్తులతో దాన్ని గురించే ప్రస్తావించి యిలా చెప్పటం మొదలెట్టాడు.

"ఇంతకూ నాపైని వాళ్ళు మోపిన మహా నేర మేఁవిటనుకున్నారు?— నే నేదో గొప్ప పాపాత్మురాళ్లను - పాపిష్టిపిండాల్ని యింత మనోహరంగా - యింత పవిత్రంగా చిత్రించానట! నే నెప్పుడు చూసినా అలగా వాళ్ళనీ, పతితుల్నీ, తప్పుడాళ్ళనీ, అనాడీల్ని అందలాని కెక్కించి అదే పనిగా సమర్థించేస్తున్నానట! కాని యిందులో నిజం చెప్పాలంటే నేను లవలేశమైనా అలాంటి వాళ్ళని సమర్థించటం లేదు. కానైతే వాళ్ళని మాత్రం అందరికిమల్లే అవమానించటం నాకు ససేమిరా యిష్టంలేదు. వాళ్ళు కూడా అందరిలాగా మనుషులే అంటాను. తమ గోడు చెప్పుకునేందుకు వాళ్లకూ కూడా అధికారం వుందంటాను. ఇంతే గాకుండా పరిపూర్ణమైన మానవత్వం పాతివ్రత్యంకన్నా చాలా దొడ్డదని నా తలంపు. ఎంతో గొప్ప మహా పతివ్రతలైన స్త్రీలు సైతం దొంగతనం పింజారి పనులూ చేస్తూండటం, తప్పుడు సాక్ష్యాలు కూడా చెప్పటం నేను కళ్లారా చూశాను. అందుకు విరుద్ధమైన విషయాలు కూడా చూశాను. మీకిప్పుడో కథ వినిపిస్తా. నేను కళ్లారా చూసింది కాకపోయినా అచ్చంగా జరిగిన కథ యిది. ఈ కథకి సమ్మంధం వున్న యిద్దరు మగరాయుళ్లూ నాకు మంచి నేస్తాలు. వాళ్లే యీ కథంతా విడమరిచి నాకు చెప్పారు:

ఇప్పుడు నేను చెప్పాస్తున్న యిద్దరూ సామీలూ ప్రాణస్నేహితులు. ఓ కంచాన తిని ఓ మంచాన పడుకునే వాళ్ళు. అంత జోస్తీ వాళ్ళిద్దరకూ:

---

సూరిశెట్టి సాంబశివరావు బాబ్జీ

ఒహానా డా యిద్దరు మిత్రులూ చెట్టా పట్టాలు పట్టుకుని తిరుగుతూ యేదో వేళాకోళాని కని భోగంవాళ్ల పేటకి షికారుగా వెళ్ళారు. వెళ్లేప్పుడు కాస్త కాస్త సారాయి కూడా చంకను పట్టి గెళ్ళారు.

వాళ్లలా దూరిన ఇంట్లో ఓ అమ్మాయి ఒయ్యారం ఒలకపోస్తూ తైతక్క మని ఆడుతోంది. కమ్మ కమ్మగా జావళీలు పాడుతోంది. ఆమెకి ఆటా — పాటా క్షుణ్ణంగా వొచ్చు. ఇద్దరు నేస్తులూ మేజువాణీ మజా మజాగా చూసుకుంటూ కొద్దికొద్దిగా సారా సేవించటం మొదలెట్టారు. మరి కొంత సేపటికల్లా వాళ్లకి మత్తుగా కైపెక్కింది. ఎవళ్ళు ఏ పక్క కొరిగి పోతున్నారో మరొకళ్లకి తెలీకండా వుంది. కైపుమజాలో అటూయిటూ తూలి తేలిపోతున్నారు. ఆఖరికి ఒంటి మైని గుడ్డ లెక్కడ పడిపోయాయో కూడా తెలీని పరిస్థితొచ్చింది. చొక్కా ఓ మూలా పంచె మరో మూలా — తువ్వాలా యింకో చోటా చిందర వందరగా జారిపడ్డాయి. చివరి కేం గావాలో అంతా అయింది.

మొన్నా మదయుం కైపు కాస్తా దిగజారిపోగానే వాళ్ళిద్దరూ మళ్లా యీ లోకంలో బడ్డారు. మామూలు మనుషు లయ్యారు. ఒహాతను తెలివి తెచ్చుకుని నడుంమైని చేతుల్ని మోపి- "అయ్యో బాబోయ్, ఎంతపనై పోయింది — నా బ్రతుకే బండలైంది." అని అరుస్తూ నరికిన అరటిబోదెమల్లే అక్కడే కూలబడిపోయాడు.

అతగాని గావుకేకలాలకించి రెండో మహానుభావుడు లేచాడు. కళ్ళు నులుముకుంటూ. - "ఏంవిటోయ్ నీ గోల?-ఏం పుట్టిమునిగిపోయిం దనీ?" అన్నాడు.

"అది కాదు రా బాబూ, నా మొలను మూడు వేల రూపాయిల నోట్లు ట్టి దోపుకున్నా. అదేమయిందోగాని యిప్పుడు కనిపించటం లేదు. నువ్వే గాని తీసి దాచావా?" అని అడిగా డాత్రుతగా తొలిమిత్రుడు.

"అబ్బ, నా కేం తెలుసునోయ్. నిన్నరాత్రిబట్టీ అసలు నే నీ లోకం లోనే లేనుగా! - నీ గోలా, గలాటా విని యిప్పుడేగా తేరుకుని యీ లోకంలో పడ్డాను."

"అయ్యయ్యో, అంతా నాశన మైపోయింది. అది నా సొమ్ముకూడా కాదాయిరి! పరాయివాళ్ల సొత్తు! - తీసుకెళ్లి మళ్లా యివ్వకపోతే నా వుద్యోగం గోవిందా! పైపెచ్చు బందిఖానా పాలుగాక తప్పదు. పోనీ పట్టుకెళ్లి తీర్చేద్దామంటే పట్టుమని పది రూపాయిలైనా చేతిలో లేవు. పదో-

పరకో అయితే యెక్కడో తల తాకట్టయినా పెట్టి వాళ్ల మొహాన గిర వాటేసి వేసేవాణ్ణి. మొత్తం మూడు వేలు! - యింత రొఖ్ఖం యిప్పు డెక్కణ్నుంచి తేవటం? - గంగలో దిగాలిగాని గత్యంతరం లేదు. అయ్యయ్యో, ఎంత నావుర్దా! ఎంత ఆపత్తు!-ఏం చెయ్యటం?" అని తత్తర పడుతూ పెడబొబ్బలు పెట్టకం మొద లెట్టాడు. పాపం పతి మహా బెంబేలు పడిపోయాడు. బెంగం టే బెంగ కాదూ! ఒహటా-పదా, మూడు వేల రూపాయిలు వుత్తపుణ్యానిక పోయా యంటే యెంతటివాడికైనా యేడుపు రాకండా వుంటుందా?—

అయినా యిలా యేడుస్తూ మొత్తు కుంటూ కూచుంటే పోయిన డబ్బుకి కాళ్లొచ్చి యెక్కడేనా తిరిగొస్తుందా?. అతగాడు పాపం యిల్లంతా కళ్ళు ట్యూబులైట్లు చేసుకుని మరీ గాలిం చాడు. కాని డబ్బు కంటబడ్లేదు. తప్పతాగి మైకంలో వున్నప్పుడు మామూలుగా జరిగే పన్లేగా యివి!- ఆఫళంగా యిద్దరు మిత్రులకూ భోగం పిల్ల చటుక్కున గ్యాపకానికొచ్చింది. నిన్న రాత్రి మేజువాణి చేసిందే, ఆ భోగంపిల్ల యేవయిందీ? - యెక్క డికి పోయిందీ? - అస లామె అజా - పజా యే లేదు. రాత్రిపూట వా ళ్ళిద్దరూ సారామత్తులో మతీ - సుతీ లేకుండా కుప్పలా కూలిపోయిన సందట్లో అదే మంచి అదననుకుని ఆమె గాని ఆ డబ్బుకట్ట కాస్తా కాజేసి ఖుత్తం చేసుకోలేదు గదా! - ఆమే మమ్మాటికీ యీ దొంగపనికి తలప డుంటుంది. లేకపోతే యింత యింట్లో, అదీ బొడ్లో దోపుకున్న యిన్ని రూపా యిలు యింత గుట్టచక్కంగా యెలా గైర్హాజరియై అయిపోతాయి?-

సరిగ్గా యీ సమయానికే, వాళ్ళు పరిగురించయితే వూసులాడుకుంటు న్నారో ఆ యమ్మాయే యకాయకిని యింట్లో అడుగు పెట్టింది. డబ్బు పోగొట్టుకున్న ఆసామీ దుఃఖం ఆపుకో లేక బిక్కమొహంపెట్టి ఆమెని చూసీ చూడగానే భోరుమని యేడవడం మొదలెట్టాడు. తన మొల్లో దోపు కున్న పైకం పోయిందనీ, అందువల్ల తన పనికాస్తా తిరుతువరం కావటమే గాకుండా శ్రీకృష్ణ జన్మస్థానానికి కెళ్లా ల్సిన ఖర్మం పడ్తుందనీ ఆమెకి తన గోడంతా సవిస్తరంగా చెప్పు కున్నాడు.

అంతా విన్నమీదట ఆ యమ్మాయి యిలా చెప్పింది :-"అయ్యా, నిన్న రాత్రి సారాకైపులో వున్న మీ రిద్దరూ పక్కమీంచి క్రిందకొరిగి పడి పోయారు. మీ స్థితి చూస్తే నాకేం

ఏటో వల్లమాలిన జాలి పుట్టుకొచ్చింది. ఉన్నపళంగా మిమ్మల్ని లేవదీసి మీ తలల క్రింద దిళ్ళు పెట్టాను. అప్పుడే మీరు నన్నేవో తిట్లు తిడ్తూ అంటున్న పుల్లవిరుపు మాటలకి నేనేమీ ఉక్రోషం తెచ్చుకోలేదు. వాటిని లెక్క చెయ్యలేదు కూడాను. ఇది మా బ్రతుకుల్లో నిత్యం వాళీగా జరిగే ముచ్చటేగా మరి!- వెధవకర్మ! - ఈట్లూ - చీవాట్లూ విని విని మా చెవులు ఘడులడిపోయాయి. బుర్ర దిమ్మెక్కిపోయింది. కాండ్రించి మీదను వుమ్మేసినా కిమన్నాస్తిగా వుండిపోతాం. ఎన్ని అవమానాలు జరిగినా వాటిని సహించుకుని బెల్లంకొట్టిన రాళ్లలాగ పడుండటం మాకు రివాజై పోయింది. ఇదంతా యెందుకులెండి. మిమ్మల్నిద్దరినీ నిద్రపుచ్చి చూసేసరికి ప్రక్కనో రూపాయిల సంచి పడుంది. తీసి చూస్తే కళ్ళు జిగేలుమన్నాయి. అందులో వేలకొద్దీ రూపాయిలున్నాయి. రాత్రంతా జాగారం వుండి దానికి కాపలా కాస్తూ నేవున్నా. ఈ పేట వుంది చూశారూ, మహా చెడ్డది. మీకూ తెలుసు ననుకుంటా. ఎన్నెన్నో రకాల వాళ్ళిక్కడి కొస్తుంటారు. గూండాలూ- రౌడీలూ త్రాగుబోతులూ పొద్దూకులూ ఉల్లిల్లూ కాలుగాలిన పిల్లుల్లాగ తిరుగుతుంటారు. మీ దగ్గర బాగా డబ్బుం దని ఎవరో రౌడీలకి ముందుగానే ఆచూకీ తెలిసినట్టుంది. వాళ్ళు మీ వెంటబడి నట్టుంది. అందుకని ఈ యింటి గుమ్మం ముంగిలికి కూడా కొందరు రౌడీలు తచ్చాడ్తూ తిరిగారు. కానీ నన్ను చూసి లోపల అడుగు పెట్టేందుకు మాత్రం తటపటాయించారు. వాళ్లకు ధైర్యం చాల్లేదు. అలగా ముండావాళ్ళు కాస్తంత డబ్బుకోసం కక్కుర్తి పడి కూనీలు సైతం చేసేందుకు వెనకాడరు. మీరీ డబ్బుతో బయట పడ్డారంటే దీనికోసం మిమ్మల్ని కూడా అలాంటి అఘాయిత్యానికే పూనుకుంటారని అనుమాన పడ్డాను. ఇహ ఇక్కడ నా పరిస్థితెలాంటిదో గమనించండి. నా దగ్గర చూస్తే వేలకొద్దీ రూపాయిల మూట వుంది. బయట చూడగా రౌడీ వెధవలు మీసాలు మెలేసి పచార్లు గొడ్తున్నారు. నాకు వల్లమాలిన భయం పుట్టుకొచ్చింది. ఇంట్లో పొయ్యి ముట్టించి దాసీదాన్ని దగ్గిర పెట్టుకుని రాత్రంతా యెంతో కష్టమ్మీద కంటి మీద కునుకు లేకుండా యెలాగో గడిపేశాను. తూరుపు తెల్లవారకముందే బయల్దేరి యిక్కడి కొచ్చేశాను.''

ఇలా ఆ పిల్ల చెప్తూ, చెప్తూ తన కచ్చలో దాచిపెట్టిన రూపాయిల

మూట చటుక్కున పైకితీసి వాళ్ళ ముందు వుంచేసింది.

కథను ముగిస్తూ శరత్ బాబు యిలా అన్నారు :— "ఈ అమ్మాయి గొప్పతనం యేమిటో మీరో గడియ ఆలోచించి చూడండి. ఈమె కాసిని డబ్బులకోసం భోగం వృత్తిని వ్యాపారంగా చేసుకుందాయిరి! ఎవరో ఒహారి అవార్తిలో వుండి ఆ డబ్బుకోసం అంతులేని అవమానాల పాలవుతుందాయిరి!-అలాంటప్పుడా మూడు వేల రూపాయిలూ కంటపడగానే చేజేతులా జారవిడుచుకుంటుందా? ఇదేం మామ్మూలు విషయమా చెప్పండి. డబ్బుకాస్తా కాజేసి నాకేం తెలీదు పొమ్మన్నా ఆమె నెవరూ వల్లెత్తుమాటన్నా అనడానికి దమ్ములు కూడా చాలవుగా! - ఇందుకే అంటున్నా పైపై మెరుగులు చూసి మోసపోవొద్దని. మొహాన్నీ ఆకారాన్నీ బట్టి మనం ఒహారి నైజంలోని నిజానిజాల్ని తెలుసుకోలేం. వీళ్ళుకూడా మనుషులే. వీళ్ళకూ హృదయమంటూ వుంది. వీళ్ళ సత్ప్రవర్తన అణుమాత్రమూ చావలేదు. అయితే యింతకూ వీళ్ళిలాంటి తప్పుడుదారి యెందుకు తొక్కారూ అంటే అందుకు సమాజమే సరైన సమాధానం చెప్పగలదు; ఎందుకంటే అలా కావడానికి దానిదే బాధ్యత కనక! హృదయాన్ని దృష్టిలో పెట్టుకుని చూస్తే మన సమాజంలో వుండే సతీసాధ్వులయిన ఆడవాళ్ళందరికన్నా యే విషయంలోను వీళ్ళు తీసిపోరంటాను.

ఈ భోగంపిల్ల కథా-కమామీషూ విన్నమీదటే నా కళ్ళు తెరచుకున్నాయి. అసలు విషయం గ్రహించాను. దాన్నిబట్టే 'దేవదాసు' కథలో 'చంద్రముఖి' చరిత్రను సృష్టించగలిగాను. ఆ పాత్ర గౌరవమంతా ఈ అమ్మాయిదే అనాలి మరి! ఈమే అసలు చంద్రముఖని సృష్టించిందన్నా అతిశయోక్తి కాదు!"

"శరతేర్ బైరక్ కథ" ఆధారం.

# రూమ్ టు లెట్

"రూమ్ టు లెట్" అని పెద్ద అక్షరాలతో యింగ్లీషులోనూ, "యీ మేడమీదిగది అద్దెకు యివ్వబడును" అని చిన్న అక్షరాలతో తెలుగులోనూ రాసి ఒక బోర్డు కనిపించింది. కావటానికి మేడే కాని నివసించటానికి యెక్కువ ఉపయోగంగా కనిపించలేదు నారాయణ మూర్తికి. చెన్నపట్నం అంటే ఇంకా బాగా అనుభవం లేదు కనక మంచి గది అంటూ తిరుగుతున్నాడు మూడురోజుల నుంచీ. యెక్కితే ఆ రోజు కది తొంభై తొమ్మిదో మేడ అవుతుంది. కొంతదూరం సాగిపోయిగూడా, మళ్ళీ యెందుకు పుట్టిందో కాని ఆ బుద్ధి, వెనక్కు తిరిగి వచ్చి సరాసరి మెట్లెక్కి పోయినాడు. ముందు వరండా వుంది. పక్కన మూడు గదు లున్నయి. రెండు గదులు మూసి వున్నయి. ఒక గదిమట్టుకు తెరిచిఉంది.

తెరిచివున్న గదివాకిట్లోకి వెళ్ళాడు. ముందు అడుగు పెట్టటానికి సంకోచించాడు. ఎందుకొచ్చిందీకూడా మరచి పోయి అట్టే నిలబడిపోయినాడు.

ఆ గదిలో 17, 18 యేండ్ల పిల్ల వయ్యారంగా పడుకొని పాటలపుస్తకం చదువుకుంటూంది. ఆమె ఒక తెల్లమల్లు రెవిక తొడుక్కొని ఉంది. ఆ తెల్లని రెవికమీద 3, 4 పేటల గడియారపు గొలుసు జెట్టిపోతులాగా మెరుస్తూ పోయి పోయి అమాంతంగా ఆ మబ్బురంగు పమిటచెరుగుల్లో పడి మునిగిపోయింది.

నారాయణమూర్తికి ముఖమంతా గూడా పూర్తిగా కనిపించలేదు. ఒక యెర్రరాళ్ళ దిద్దు, ఒక మెరమెరలాడే బుగ్గ — చూస్తే లేతలేత కండెలు జ్ఞాపకం వచ్చినయి, నారాయణమూర్తికి — బెంగాలీ బొమ్మల్లో మోస్తరుగా సగం తెరుచుకొని సగం మూసుకొని వున్న ఒక కన్నూ, యివిమాత్రం కనబడ్డయి. వెంటనే నారాయణమూర్తికి love at first sight అయ్యింది.

ఒక నిమిషమో అరనిమిషమో గడిచింది, ఆమెకు ఒక విధమయిన మగ వాసన కొట్టినట్టుంది, వాకిలివంక చూచింది. చూస్తూండగానే చెయ్యి దానంతట అది వెళ్ళి పమిటను సరిగా సద్దింది. ఆమె వెంటనే లేచి గదిలో ఒక మూలకు నక్కటానికి పోయింది.

నారాయణమూర్తికి తను వచ్చినపని అప్పుడు స్పృహకు వచ్చింది.

"ఏమండీ, ఇక్కడ అద్దెకు యిచ్చే గది యేది?" అన్నాడు.

---

పిల్లలమర్రి బాలకృష్ణశాస్త్రి

---

"దీని పక్కది." — ఆమె నోటినుండి వచ్చిన ఆ వొక్కముక్కనూ నారాయణ మూర్తి గొప్ప సంగీతంలోని సంగతులు విన్నట్టు విన్నాడు.

నారాయణమూర్తికి గది చూడటం అనవసర మనిపించింది. అయినా ఏదో వొకటి చెయ్యాలి కనక ఆ గదివాకిలి దగ్గరికి వెళ్ళి తలుపు నెట్టాడు. తలుపు రాలేదు. ఇంతలోనే గడియ తీసినట్లు చప్పుడయింది. తలుపు తెరిచేటప్పటికి గడియ తీసి త్వరత్వరగా వెళ్ళుతూన్న ఆ పిల్ల కనిపించింది. నారాయణమూర్తి వంక ఒక అరక్షణమో పాతికక్షణమో చూచి తలుపు దగ్గరగా వేసుకుంది. నారాయణమూర్తికి ఆ చూపులతోనే ఆశలు అంకురించినయి.

గది ఏం చూస్తాడు? తన చూపులన్నీ ఆ తలుపుమీదనే నిలిచిపోయినయి. గది తనది అయినట్టే భావించుకున్నాడు. గదికి ఒక్కటే కిటికీ వున్నప్పటికీ గాలీ వెల్తురూ పెద్ద అవసరాలుగా తోచలేదు.

గదిలో ఒకటి రెండు పెట్టెలూ, మాసిన కొన్ని చీరెలూ, రవికలూ, ధోవతులూ, అవీవున్నయి. బహుశా గది ఖాళీగా వుందికదా అని అదిగూడా వాడు కుంటూన్నట్టున్నారు.

గది చూడటం కొంచెం యెక్కువ కాలమే పట్టింది. ఇంకా వుంటే బాగుండదని, ప్రయోజనంకూడా లేదని గ్రహించుకుని, వరాండాలోకి వచ్చాడు. ఇందాక తెరిచివున్న తలుపులుగూడా మూసి ఉన్నయి.

కొంచెం నిస్పృహతో మేడదిగటానికి మెట్లదగ్గరకు వెళ్ళాడు. మళ్ళీ ప్రపంచ కాన్ని వుద్ధరించే ఒక గొప్ప idea తట్టిన వాడిలాగా వెనక్కు వచ్చి "ఏమండీ, యీ గదికి అద్దె యెంత?" అని అడిగాడు.

నారాయణమూర్తి వాళ్ళు యింటి వాళ్ళు కారనీ, వాళ్ళుకూడా అక్కడ అద్దెకు వున్నారనీ ఆలోచించకపోలేదు. కాని అప్పుడు అంతకంటె వేయదగ్గ ప్రశ్న కనిపించలేదు.

"ఇంటివాళ్ళు ఎదురుగుండా వున్న ఇంట్లో వున్నారు" అని జవాబొచ్చింది.

నారాయణమూర్తికి యీ మాటలు తలుపుకు చాలా దగ్గరనుంచి వచ్చినట్లు ఉన్నయి. అంతటితో ఆ పెద్ద idea కాస్తా చల్లారిపోయింది. తటతట మని పెద్ద చప్పుడు చేసుకుంటూ మెట్లు దిగాడు— బహుశా తాను యింతటితో వదిలాడని చెప్పటానికని గామాల్ను.

* * *

నారాయణమూర్తి యింటివాళ్ళను అద్దే అదీ కనుక్కున్నాడు. సూచనగా తక్కిన భాగాల్లో అద్దెకున్నవాళ్ళెవరో కూడా కనుక్కున్నాడు. గదికి ఒక రూపాయి బయానా యిచ్చి గది తనకు ఖాయం చేసుకొని బసకు బయలుదేరాడు.

దారిలో ఆలోచన మొదలుపెట్టాడు. చదువుకోటానికి వచ్చినవాడికి 12 రూపాయల అద్దె యెక్కువే. అందుట్లో తన తండ్రి గుంటూరులో బి. ఏ. చదవమంటే ఒప్పుకోకుండా పట్నం వచ్చి ఇంతడబ్బు ఖర్చుపెడితే ఏమంటాడో ? ఇంకొకర్ని కలుపుకోవాలె. తప్పదు. ముందస్తుగా బయానా యివ్వటం సమంజసంగా లేదు. అయినా మిగిలిన తర్వాత చేసేది ఏమీ లేదు కనక త్వరగా వచ్చి గదిలో ప్రవేశించటం మంచి దనుకున్నాడు. తర్వాత room-mate కుదరదా ? కుదరకపోతే అప్పుడే చూసుకుందా మనుకున్నాడు.

ఇంతలోనే ఆమె విగ్రహం తన కళ్లకు కట్టిన ట్లయింది. ఆమె అట్లానే పడుకొని చదువుతూంది. ఆమె కళ్ళల్లో ఒక విధమయిన దీనత్వం కనిపించింది. వాళ్ళది బెజవాడట. ఆమె భర్త secretariat లో గుమాస్తాట. గుమాస్తా లందరికి ఉండే సామాన్య విశేషం ఏమిటంటే 50 సంవత్సరాలన్నా వుండటం. ఈ గుమాస్తాకు కనీసం 45 సంవత్సరాలన్నా వుండకపోవు. మన సంఘంలో చిన్నపిల్లల్ని ముసలివారికి యివ్వటం, ఇట్లాంటి దురాచారాలు చాలా వున్నవని తెలుసు కాని యింత ఘోరంగా పరిణమిస్తయి అనీ, యింతమంది బ్రతుకులు పాడు చేయగల వనీ నారాయణమూర్తి యిప్పటివరకూ వూహించుకోలేదు. ఇప్పుడు తన అనుభవంలోకి వచ్చిన ట్లయింది. ఆ దురాచారా లన్నిటికీ తాను ఒక్కడూ ఎదురుకుండా నిల్చున్నట్లయింది. తనలో ఉన్నశక్తులుకొన్ని అట్లా పారేశి ఇదంతా ఒక్కసారిగా ఆపేద్దా మన్నంత వుత్సాహం పుట్టింది. ఆ కళ్ళలో దీనత్వం పోగొట్టటానికి వేరేమార్గం కనిపించలేదు. తాను చేయగలిగింది ఒకటీ వెంటనే చేశాడు. అది యేమిటంటే పెట్టె బేడాతో గదిలో ప్రవేశించటం.

* * *

రాత్రి 7 గంట లయింది. నారాయణమూర్తి వరండాలో పచారు చేస్తున్నాడు. మెట్లెక్కి యెవరో వస్తున్నారు. 23,24 సంవత్సరముల యువకుడు. సూటు, హాటు, బూట్లు వున్నయి; సుందర విగ్రహం, జబర్దస్తీ మనిషి.

నారాయణమూర్తి వచ్చిం దెవరో వెంటనే గ్రహించుకున్నాడు. ఎందుకో నిస్పృహ కలిగింది. తప్పకుండా ఆమె భర్తే అయివుంటాడు. మన దురాచారాలు ఎట్లా వున్నా యీ విషయంలో మటుకు ఆమెను ముసలి మొగుడికి యిస్తే బాగుండేది అని తోచింది. ఆమె భర్తను అప్రయత్నంగా తనతో పోల్చుకున్నాడు. తనఖద్దరులాల్చీ, తన ఖద్దరుధోవతీ, తన చామనచాయ రంగూ పోటీలో ఎంత మాత్రమూ నిలవవని నిశ్చయించుకున్నాడు.

అతను వచ్చే రావడంతోటే నారాయణమూర్తికొత్తముఖంచూచి పలకరించాడు.

"ఈ గదిలో ప్రవేశించారా యేమిటి?"

"అవునండి,"అని నెమ్మదిగా జవాబు వచ్చింది. నారాయణమూర్తికి ఒక విధ మయిన పికరు యేర్పడ్డది. ఎందుకో తన సంగతి అంతా తన ప్లాను లన్నీ, ఆమె భర్త కని పెట్టేశా డని అతనికి తోచింది. మాట్లాడటానికే సిగ్గుపడు తున్నాడు.

"మీరు వొక్కరేనా?" అన్నాడు ఆమెభర్త.

ఇక్కడ ఒక చిన్న అబద్ధం ఆడితే క్షేమ మనుకున్నాడు నారాయణమూర్తి.

"కాదు, ఇంకోరుకూడా వున్నారు."

"మం దేవూరు?"

"గుంటూరు."

నారాయణమూర్తి మాట్లాడ టానికి జంకుతున్నా డని ఆమె భర్త గ్రహిం చాడు. అడగదలచుకున్న ప్రశ్న లు యింకా చాలా వునప్పటికీ అంతటితో కట్టిపెట్టి తన గదిలోకి వెళ్ళి తలుపు వేసు కున్నాడు. లోపల భార్యాభర్తల సంభా షణ అస్ఫుటంగా వినపడ్డది నారాయణ మూర్తికి.

నారాయణమూర్తికూడా లోపలికివెళ్ళి తలుపు వేసుకున్నాడు. పక్క పరిచి కొంచెంసేపు పడుకున్నాడు. నిద్రపట్ట లేదు.

నారాయణమూర్తికి మళ్ళీ ఒక ఊహ తట్టింది. రెండు గదులకూ మధ్య ఒక వాకి లుంది. ఆ వాకిలి దగ్గరకు వెళ్ళాడు. అదృష్టవశాత్తూ ఆ తలుపుచెక్కల్లో అక్క డక్కడ సందు లున్నాయి. ఓ కన్నుతో ఓ సందుగుండా చూశాడు. మనుష్యులు యెవరూ కనిపించలేదు. చక్కగా పక్క వేసిన మంచం కనిపించింది. ఇంకో సందులోనుంచి చూచాడు. ఒక పక్కగా రెండు పీటలమీద కూర్చున్నారు భార్యా భర్తలు; మధ్య వెండికంచంలో అన్నం పెట్టుకొని తింటున్నారు. కొంత సేపు చూడగా చూడగా విసుగేసింది. "ఛా! ఏమిటీ అవస్థ!" అని వచ్చి పడు కున్నాడు. కాని నిద్ర పట్టలేదు. పదినిము షాలు అయింది. ఒక అరగంట గడచి నట్టుగావుంది నారాయణమూర్తికి. ఎవరో పక్కమీది నుంచి నెట్టినట్టుగా వెళ్ళి మళ్ళీ చూశాడు.

ఆమె భర్త కుర్చీలో కూర్చున్నాడు. ఆమె దగ్గరగా నిల్చుని నోట్లో సిగరెట్టు పెడుతూంది. నిప్పుపెట్టె గీచి వెలిగి స్తూంది. నారాయణమూర్తి నాగరికత యింకా సిగిరెట్లు కాల్చటందాకా రాలేదు. తెల్లవారగానే ఒక గోల్డుఫ్లేకుపెట్టె కొను క్కొచ్చి అలవాటు చేసుకోటానికి నిశ్చ యించుకున్నాడు.

ఆ రాత్రి నారాయణమూర్తి ఆందోళ నకు అంతులేదు. అక్కడ వాకిలి దగ్గర నిల్చుని చూడ్డానికి మనోధైర్యంలేదు; ఇక్కడ పక్కమీద పడుకొని నిద్రపోవ టానికి మనస్కాయి లేదు. చివరకు ఆమె లాంతరు తీసేవరకూగూడా అట్లానే

గడిపాడు. ఏమీ కనపడకపోయినా చీకట్లో కూడా కొంత సేపు వాకిలిదగ్గర నిల్చుని చూపుకూడా సగం చెడగొట్టుకున్నాడు. చివరకు అయిష్టంతో వచ్చి పక్కమీద పడుకున్నాడు. కాని రాత్రంతా నిద్రలేదు.

నారాయణమూర్తికి పెద్ద అఘాతంలో పడ్డట్లయింది. పగలు తీరికలేదు, రాత్రి నిద్రలేదు. ఆమె తన్ను ప్రేమిస్తున్నదా లేదా అనే మాట నిర్ధారణ చేసుకోటానికి వీల్లేకుండావుంది. ఆమె మొదటిరోజున తన్ను చూచిన చూపులతో అప్పుడప్పుడు చూస్తూ వుండటంవల్ల ఆశలు మరల మరల పుట్టుతున్నయి.

భర్త ఆఫీసుకు వెళ్ళంతర్వాత యెప్పుడన్నా వరండాలోకి బజారు మొహం చూడ్డానికి వస్తుంది. అప్పుడు నారాయణమూర్తి కొంచెం వారవాకిలిగా వేసి ఆమె వంక చూస్తాడు. ఆమె యెప్పుడన్నా అకస్మాత్తుగా నారాయణమూర్తివంక చూచికూడా చూడనట్టుగానే నిల్చుంటుంది. ఇట్లా కొంత సేపైనతర్వాత నారాయణమూర్తి వూరుకోక ఏదో పనివున్న వాడిలాగా వరండాలోకివస్తాడు. దాంతో ఆమె గదిలోకి పరిగెత్తుకొని వెళ్ళి తలుపు వేసుకుంటుంది. అప్పుడు నారాయణమూర్తికి యెందుకు వరండాలోకి వెళ్లానా అనిపిస్తుంది. కాని చేసేది ఏమీలేదు. మళ్ళీ తలుపుల సందుల్లోంచి చూడటం.

నారాయణమూర్తికి ఒక పెద్ద అనుమానం, తను తలుపుసందులోంచి చూస్తున్నది ఆమెకు తెలుసునా తెలియదా అని. వూరికే అదే పనిగా చూడటం నిరుత్సాహంగా వుంది. ఆమెకు తెలియజేయటం ఎట్లా? ఒక వేళ ఆమెకు యిదివరకే తెలిసివుంటే అది నిర్ధారణ చేసుకోటం యెట్లా?

ఆమెజాకెట్టు మార్చేటప్పుడూ అప్పుడూ ఒక్కసారి తలుపువంక చూస్తుంది, యెవరన్నా వున్నారేమో అన్నట్టుగా. అప్పుడు నారాయణమూర్తి ఆమె కళ్ళు తన కళ్ళల్లోకి చూస్తున్నట్టుగానే భావించుకొని, కొంచెం సిగ్గుపడి పక్కగా నిల్చుంటాడు.

ఇట్లాంటి పట్టు సమయాల్లో యెప్పుడన్నా కాలితోనో వేలితోనే చప్పుడు చేస్తాడు. దాని ఫలితం చూస్తాడు. ఆమె చప్పుడు ఏమీ విననట్లుగానే తన పనిమీద వుంటుంది. చప్పుడు విననట్లా? విని కూడా విననట్లు నటించటమా? నిర్ధారణ చేయలేకుండా వున్నాడు నారాయణమూర్తి. కాని 99 పాళ్లు వినికూడా విననట్లే నటించట మనుకున్నాడు.

చూడగా చూడగా ఆమెకు తనయందు యేదో అభిప్రాయం వుంది అనే నిర్ధారణకు రాక తప్పిందికాదు నారాయణమూర్తికి. ఏ అభిప్రాయం వున్నా ఆడది కనక ఆమె ముందంజ వెయ్యలేదు. ఏ దారి తీసినా మొగవాడు తాను తీయవలసిందే. ఈ నిశ్చయాని కొచ్చిం తరువాత మంచి సమయంకోసం యెదురు చూస్తున్నాడు నారాయణమూర్తి. రోజుకు 99

మంచి సమయాలు వచ్చి పోతున్నాయి. కాని నారాయణమూర్తి ముందు ఒక్క అడుగూ పెట్టలేకున్నాడు.

ఒక స్టేజిలో అనుకున్నాడు—ఇప్పుడు ఒకర్ని ఒకరం ప్రేమించుకుంటున్నాం గదా. ఒకరి దగ్గిరగా ఒకరం వున్నాం గదా, ఇంకేం కావాలి? యీ విధంగా సర్వకాలం వుంటే చాలదా? ఆమెనూ, ఆమె జీవితమునూ అనేక కష్టాలపాలు చేయటం యెందుకు? ఆత్మలు యేకీభవించటం గాని కావాలిసింది, శరీరవాంఛ కాదు. కాని ఆమె యింత లోతుగా ఆలోచిస్తుందా? ఆమెది ఇంతకూ శరీర సంబంధమైన ప్రేమ కావచ్చును. ఇందాకా తీసుకువచ్చి నా ఆత్మను ప్రేమించమంటే, ఆమె నన్ను అప్రయోజకపు వాజమ్మ ననుకుంటుందేమో? కావున ప్రేమసముద్రంలో నిండా మునగాలిసిందే నని నిశ్చయించుకున్నాడు.

ఒక వేళ ఆమె మూర్ఛించి, ఆమె అంతట ఆమె తన అవస్తను కనికరించి, భర్తలేని సమయంగా చూచి, యే మధ్యాహ్నమో, మధ్య తలుపుదీసుకొని అమాంతంగా తనగదిలో ప్రవేశించటానికి వుద్దేశిస్తుందేమో? అప్పుడు తలుపుగొళ్ళెం వేసి వుంటే ఆటంకంగా వుంటుందని తనవైపు గొళ్ళెం తీసే వుంచుతున్నాడు. కాని అట్లాంటి దేమీ సంభవించలేదు.

* * *

నారాయణమూర్తి ఆ గదిలో ప్రవేశించి 15 రోజు లయింది. రెండురోజుల నుట్టీ ఆమె కొత్తమార్గం అవలంబించింది. భర్త ఆఫీసుకు వెళ్ళగానే పైగది తాళం వేసి కిందనే ఆ అరవవాళ్ళతో మాటా పలుకూ ఆడుతూ కూర్చోటం, భర్త సాయంత్రం రాగానే అప్పుడు పైకి రావటం. ఆమె యీ మార్గం అవలంబించగానే మేడ అంతా బావురుమంటూంది నారాయణమూర్తికి. అయినా యే నిమిషాన పైకి వస్తుందో అవకాశం తప్పిపోతుందని నారాయణమూర్తి ఒక్కడే బిక్కు బిక్కు మంటూ కాపలా కాస్తూ కూర్చోటం.

ఆరోజు సాయంత్రం అయిదు గంట లయింది. ఇక విసుగేసి బీచీకన్నా పోదాం అని నారాయణమూర్తి ముస్తాబై బయలుదేరాడు. మెట్లదగ్గిరదాకా వెళ్ళేటప్పటికి ఆమె మెట్లెక్కి వస్తూంది.

ఆమె స్నానం చేసి వస్తూన్నట్లుంది; చీరె అదోవిధంగా కట్టుకుంది; రెవిక లేదు. నారాయణమూర్తి యెదురుపడగానే మెట్లు దిగిపోకుండా తానే వెనక్కు వచ్చాడు. ఆమె వచ్చి గదిలో జొరబడ్డది. తలుపు వారవాకిలిగా వేసుకుంది.

ఇంతకంటె మంచి సమయం దొరకదని నారాయణమూర్తి అనుకున్నాడు. కాని ధైర్యంలేదు. తాళంతీసి తన గదిలో ప్రవేశించి, తలుపుసందుల్లోంచి చూచాడు. ఆమె తెల్లని యిస్త్రీ చీరెతీసి కట్టుకుంటూంది. నారాయణమూర్తి చేతులూ




"వెధ: మొహం నువ్వూ, మళ్ళీ ఎప్పుడైనా ఈ బజార్న కాళీ జేబుల్తో వచ్చావంటే జాగర్త!"

కాళ్లూ గజగజ వణికినయి గుండె గబగబ కొట్టుకుంటూంది. వొళ్ళంతా వేడెక్కి ముక్కుల్లోంచి వేడి ఆవిరి బయటకు వస్తూంది. ఆ వుద్రేకంలో తలుపుమీద స్ఫుటంగా కొట్టాడు. పెద్దచప్పుడు అయింది. ఆమె తలుపువంక ఆదేపనిగా చూస్తూంది. నారాయణమూర్తికి వున్న అనుమానాలన్నీ పోయినయి. చేస్తే యేదన్నా వెంటనే చెయ్యాలె నని అనుకుని, చప్పున గదికి తాళం వేశాడు. తాళం వెయ్యటంలో వుద్దేశ్యం యేమిటో అతనికే తెలియదు. వెనకాముందూ ఆలోచించకుండా కూడా బయలుదేరాడు. ఆ గది వాకిలి పక్కకుండా నడుస్తూ ఆగకుండా సరాసరి మెట్లదగ్గిరికి పోయినాడు. మెట్లు సగం దిగాడు.

అక్కడ ఆగి తన పిరికితనానికి తన్నే నిందించుకున్నాడు. వాకిలి పక్కగుండా వస్తూన్నప్పుడు తలుపుసందుకుండా ఆమె కనిపించింది. ఆమె చీరె కట్టుకోటం అయింది. ఇంకా జాకెట్టు తొడుక్కోలేదు. బహుశా జాకెట్టుకోసం గామాలును పెట్టెలో వెతుకుతూంది. అప్పుడు అంత మంచి అవకాశాన్ని పోగొట్టుకోటం యేమీ బాగాలేదు.

మళ్ళీ ధైర్యం తెచ్చుకొని చప్పుడు కాకుండా మెట్లెక్కటం మొదలుపెట్టాడు. మెల్లిగా ఆమెగదిదగ్గిరికి వెళ్ళి తలుపు తెరిచాడు. ఆమె వంగుని పెట్టె సవిరిస్తూనే వుంది. చప్పుడు కాకుండా గదిలో ప్రవేశించాడు. కాళ్ళు వాటంతట అవే పోతున్నవి. అవి అతని ఆధీనంలో

వుంచేమటుకు వాటిని వెనక్కు నడిపించే వాడే. కాని అతనికి తన మతి పనిచేస్తూన్నట్లు కనిపించలేదు. ఇదంతా కలలో జరుగుతూన్నట్లుంది.

అట్లా ఆమెకు తెలియకుండా నిశ్శబ్దంగా నారాయణమూర్తి కాళ్ళు నారాయణమూర్తిని ఆమెదగ్గరకు తీసుకు వెళ్ళితే, నారాయణమూర్తి చెయ్యి వెంటనే గజగజ వణకుతూ దానంతట అదే ఆమె భుజంమీదికి పోయి వాలింది.

ఆమె బుజానికి చెయ్యి తగలగానే వులిక్కిపడటం - వెనక్కు తిరిగి నారాయణమూర్తినిచూడటం-కెవ్వుమని అర్థం లేని పెద్దకేక వెయ్యటం - ఒక్కసారిగా జరిగినయి. సామాన్యంగా ఒక తాచు పాము మీదపడితే మానవుడు వేసే కేక వేసింది. ఆ బజారు అంతా వినపడి వుండవచ్చును.

నారాయణమూర్తి యేదో మాట్లాడాలని అనుకున్నాడు కాని అతని నోరు యెదురు తిరిగింది.పాపం కళ్ళతో మటుకు ఒక క్షణం చూస్తూ నిల్చున్నాడు. ఆమె గూడా ఆ క్షణకాలంలో నారాయణమూర్తి కాళ్ళు వణకటం, చేతులు వణకటం, నోట మాట లేకపోవటం, ఆ బిక్క మొహం, ఆ కళ్ళూ చూచి వుండొచ్చు.

ఇంతలోనే యెవరో మెట్లెక్కి వస్తున్నట్లు చప్పుడయింది. నారాయణమూర్తి ఆలోచించటానికి టైములేదు; ఆలోచించే స్థితిలోగూడా లేడు.

అమాంతంగా తన గదిలోకి వెళ్ళే తలుపుగడియ చప్పుడుకాకుండా తీసుకొని గదిలోకి వెళ్ళి తలుపు వేసుకున్నాడు

మరుక్షణమే ఒక అరవావిడా, దాసీ లక్ష్మి గదిలో ప్రవేశించారు. ఆ అమ్మాయిని చూచి "యేన్న ప్రమాదం ?" అంది అరవావిడ.

ఇవతల గదిలో నారాయణమూర్తి సగం ప్రాణంపోయి వున్నాడు. కాని అవతల గదిలో యేమి జరుగుతూందీ ఆలకిస్తూన్నాడు. తన బతు కంతా ఆ అమ్మాయి చేతిలో వుంది. కాని ఆమె తన గౌరవం కాపాడుతుం దని యేమీ ఆశ లేదు; కాపాడటానికి ఆమెకు తగిన కారణాలూ లేవు. అన్నిటికీ సిద్ధమయి కూర్చున్నాడు. ఆమె జవాబు కోసం కొనవూపిరితో నిరీక్షిస్తున్నాడు.

ఆమె జవాబు చెప్పటానికి కొంచెం అవకాశం తీసుకుంది. దాసీ లక్ష్మి ''ఏమీ, అమ్మగారూ, అంత కేక వేసినారు ?'' అంది. ఆమె తొణకకుండా జవాబు చెప్పింది, "ఏమీ లేదు. యీ పెట్టెలో గుడ్డలు సర్దుతుంటే తేలు కనిపించింది నా వేలుకు అంత యెడంగా పోయింది, భయం వేసి కేక వేశాను. తేలు నన్ను కుట్టిం దనే అనుకున్నాను. తేలు అంటే నాకు తగని భయం. గుడ్డల్లోకి యెటు పోయిందో మళ్ళీ కనిపించలేదు."

నారాయణమూర్తికి ప్రాణాలన్నీ లేచి వచ్చినయి. కాని యెవరన్నా ఆమెను

సమ్మక తన గదిలోకి వచ్చి చూస్తారేమో నని భయంగానే వుంది. తాను గదికి తాళం వెయ్యటంగూడా బాగానే వుందను కున్నాడు. అయితే ముఖ్యమయిన భయం మటుకు పోయింది ఆమె జవాబుతో. ఆమె కరుణ హృదయాన్ని యెంతో మెచ్చుకున్నాడు. ఆమెకు మనస్సులో యెన్నో నమస్కారాలు అర్పించు కున్నాడు.

అవతల గదిలో వచ్చినవారిద్దరూ జాగ్రత్తగా పెట్టె అంతా ఖాళీ చేసి చూశారు. గుడ్డలన్నీ ఝాడించారు. తేలు కనిపించలేదు. ఆమె "ఆ తేలు యెటో తప్పించుకుపోయింది. మీ కెందుకు శ్రమ వూరుకోండి" అంది. వారు గూడా వెత కటం ఆపి వెళ్ళిపోవటానికి సిద్ధమయి నారు.

నారాయణమూర్తికి వారు గది ఖాళీ చేసి పోవటం తప్ప మిగతా వెతకటం, దాంటో యెక్కువవుత్సాహం లేదు. కాని వారు ఖాళీ చేయగానే ఆమె కూడా మధ్య తలుపు గడియవేసి బయట తలుపు తాళం వేసి వారివెంబడే కిందికి వెళ్ళిపోయింది.

నారాయణమూర్తి తాను ఖయిదీని అయిపోయినానని తెలుసుకున్నాడు. తాను ఖయిదీగా వుండటం ఆమెకుతప్ప యిత రులకు తెలియదు. ఆమె అట్లా తాళం వేసి పోయిందికదా; తన్ను యేమి చేస్తుంది? ఎందుకైనా సిద్ధంగా వున్నాడు నారాయణమూర్తి.

ఆరోజు గడచిపోయింది. మరునాడు ఆదివారం అయింది. ఆమె భర్తకు ఆఫీసు లేదు; యింట్లోనే వున్నాడు.

రెండుగంటల షుమారుకు బాపట్ల హోటలునుంచి ఒక మనిషి వచ్చాడు.

"ఏమండీ యీ గదిలో వుండే ఆయన యేమైనాడు? నిన్నరాత్రి భోజనానికి రాలేదు, యివాళ్ళ రాలేదు, అన్నాడు.

"ఏమో తెలియదు. నిన్న సాయంత్రం నుంచి గది అట్లా తాళం వేసివుంది," అన్నాడు ఆమెభర్త. ఆమె మాట్లాడక సంబంధం లేనిదానిలాగా వింటూ నిల్చుంది. హోటలువాడు వెళ్ళి పోయినాడు.

అంతే — మళ్ళీ నారాయణమూర్తి సంగతి యెత్తినవారు యెవరూలేరు. ఆమెకు మనస్సులో ఏమి వుండో ఏమో యెవరికీ తెలియదు. మనిషిమటుకు మామూలుగాకాక అదోవిధంగా పరధ్యా నంగా ఇంటిపనులు చేస్తూ ఉంది.

నారాయణమూర్తి అంతా చూస్తూనే వున్నాడు. కాని సాయంత్రం వచ్చే టప్పటికి నిల్చోటానికీ కూర్చోటానికీ గూడా శక్తిపోయింది. నారాయణమూర్తి ఆ గదిలోనే మెల్లిమెల్లిగా తన ప్రాణాలు అర్పించటానికి సిద్ధంగా వున్నానని మొదట్లో అనుకున్నాడు గాని రానురాను అతని మనోనిశ్చయం పోయింది. తింటానికి యేమి లేకపోంగా పైగా తాగ టానికి మంచినీళ్ళన్నా లేవు. యెవరన్నా

యిన్ని గుక్కెడు మంచినీళ్ళు యిస్తే బాగుండునని తోచింది. శోషపోయి గదికి అడ్డంగా పడ్డాడు. పొద్దుకిందో తెల్లవారిందోగూడా తెలియదు.

భార్యాభర్తలు భోంచేసి పడుకునే టప్పటికి 10 గంటలయింది. మామూలుగా ఆమెకు ముందు నిద్రపట్టేది, తర్వాత భర్త నిద్రపొయ్యేవాడు. ఇవ్వాళ్ళ ఆమెకు నిద్రపట్టలేదు; నిద్రపోవాలని ప్రయత్నంగూడా చేయలేదు. 11 గంటల షుమారుకు భర్త నిద్రపోయినాడు.

భర్త నిద్రపోయిం తర్వాత గూడా ఒకగంట వూరుకుంది. అప్పుడు ఆమె మెల్లిగా పక్కలోనుంచి లేచింది. ఒక వెండి గిన్నెలో చల్లాఅన్నం కలుపుకుంది, ఒక గ్లాసులో మంచినీళ్ళు తీసుకుంది. చప్పుడు కాకుండా తలుపు గడియతీసి నారాయణమూర్తి గదిలో ప్రవేశించింది. పడివున్న నారాయణమూర్తిని చూచింది; నిద్రపోతున్నాడని అనుకుంది.

నాయణమూర్తికి ఆమె వచ్చింది తెలియదు. కాని ఆమెదగ్గిరికి వెళ్ళగానే ఎవరో వచ్చినట్లు స్పృహకలిగింది. కళ్ళు తెరిచి చూచాడు; ఆమె విగ్రహం కనిపించింది. అదేదో తన మతిభ్రమ అనుకుని మళ్ళీ కళ్ళు మూసుకున్నాడు.

ఆమెగుండె నీరైపోయింది. చావటానికి సిద్ధంగా వున్నాడనుకుంది. చేతులు పట్టుకుని మెల్లిగా కూర్చోపెట్టి, ఆ వెండిగిన్నె నోటిదగ్గిర పెట్టింది. నారాయణమూర్తి అన్నంవాసన కొట్టగానే మళ్ళీ కళ్ళుతెరిచాడు. తన మతిభ్రమ కాదు. ఆమెయే తన ప్రాణం కాపాడటానికి స్వయంగా వచ్చింది అని తెలుసుకున్నాడు. ఆమెకు నమస్కారం పెట్టి యేదో మాట్లాడపోయినాడు. ఆమె వద్దు, ముందు అన్నం తినమని సౌజ్ఞచేసింది.

ఆ గిన్నెలో అన్నం తిన్నాడు. ఆ గ్లాసులో మంచినీళ్ళు తాగాడు. శోషలో నుంచి తెప్పరిల్లుకున్నాడు. ఆమెకు నమస్కారం చేసి కాళ్ళు పట్టుకుని "మీరు నన్ను క్షమించాలె" అన్నాడు.

ఆమె కొంచెం దూరంగా వెళ్ళింది, మాట్లాడలేదు.

"మీరు నాగౌరవమూ నా ప్రాణాలూ కాపాడారు. నేను మీ ఋణము తీర్చుకోలేను," అన్నాడు.

"నేను ఇక్కడ నిల్చోటానికి వీల్లేదని మీకు తెలుసును, నా బుద్ధికి సమ్మతి లేకపోయి నా పాపభీతివల్ల వచ్చాను. మీరు సోదరీభావంతో చూడటమే మీరు నాకు చేయతగ్గ ప్రత్యుపకారం. ఇక యిక్కడ వుంటే నా కాపరానికే ముప్పువస్తుంది, నేను పోతాను," అన్నది ఆమె.

"నావల్ల మీకు ఇక ముందు ఎట్టి ఇబ్బందీని రాదు, అది మీరు నమ్మండి. కాని మిమ్మని సోదరీభావంతో తలుచుకుంటాను అని చెప్పటానికి సంకోచిస్తూంది నా అంతరాత్మ. మిమ్మని ఒక

దేవతవలె స్మరించుకుంటాను. నేను బతికి వున్నంతకాలమూనూ మిమ్మల్ని ఒకటి కోరుతాను; మీ పేరు నాకు తెలియదు, మీ నోటినుండి వింటానికి కుతూహలం పడుతున్నా" అన్నాడు.

"నా పేరు శ్యామల. మీ గది తాళం చెవి నాకివ్వండి, ఇక నేను వెళ్ళాలి; ఏదో కదిలినట్లు చప్పుడు అవుతున్నది," అని ఆదుర్దాపడ్డది శ్యామల.

నారాయణమూర్తి వెంటనే తాళంచెవి తీశాడు, శ్యామలచేతికి తన చెయి తాకుతుందేమో అన్నట్లుగా మెల్లిగా ఇస్తూంటే శ్యామల నారాయణమూర్తి చేతిలో తాళం చెవి లాక్కుని ఆవతల గదిలోకి మాయమయిపోయింది. శ్యామల చెయ్యి తన చేతికి తాకగానే నారాయణమూర్తికి ఒక మెరుపు మెరిసినట్లుగా వొళ్ళంతా చలించింది.

నారాయణమూర్తికి వెంటనే వొళ్లు తెలియని నిద్ర పట్టింది. బాగా తెల్లవారిం తర్వాత నిద్రలేచాడు. తన గది తలుపు తీసివుంది. తాళం, తాళంచెవి గడపలో పెట్టి వున్నై.

* * *

నారాయణమూర్తి ఆరోజు స్నానం చేసి వెళ్ళటం మళ్ళీ మర్నాడు మధ్యాహ్నందాకా రాలేదు. వెంకటేశ్వరా హాస్టల్లో గది కుదుర్చుకొని సామాను తీసుకు వెళ్ళడానికి బండితో సహా వచ్చాడు.

వాకిట్లో ఇంకో బండి వుంది. దాంట్లో శ్యామల భర్త సామాను పెట్టుతున్నాడు. నారాయణమూర్తిని చూసి పలకరించాడు.

"ఏమండోయ్, మీరుగూడా బండి తీసుకొచ్చారు. మీరుకూడా ఖాళీ చేస్తున్నారేమిటి? సరే, మనిద్దరికీ ఒకసారే కుదిరిందే లగ్గం! మీరెందుకు అప్పుడే వెళ్లతున్నారు?" అన్నాడు.

"నాకు Room-mate కుదరలేదు. అద్దె ఎక్కువ అవుతుందని వెంకటేశ్వరా హాస్టల్లో చేరానండీ" అన్నాడు నారాయణమూర్తి.

ఈ మాటలు అంటూండగానే శ్యామల లోపలినుంచి తాటాకుల బుట్టలో ఝూడీలు పెట్టుకొని వస్తూవుంది. ఆమెకుకూడా నారాయణమూర్తి అన్నమాటలు వినపడినయి.

ఆమెతో భర్త అన్నాడు, "చూచావా! ఆయనగారుకూడా ఇప్పుడే ఖాళీ చేస్తున్నారట. ఏదో సమ్మె కట్టామని ఇంటివారు అనుకుంటారేమో. పోనియి మనం వుండిపోదామా ఏం?"

"మీ ఇష్టం!" అని మాట్లాడకుండానే లోపలికి పోయింది.

అప్పుడు శ్యామల భర్త నారాయణమూర్తితో రహస్యంగా అన్నాడు, "మా ఆవిడి హడావిడి అండీ ఇదంతా. ఆడవాళ్ళు, రామరామ ఏ నిమిషాన ఏది అనుకుంటే అది అయితీరాలె, చచ్చి తీరాలె. మేం వెంకటరంగంపిళ్లె వీధిలోకి వెళ్లతున్నాము — 25 నెంబరు. ఎప్పుడన్నా సెలవు రోజున అట్లా రండి కులాసాగా."

# అన్వేషణ

సరోజినీదేవి

ఉదయం ఎనిమిది గంటలయ్యుంటుంది.

బస్సు రోడ్డంతా దుమ్ము రేపుకుంటూ వచ్చి స్టాప్‌లో ఆగింది. అందులోంచి దాదాపు ఒక పాతికేళ్ళ అమ్మాయి నాలుగేళ్ళ అబ్బాయి చెయ్యి పుచ్చుకుని క్రిందకు దిగింది. కండక్టరు ఆమె సామానంతా బస్‌పైనుండి క్రిందకు దింపాడు. ఆమెఒక్కత్తే ఆ స్టాప్‌లో దిగింది. ఆ అమ్మాయి సామాను వేపు చూసి, తలెత్తి చుట్టూ కలియజూసింది. స్టాప్‌లో ఒక పెద్ద





బస్సులోనుండి దిగిన ఆ అమ్మాయి కేసీ, చిన్నబాబు కేసీ ఓమారు కుతూహలంగా, విచిత్రంగా, చూసి తిరిగి తమ సంభాషణలో పడిపోయారు. కాని అందులో ఒకాయన, షష్టిపూర్తి దాటిన వ్యక్తి — ఆ ఆగంతకుల కేసి మాటి మాటికీ చూడసాగాడు.

ఆ అమ్మాయి కొద్ది నిముషాలు ఏం చేయటానికీ తోచక అలాగే నిల్చుంది. కాని ఎంతకాలం అలా రోడ్డుమీద నిల్చో గలదు? నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ వారిపిద్దకు వెళ్ళింది.

ఆమె వారి వద్దకు రాగానే ముసలాయన ఆమెవైపు నిశితంగా చూసి "ఎవరమ్మా మీరు?" అన్నాడు.

ఆ అమ్మాయి మెల్లిగా "నేను... నేను నారాయణపురం వెళ్ళాలండీ. ఇక్కడి కెంతదూరం వుందండీ?..." అంది.

మర్రిచెట్టు క్రింద ఒక టీ కొట్టూ, చిల్లర దుకాణం మాత్రం వున్నాయి. ఆ ప్రాంతాని కంతా ప్రతినిధుల మంటూ ఆ రెండూ అక్కడ ఠీవిగా నిల్చుని వున్నాయి. చుట్టుపట్ల ఎక్కడా యిల్లున్నట్టు జాడలేదు. టీకొట్టు ముందు నలుగురు మనుషులు నిలబడి పిచ్చాపాటి మాట్లాడుకుంటున్నారు.

"రెండు మైళ్ళుంటుందమ్మా.... యింతకీ మీ రెవరు ?... ఎవరింటి కెళు తున్నారు ?'' అయనే మళ్ళీ అడిగాడు.

"ఆ వూళ్ళో హైస్కూలు వుంది కదండీ ?" అంది నెమ్మదిగా, అత నడిగిన ప్రశ్నలకు సమాధాన మివ్వకుండానే. మిగతా ముగ్గురూ వారి సంభాషణను ఆసక్తితో వింటున్నారు.

"నీవు పంతులమ్మవా ?" కుతూహలంగా అడిగా డాయన.

ఔనన్నట్టు తలూపింది.

"ఒరేయ్ వెంకాయ్... అమ్మాయి సామాను ఎత్తుకెళ్ళు...'' ముప్పయి ఏళ్ళ అతనికి హుకుం చేశా డాయన.

"అలాగే బాబాయ్...'' అంటూ ఆ యువకుడు ముందు కడుగేశాడు.

ఆ యువతి ఓమారు అతనికేసి చూసి తిరిగి ముసలాయనతో "దారి..'' అంటూ యిక చెప్పలేక సందేహిస్తున్నట్టు ఆగింది. ఆమె మనోగతాన్ని గ్రహించిన ముసలాయన "పరవాలేదమ్మా...బాగానే వుంటుంది... అందరం వెడదాం..." అంటూ,

"సోమయ్యా ..వూళ్ళోకి వచ్చేట్టా... లేక...'' అని ఆగిపోయాడు.

"లేదు మావాఁ ..పొలాని కెళ్ళాలి.." అంటూ మరోవారిగుండా బయలుదేరారు సోమయ్య, కామయ్య.

వెంకయ్య ఆ యువతి సామాను ఎత్తి నెత్తిన పెట్టుకున్నాడు. ఆ యువతి బాబును ఎత్తుకుంది. అందరూ వూరివైపు దారి తీశారు. ఆ ముసలాయన చూపుతున్న అకారణమైన ఆదరణకు, ఆప్యాయతకు ఆ యువతి హృదయం కృతజ్ఞతతో నిండిపోయింది. ఆ ముసలాయన నెరసిన మీసాల వెనుక ఒక చిరునవ్వు తొంగిచూసి, మళ్ళీ మాయమయింది.

బస్సుస్టాపు నుండి నారాయణపురం వెళ్ళేదారి మట్టిరోడ్డు — బళ్ళబాట. వేసవి కాలం రోడ్డంతా దుమ్ముతో నిండిపోయి వుంటుంది. దుమ్ములో కాళ్ళు కూరుకు పోతూ వుంటాయి. కొత్తవారు ఆ దారంట నడవా లంటే చాలా కష్టంగా వుంటుంది. వర్షాకాలం యిక చెప్పవలసిన అవసరం వుండ దసలు. మోకాళ్ళదాకా బురదలో కూరుకుపోయి పెట్టిన కాలు తీయలేక, తీసినకాలు పెట్టలేక సర్కసు ఫీట్లు చేస్తూ నడక సాగించాల్సివుంటుంది. బండ్లచక్రాలు దాదాపు సగం — బురదలో కూరుకుని ఎదు లెంత అవస్థపడ్డా నస్సేమిరా బయటకు రాము అంటూ భీష్మించుకు కూచుంటాయి.

అది నవంబరు నెల అవటం వల్ల వర్షాలులేవు. కాని యింతకు మునుపు వర్షం కురిసినసూచనగా రోడ్డుమీద అక్కడక్కడా కొద్ది కొద్దిగా బురద వుంది. రోడ్డుకు అటూయిటూ వరిచేలు పచ్చగా, నిగనిగ లాడుతూ చిరుగాలికి తల లూపుతూ అందంగా నాట్యంచేస్తున్నాయి. అప్పు డప్పుడే విరుస్తున్న వెన్నులు

గర్భిణీ స్త్రీలలా బరువుగా మలయమారు తానికి లయ వేస్తున్నట్టు అటూ - యిటూ కదుల్తూ ప్రకృతికి మరింత శోభను చేకూరుస్తున్నాయి. చేలలో అక్కడక్కడ స్త్రీ - పురుషులు ఏవో జానపద గీతాలు పాడుకుంటూ పని చేసుకుంటున్నారు. భాస్కరుని పసిడి లేత కిరణాలు పడి చేలు విచిత్రంగా మెరిసిపోతున్నాయి. ప్రకృతి సౌందర్యాన్ని తిలకిస్తూ నడుస్తున్న ఆమె "నీ పేరేమిటమ్మా" అన్న ముసలాయన ప్రశ్నతో యధార్థ జగత్తులో పడ్డది.

"లక్ష్మి" చేలవైపునుండి చూపు మరల్చి చెప్పింది.

"స్వస్థానం..."

"విశాఖపట్నం.." ముక్తసరిగా చెప్పి వూరుకుంది.

కొద్దిక్షణాలు వారందరిమధ్య మౌనం రాజ్యం చేసింది.

"ఆ కుర్రాడు..." సందేహిస్తూ ఆగిపోయాడు.

"మా అబ్బాయ్..." అంది అన్యమనస్కంగా లక్ష్మి.

"మీ వారు ... ఎక్కడున్నారమ్మా..." మళ్ళీ ప్రశ్న.

ఆ ప్రశ్నతో లక్ష్మికి బాధా, కోపమూ, జుగుప్సా కలిగింది. అయినా తమాయించుకుంది; ఆ ప్రశ్నకు సమాధానం యివ్వలేదామె. మౌనంగా, పరధ్యానంగా, యాంత్రికంగా అడుగులు వేయసాగింది; ఆమె కళ్ళు చెమ్మగిల్లాయి.

ముసలాయన, ఆమె వైపొకమారు దృష్టి సారించి, మళ్ళీ నడక సాగించాడు. ఆయన మనసులో అనేక భావాలు క్షణంలో పుట్టి, మరుక్షణంలో మాయమైపోయాయి. ఆయన ముఖంలో గాంభీర్యం చోటు చేసుకుంది.

"మీరు ఎవరమ్మా?..." కొద్ది క్షణాల తరువాత మౌనం భంగంచేస్తూ అడిగాడు.

"బ్రాహ్మణులమండీ..." తల వంచుకునే సమాధానం చెప్పింది.

"ఈ వూళ్ళో మీకు ఎరిగినవారెవరైనా వున్నారా అమ్మాయ్..."

"లేరండీ... ఏం చేయాలో తోచటం లేదు...'' ఆలోచిస్తూ నెమ్మదిగా బదులు చెప్పింది. ముసలాయన లక్ష్మివైపు ఒకమారు ఆప్యాయతతో చూసాడు.

''అమ్మాయ్...నీకు అభ్యంతరం లేకపోతే మా యింట్లో వుండొచ్చు..." ఆ మాటల్లో, ఆదరణ, ఆప్యాయతలతో కూడిన అధికారం కూడా ధ్వనించింది.

''మీ ఆదరణకు చాలాథ్యాంక్సండీ... యిందాకటి నుండి మీ కిస్తున్న శ్రమకే నేను బాధపడుతున్నా... నావల్ల మీకు మళ్ళీ యీకష్టంకూడా ఎందుకులెండి..." ఆమె మాటల్లో విన్పించిన సంకోచం, విస్పహాయతకు ముసలాయనకు జాలీ, బాధా కలిగాయి.

మాకు లంకంత యిల్లుంది తల్లీ... నేనూ మా ఆవిడా మాత్రం వున్నాం... మేమూ బ్రాహ్మలమేనమ్మా...'' అతని మాటల్లో వేదన, అభ్యర్థన తొంగి చూసాయి. 'ఇంత గంభీరంగా వున్న మనిషిగుండె ఎంత సున్నితమా' అంటూ ఆశ్చర్యపోయింది లక్ష్మి. ఆమె కెందుకో అతనిమాటలు త్రోసి వెయ్యా లనిపించ లేదు.

'తా నెవరో తెలియని ఆయన ఎందు కిలా అకారణంగా ఆదరం, ఆశ్రయం చూపిస్తున్నాడో అర్థం కాలేదు. అతని సహృదయతకు, సంస్కారానికి ఆమె ముగ్ధ హృదయం తృప్తితో నిండి పోయింది. తన కావూరు కొత్త. కొత్త వూళ్ళో తనను అభిమానించి ఆదరించే వా రెవరూ వుండరు. తన జీవితం ఎలా సాగిపోతుందో, బాబు భవిష్యత్తు ఏమౌతుందో నని ఆందోళన చెందుతూ వచ్చింది. అటి క్లిష్ట తరుణంలో ఆయన చూపుతున్న ఆదరానికి, అతని ఆప్యాయ తతో కూడుకొన్న మాటలకూ ముగ్ధురా లయింది. భయాందోళనలతో నిండిన ఆమె హృదయానికి, అతని పలుకులు పన్నీటి జల్లు లయ్యాయి. అత నెవరు? తా నెవరు? తనకూ — అతనికీ ఏమి సంబంధం? ఎక్కడిదీ అనుబంధం? అతను తనపై వాత్సల్యామృతాన్ని కురిపించటానికి కారణం — అనూహ్యం. అతని ముఖంలో, మాటల్లో ఏమహత్తర శక్తివుందో గాని, అతన్ని చూడగానే గౌరవం, అతని పలుకులు వినగానే అంగీకారం తెలుపా లనిపిస్తుంది. ఈ క్రొత్త చోట యింతమాత్రపు ఆదరం చూపించే వా రెవరుంటారు? వేరే ఎక్కడైనా కాపురం పెట్టినా తనకు తోడుగా, 'పెద్ద — దిక్కు'గా యిక్క డెవరు వుంటారు? యవ్వనంలో వున్న తాను ఒంటరిగా జీవించా లంటే అసాధ్యం. నేటి సమాజంలో ఒంటరిగవున్న స్త్రీకి గల విలువ తనకు తెలుసు! పైగా తన కిప్పుడు మగదక్షత లేదు. ఎవరైనా పెదల అండదండలు తనకు అవసరం. వీరి సహాయంవల్ల తన జీవితం కొంత వరకైనా సాఫీగా సాగిపోగలదు...'' ఆలోచనలు తేనెటీగల్లా ముసురు కున్నాయి.

లక్ష్మి ఎంతసేపటికీ మాట్లాడక పోయేసరికి "రామయ్య బాబాయిగా రింట్లో నీ వుండటం మంచిదమ్మా... యీ వూళ్లో యింతకన్న మంచివాళ్ళని కాగడాపెట్టి వెతికినా దొరకరు. ఆ యిల్లు నీ కన్ని విధాలా నప్పుతుందమ్మా... ఆయనమాట త్రోసెయ్యకమ్మా... ఆయనకూ ఎవ్వరూ లేరు...ఆలూమగలు తప్ప.'' వెంకాయ్ ముసలాయన అభ్యర్థ నను సమర్థించాడు.

"అలాగేనండీ....'' తన సమ్మతి తెలియజేసింది లక్ష్మి.

రామయ్యగారు ఓమారు తృప్తిగా



లక్ష్మివేపు చూసాడు. అతనికళ్ళు ఆనం దంతో, తృప్తితో తళతళ లాడాయి.

ఊరు వచ్చేసింది. "ముందు మన యింటి కెళ్ళి కాస్త విశ్రాంతి తీసుకున్నాక బడి కెళుదువుగాని తల్లీ... ఎంతో దూరంనుండి వచ్చావు... రాత్రంతా నిద్రపోయినట్టు లేవు..." అప్యాయంగా రామయ్య అంటున్న మాటలకు సమ్మతి సూచనగా తలూపింది. ఇల్లు సమీపించింది.

వెంకన్న లక్ష్మి సామానంతా

రామయ్య యింటి లోగిట్లో వుంచేసి "వెడుతున్నా బాబాయ్..." అంటూ వెళ్ళిపోయాడు.

రామయ్య వీధి గుమ్మంలోంచి "యిదిగో... సీతా... యిలారా..." అంటూ భార్యను కేకేసాడు.

సీతమ్మ గబగబా బయట కొచ్చింది. ఆమెకు యాభయ్యేళ్ళుండచ్చు. సన్నగా, ఎర్రగా, పొట్టిగా నొసట పెద్దకుంకుమతో. చెవులకు ఎర్రటి దుద్దులతో ముక్కుకు ముక్కెరతో చూడముచ్చటగా, హుందాగా వుంటుంది. వసారాలో నిల్చుని వున్న ఆగంతకులను చూసి ఆమె విస్తుపోయింది "ఎవరు వీళ్ళు?" అంది భర్తనుద్దేశించి.

"దేవుడిచ్చిన బిడ్డలు..." నవ్వుతూ సమాధానం చెప్పాడు రామయ్య. సీతమ్మ తన సహజ విశాల నయనాలను పెద్దవిగా చేసి ఆశ్చర్యంతో చూడసాగింది.

"ఏమిటే...అలా చూస్తున్నావ్..." నవ్వుతూ అంటున్న రామయ్య మాటలకు తృళ్ళి పడింది ఆమె. నవ్వుతూ "రా అమ్మాయ్..." అంటూ లోపలికి దారి తీసింది.

"అమ్మాయి సంగతి కాస్త చూడు... నేనలా వెళ్ళొస్తా..."నంటూ రామయ్య వెళ్ళిపోయాడు.

క్రొత్తస్థల మవటం మూలాన లక్ష్మి సంకోచిస్తూ అలాగే నిలుచుంది. తల్లి లాగే బాబుకూడా బిక్కుబిక్కు మంటూ చూస్తున్నాడు.

"రామ్మాయ్... అలా నుంచుండి పోయావే...యిది నీయిల్లే ననుకో..." ఆప్యాయంగా అంటున్న సీతమ్మ మాటలకు తప్పనిసరిమై, యాంత్రికంగా లక్ష్మి అడుగులు ముందుకు సాగాయి.

ముందు హాల్లో కెళ్ళగానే బాబును దింపింది. "అమ్మా... యిదెవరిల్లే..." అమాయకంగా అడిగాడు.

లక్ష్మి, కొడుకు ప్రశ్నకు ఏమని సమాధానం చెప్పాలో తెలీక మౌనంగా వుండిపోయింది.

"యిది తాతగారిల్లు బాబూ..." అంటూ సీతమ్మ బాబునెత్తుకుని ముద్దాడింది.

ఎన్నడూ చూడని వ్యక్తి ఎత్తుకుని ముద్దు పెట్టుకోగానే బాబు బిత్తరపోయి చూసాడు; లక్ష్మికికూడా అయోమయంగానే వుంది.

"లే అమ్మాయ్... స్నానం అవీ ముగించుకుందువు గాని..." సీతమ్మ బాబును క్రింద దింపుతూ అంది.

ఒక అరగంటలో లక్ష్మి స్నానాదులు ముగించుకుని వచ్చి హాల్లోవున్న మంచం మీద కూచుంది. బాబుకు సీతమ్మగారే స్నానం చేయించింది. క్రొత్త మనిషైనా బాబు మారాం చెయ్యకుండా బుద్ధిగా నీళ్లు పోయించుకున్నాడు. వచ్చి మచంమీద కూచునివున్న తల్లి వడిలో ముఖం దాచి

పడుకున్నాడు. సీతమ్మ లక్ష్మికీ, బాబుకూ పాలు తెచ్చి యిచ్చింది. లక్ష్మి బిడియ పడుతూనే. మొహమాట పడుతూనే త్రాగింది.

''కాసేపు పడుకో అమ్మాయ్... అయన వస్తారులే కాసేపటికి... అఁ... చూడమ్మా... నీ పే రేమిటి ? ...'' కుతూహలంగా ప్రశ్నించింది సీతమ్మ.

''లక్ష్మి...'' అంది గదంతా కలయ జూస్తూ.

"ఈ బా బు ఒక్కడేనా ? ..." రెండో ప్రశ్న.

మౌనంగా తలూపింది.

"వీళ్ళ నాన్నగారు.." మాట పూర్తి కాకమునుపే లక్ష్మి చటుక్కున తలెత్తి చూసింది. ఆ కళ్ళు ఏదో మూగబాధతో క్షణం కదలి, మళ్ళీ వాలిపోయాయి. ఆ కళ్ళల్లో ఏ భావం గుర్తించిందో గాని సీతమ్మ త నడగ దల్చుకున్న ప్రశ్నను సంగంలోనే ఆపేసింది. లక్ష్మి ఆప్రశ్నతో బాధ పడుతూం దని గ్రహించటాని కామె కాట్టే సేపు పట్టలేదు. "కాసేపు అలా నడుం వాల్చమ్మా..." అంటూ లోపికి వెళ్ళిపోయింది.

లక్ష్మి బాబును పడుకో బెట్టింది. తానూ ఏవో ఆలోచనలు మస్తిష్కాన్ని ముసురుకొనగా మంచంమీద పడుకుంది.

తన భర్తనుగురించి అప్పుడే. కన్పిం చిన యిద్దరూ అడిగారు. వారికి తా నేమి సమాధానం చెప్పాలి ? మొదటిరోజే వూళ్ళో కాలుపెట్టినవెంటనే తన భర్తను గూర్చి ప్రశ్నించారే... యిహ అక్కడ జీవించినంతకాలం యీప్రశ్న ఎన్నిసార్లు వినాల్సి వస్తుందో ? విధిచే వంచింప బడిన తాను ఏమని చెప్పగలదు ? ఎంత తలబ్రద్దలు చేసుకున్నా దానికి జవాబు దొరకలేదు.

లక్ష్మి దారీ తెన్నూ కానక ఆలో చించటం మానుకుంది. మెల్లిగా కళ్ళు మూసుకుంది. ఆమె స్మృతిపథములో, గతించిన సంఘటన లన్నీ ఒక్కొక్కటే సినిమా రీళ్ళలాగా కదలసాగాయి.

పుట్టగానే తల్లిని పోగొట్టుకున్న లక్ష్మికి. యీ నాటివరకూ తన కో తల్లి లేక పోయెగదా ! అన్న ఆలోచనను కలుగ జేస్తుంటాయి. పరిసరాలూ, పరిస్థితులూ.

తన నాలుగో ఏట తమ యింటిలో క్రొత్తవ్యక్తి – 'పిన్ని'గా ప్రవేశించటం తనకు లీలగా జ్ఞాపకం వుంది. తన పసి తనంనుండీ పిన్ని తనను పెడుతున్న బాధలకు, కొడుతున్న దెబ్బలకు, వేస్తున్న చీవాట్లకు కారణం తెలీక మౌనంగా, ఒంటరిగా గదిలో కూచుని ఏడవటం అలవాటు. తా నేడుస్తున్నట్టు పిన్ని పసి గట్టిందా ! ఆవేళ తిండికూడా కరు వయ్యేది : ఆకలి బాధ సహించలేని దవటంవల్ల రాత్రిళ్ళు ఒంటరిగా, మౌనంగా ఏడ్చేది, అమ్మను తలుచు కుంటూ. నాన్నమాత్రం అప్పుడప్పుడూ

తనకై కళ్ళనీళ్ళు నింపుకునేవారు. అప్పు డప్పుడు చాటుగా ఏదైనా తినుబండారం తెచ్చి పెట్టేవాడు; ఒకసారి – తనకు పదేళ్ళ వయసులో – నాన్న తనకు బజారు నుండి మైసూరుపాకూ, లడ్డూ తెచ్చారు. ఎలా పసిగట్టిందో పిన్ని, ఆ పొట్లం నాన్న చేతుల్లోంచి లాక్కుని నాన్నను ఏమేమో అని, తన్ను పట్టుకు తన్ని గదిలోపెట్టి తాళం వేసింది. నాన్న ఎంతగా ప్రాధేయ పడ్డా ఆమె కఠినహృదయం కరుగలేదు. నాన్న తనకోసం తెచ్చిన ఆ మిఠాయి తన కూతుళ్ళకు యిచ్చింది. వాళ్ళు తనను బంధించివున్న గది కిటికీవద్దకు తెచ్చి తనకు చూపిస్తూ తింటూంటే తన కెంత ఏడు పొచ్చిందో, ఎలా ఏడ్చిఏడ్చి అలాగే నిద్రపోయిందో – తనకు బాగా జ్ఞాపకం.

నాన్న తనను చదివిద్దామని బడిలో వేస్తే 'పిన్ని' బడికి పోనిచ్చేదేకాదు. తనకు పనుల్లో సాయం చేసేవా ళ్ళెవరూ వుండరని గోలచేసేది. అయినా నాన్న ఎలాగో తనను స్కూల్ ఫైనల్ దాకా చదివించారు. నాన్న ఎప్పుడూ అనేవారు "లక్ష్మీ, మీ అమ్మ అందం, తెలివి తేటలూ నీకు సంక్రమించాయమ్మా...కాని... నిన్ను నేను సక్రమంగా పెంచలేకపోతు న్నాను...నీవు యింకెవరి యింట్లోనైనా పుట్టివుంటే అపురూపంగా పెరిగేదానివి తల్లీ... నిర్భాగ్యుణ్ణి నేను..." అంటూ వాపోయేవారు. నాన్న తనతో మాట్లాడితే పిన్ని సహించేది కాదు. తాను నాన్నతో ఏం చెబుతుందోనని ఆమె శంక. నాన్న తనకు ఎక్కడ ఏది తెచ్చిపెడతారో నని కాపలా.

స్కూలుఫైనలు పాసయ్యానని తెలిసి నాన్న ఎంతగా పొంగిపోయారు. పిన్ని మాత్రం "ఎందుకూ, యీ దమ్మిడీకి కొరగాని చదువులు...అదేమైనా రాజ్యా లేలాలా ?" అంటూ మూతి ముడుచు కుంది. పుస్తకం తెరిస్తే చాలు కాళికావ తారమెత్తేది; లేనిపోని పనులు పురమా యించేది. చదువుకుంటూంటే రాత్రిళ్ళు తనకు నిద్రరాదని లైటార్పి పడుకునేది. తాను స్కూలుఫైనల్ ప్యాసవ్వగల నని కలలోకూడా అనుకోలేదు. పిన్ని పురు టికి వెళ్ళిపోయింది గనుక సరిపోయింది – తనకా మూడునెలలు బాగా చదువుకునేం దుకు వీలు దొరికింది. అదృష్టం కొద్దీ తాను ప్యాసయింది. కాలేజికి పంపిస్తా నన్న నాన్న మాటలు ససేమిరా ఒప్పుకో లేదు పిన్ని. వీలయినంత త్వరలో ఎవరి కైనా తనను ముడిపెట్టెయ్యాలని ప్రయ త్నించింది. నాన్న కిష్టం లేకపోయినా తనను, తన తమ్ముడికొడుకు – ఓ పచ్చి రౌడీకిచ్చి పెళ్లిచేయాలని నిశ్చయించింది. తన దురదృష్టానికి నాన్న కుమిలిపోయే వారు. తనను పూర్తిగా నిరాశ అలుము కుంది. తన బ్రతుకంతా బాధలమయమే నన్న నిస్పృహతో జీవచ్ఛవంలా, యాంత్రికంగా బ్రతుకసాగింది. అప్పట్లో చంద్రం తమ యింటిముందు ఓ గది

అద్దెకు తీసుకుని వుండేవాడు. యూని వర్సిటీలో యం. ఏ. చదువుతున్నాడు. అప్పుడప్పుడు నాన్నగారు చంద్రంతో కలిసి మాట్లాడుతూ వుండేవారు. ఒక నాడు నాన్న టాక్సీ తెచ్చి తనను ఎక్క మన్నారు. నాన్నా, తానూఎక్కడికో బయ ల్దేరటం పిన్నికి ఆశ్చర్యం, అసూయ కలిగించాయి. అయినా నాన్న ఆమె నా నాడు లెక్కచెయ్యలేదు ; టాక్సీ సరాసరి రిజిష్ట్రారు ఆఫీసుముందు వెళ్ళి ఆగింది; నాన్న దిగారు తానూ నాన్న తనతో రించింది. అక్కడ చంద్రం తనను చూసి నవ్వాడు. ఎందుకో తెలియక తికమక పడింది.

లోపలి కెళ్ళకముందు నాన్న తనతో చెప్పారు ; రిజిష్ట్రారు సమక్షంలో చంద్రం తనను 'రిజిష్టరు మ్యారేజి' చేసుకుంటా డని. ఆశ్చర్యంతో తాను చంద్రాన్ని చూసింది. అతని కళ్ళు 'ఔ' నన్నట్టు తృప్తిగా, సంతోషంగా, చిలిపిగా మెరిశాయి. తనకు సిగ్గేసింది. చప్పున తల వంచుకుంది. 'మౌనం అంగీ కారం' అనుకున్నారేమో పెళ్ళితంతు ముగించేశారు. తన జీవితంలో ఆనాడు నిండుగా, తృప్తిగా నవ్వుకుంది. పూల మాలలతో తిరిగి యింటికి వచ్చిన తమను చూసి పిన్ని ఓ పెద్ద దుమారాన్ని లేపింది ; నాన్నగానీ. చంద్రంగానీ లెక్క పెట్ట లేదు. చంద్రం తనను వెంటబెట్టుకుని తన గది కొచ్చేశాడు ఆనాటినుండి తన




"కాఫీ వేడిగా ఉందా ?"

జీవితం సాఫీగా సాగిపోతుందనీ, సహృదయుడు, ప్రేమమూర్తియైన భర్తతో సుఖ జీవితం సాగింప వచ్చు ననీ — ఎన్నెన్నో వూహించుకుంది. పిన్ని తనమీద కోపమంతా నాన్నమీద వెళ్ళ గ్రక్కేది. నాన్న ఆమె బాధ భరించ లేక తన దగ్గిర కొచ్చి కూచుని తృప్తిగా మాట్లాడేవారు; రెండు నెలలు మామూలు గానే సాగిపోయింది.

ఒకనాడు అకస్మాత్తుగా గుండె ఆగి నాన్న పోయారు ఆ నాడు చంద్రం తన చేతిమీదుగా అన్నిపనులు పూర్తిచేశాడు,

అయినా పిన్నికిమాత్రం తమిద్దరిమీద కసి వుండేది. నాన్న పోయాక చంద్రం యూనివర్సిటీకి దగ్గరగావున్న ఓ చిన్న యిల్లు తీసుకుని అక్కడికి మార్చాడు సంసారాన్ని.

రోజులు క్షణాల్లా దొర్లిపోయాయి. చంద్రం సెలవులకుకూడా యింటి కెళ్ళే వాడుకాదు. తనకు అత్త మామలను చూడాలని వున్నదని ఎంతగా చెప్పినా 'యిప్పుడిప్పుడే వద్దు' అంటూ అడ్డు చెప్పేవాడు. ఎందుకో తన కర్థమయ్యేది కాదు.

ఒకనాడు హఠాత్తుగా చంద్రం మాయమయ్యాడు. అప్పటికి తనకు మూడో నెల; చంద్రాన్ని వెతికి వేసారి పోయింది. పుట్టింటి కెడితే పిన్ని నానా మాటలు అంది. అవమానం భరించలేక తానావూరు వదలిపెట్టింది. కాకినాడలో తన కున్న చదువు సంధ్యలతో పిల్లలకు ట్యూషన్లు చెప్పుకుంటూ బ్రతికింది. బాబు పుట్టాక ట్రైనింగు చదివింది. ట్రైనింగు పాసయిన తనకు ఎక్కడా వుద్యోగం దొరక్క కొంతకాలం బాధపడింది. చివరి కిప్పుడు జిల్లా పరిషత్తువారి కని కరంపల్లనో, తన అదృష్టం వల్లనో నారాయణ పురంలో వుద్యోగం దొరి కింది, కాని నాలుగేళ్ళక్రితం మాయమైన చంద్రం మాత్రం యీ నాటికీ కనిపించ లేదు. తన దీనగాథ ఎవరికి చెప్పు కుంటుంది ? ఏమని చెప్పుకోగలదు? ...

గత జీవిత స్మృతులు జోలపాడగా లక్ష్మి అలాగే నిద్రపోయింది. ఆమె నిద్రలేచే సరికి రామయ్య ఎదురుగావున్న కుర్చీలో కూచుని బాబును తదేకంగా చూస్తూ వుండటం కంటబడింది. తత్తరపాటుతో లేచి కూర్చుంది.

"కాస్త ముఖం కడుక్కొని, బయలు దేరమ్మా... స్కూలు కెడదాం..." అంటూ చుట్ట కాల్చుకోవడంలో నిమగ్న మయ్యాడు.

అరగంటలో తయారై వచ్చింది లక్ష్మి. తన సర్టిఫికేట్లూ, ఆర్డరుకాగితాలూ పట్టుకు బయలు దేరింది. రామయ్య ఆ వూరి విశేషాలూ, తన కుటుంబపు స్థితి గతులూ....ఏవేవో చెప్పుకుంటూ నడుస్తున్నాడు. లక్ష్మి అన్యమనస్కంగా, పరధ్యానంగా నడుస్తోంది. బడి ఆవరణ లోని కొచ్చారు. అది తన వుద్యోగ జీవితంలో మొదటిరోజు. తల్చుకోగానే ఆమె గుండె దడదడ లాడింది. ఆ క్రొత్త వుద్యోగం ఎలా వుంటుందో ? అక్కడ తానెలా మసులు కోవాలో ? ఉపాధ్యాయినిగా తానీనాడు జీవితం సాగించాల్సి వుంటుందని ఏనాడూ అనుకోలేదు. మానవుని తలంపులకు విరుద్ధంగా సాగుతుంటుంది వారి జీవిత పథం. ఒక నిర్ణీత మార్గంలో సాగిపోవా లనుకున్న వారి జీవితం, వారికి తెలియ కుండానే మరోత్రోవ పడుతుంది. కాలానూ గుణ్యంగా, పరిస్థితులకు తగినట్లుగా

మసలుకోవటం మానవకోటికి ముఖ్యం. అది గ్రహించగలిగినవారి బ్రతుకులు సాఫీగా సాగిపోతుంటాయి; లేదా వారు అధోగతి పాలవుతారు- అంతే... అది సృష్టి సహజం... తన వెర్రి ఆలోచన లకు తానే నవ్వుకుంది.

పరిస్థితుల ఒత్తిడివల్ల, కడుపు చేత బట్టుకొని, కన్న కొడుకుతో వుద్యోగం కోసం బయలుదేరవలసివచ్చింది. తన అదృష్టంకొద్దీ ఆదరాభిమానాలు చూపే రామయ్యదంపతులు లభించారు. వారి ఆదరంతో తానూ, తనబాబూ క్షేమంగా జీవితం సాగించవచ్చు – ఆలోచనలన్నీ ఒకవైపు నెట్టి ఆఫీసురూంలో అడుగు పెట్టింది.

రామయ్యను చూడగానే హెడ్ మాస్టరుగారు నవ్వుతూ కుర్చీ చూపించాడు. రామయ్య కూర్చుంటూ "అమ్మాయిని తీసుకొచ్చాను సూర్యారావుగారూ..." అన్నాడు లక్ష్మిని చూపిస్తూ.

లక్ష్మి చేతులు జోడించింది. అతడు ప్రత్యభివాదం చేసి "కూర్చోమ్మా" అన్నాడు కుర్చీ చూపిస్తూ. లక్ష్మి తటపటాయిస్తూ నిల్చుంది. ఆమె క్వాలిఫికేషన్లూ, ఆర్డరు కాగితాలూ అన్నీ చూచి తృప్తిపడ్డారు.

"సింగన్నా" అన్న హెడ్ మాస్టరు గారి కేకతో బయట నిల్చుని ఎవరితోనో బాతాఖానీ వేస్తున్న ప్యూను సింగన్న పరుగెత్తుకొచ్చాడు; 'సార్' అంటూ.

"ఈ అమ్మాయికి సెకండ్ ఫారం చూపెట్టు...ఆఁ..మీరు వెళ్ళండమ్మా.." అన్నాడు. సింగన్న ఓమారు లక్ష్మికేసి చూసి "రండి" అంటూ దారితీశాడు. లక్ష్మి ఒకమారు రామయ్యగారి కేసి చూసింది, 'వెడుతున్నా'అన్నట్టు. ఆయన నవ్వుతూ తలూపారు; ఆ నవ్వు వెనుక ఎన్ని మరిగిపోతున్న అగ్ని పర్వతా లున్నాయో సూర్యారావుగా రెరుగుదురు.

"రామయ్యగారూ......ఏమిటి విశేషాలు..." మాటల్లో దించేందుకు ప్రయత్నించారు సూర్యారావుగారు.

రామయ్య కొద్ది క్షణాలు మౌనంగా కూర్చున్నారు. తర్వాత నెమ్మదిగా, బరువుగా శ్వాస వదిలి "సూర్యారావు గారూ,...విశేషా లేముంటాయ్ నాలాంటి వాడికి...అయినా ఎందుకో ఈ వేళ మనసు చాలా తృప్తిగా వుందండీ..... కారణం...ఆ అమ్మాయే ననుకుంటా... అందర్నీ పోగొట్టుకొన్న నాకు, యీ అమ్మాయినీ...ఈ అమ్మాయి కొడుకునీ చూస్తొంటే ఏదో ఆత్మీయత కలుగు తోంది. ఆ అబ్బాయికి నాలుగే ళ్ళుంటా యేమోఎంత... బావున్నాడండీ...అచ్చు మా శేఖరం లాగే వున్నాడు!...సాయం కాలం మీదగ్గరికి ఎత్తుకువస్తాలెండి... చూద్దురుగాని..." అంటూ కండువాతో

ముఖం తుడుచుకున్నాడు: వెళ్ళడాని కుద్యుక్తు డవుతూ.

''వెళ్తా రా....'' లేచి రామయ్యను అనుసరించారు సూర్యారావుగారు.

"ఆ(...'' అంటూ గబగబా అంగలు వేసుకుంటూ వెళ్ళిపోయాడు రామయ్య. వెళ్ళిపోతున్న రామయ్యను చూసి చిన్నగా నిట్టూర్చారు సూర్యారావుగారు. రెండేళ్ళ క్రితం ఆ వూళ్ళో అడుగుపెట్టిన సూర్యారావుగారిని కూడా రామయ్య ఎంతో ఆదరించారు. ఆవూళ్ళో కల్లా మోతుబరీ, వుత్తముడూ అని పేరున్న రామయ్య చూట్టాని కెంత గంభీరంగా వుంటాడో, లోపల తన కుటుంబానికి తగిలినఘాతల కంత కుమిలిపోయేవాడు. సీతమ్మ సరేసరి. ఆమె దుఃఖించని రోజుండదు.

ఐదేళ్ళక్రితం గోదావరి వరద లొచ్చాయి. రాజమండ్రి అంతా దాదాపు మునిగి పోయింది. యిళ్ళు, మేడలు సర్వం జలమయం. వీధుల్లో నీరు నదుల్లా ప్రవహించింది. పూరిళ్లూ, పాత యిళ్లూ కూలిపోయాయి. పశువులు నదీ ప్రవాహంలో కొట్టుకుపోయాయి. కొన్ని కొన్ని క్రొత్త భవనాలుకూడా గోదావరి తల్లి ధాటికి తాళలేక 'దాసోహం' అన్నాయి. వేలకొలది ప్రజలు నిరాధారు అయ్యారు. మనుష్య నష్టంకూడా చాలా జరిగింది అప్పట్లో రామయ్యగారి కుటుంబం రాజమండ్రిలో వుండేది ఆ జలప్రళయంలో వారి మేడకూడా కూలి పోయింది. రామయ్యగారి కుమారుడూ, కోడలూ నది ప్రవాహానికి ఆహుతై పోయారు. విశాఖలో చదువుతున్న చంద్ర శేఖరం యీ విషయం తెలిసి వచ్చాడు, కాని అతనికి తల్లి–దండ్రుల ఆఖరి దర్శనంకూడా లభ్యంకాలేదు. శేఖరం మతి చెడినట్టయింది. పిచ్చివాడిలా తయా రయ్యాడు. ఒకనాటి తెల్లవారుఝామున ఎవ్వరికీ చెప్పకుండా ఎటో వెళ్ళిపోయిన వాడు, యింతవరకు తిరిగిరాలేదు రామయ్యదంపతులు ఆ ఠంపపుకోత భరించలేక రాజమండ్రి వదిలేసారు వున్న ఆస్తిపాస్తులన్నీ అమ్మి నారాయణాపురం చేరుకుని వ్యవసా యంతో జీవితం సాగిస్తున్నాడు. వూళ్ళో వారందరికీ పితృసమానుడు, సహృద యుడు అయిన రామయ్య హృదయం అశాంతితో, ఆవేదనతో కుమిలిపోతూ వుంటుందని అతని ఆత్మీయులకు తప్ప మరెవ్వరికీ తెలీదు.

* * *

కాలచక్రపు టిరుసుల్లోపడిసంవత్సరం గిర్రున తిరిగిపోయింది. లక్ష్మి ఉపాధ్యా యినిగా మంచి పేరు తెచ్చుకుంది రామయ్య కుటుంబంలో లక్ష్మి, బాబుల మూలంగా కొంత శాంతి, సంతోషమూ నెలకొన్నాయి. లక్ష్మి జీవితగాథ విన్న సీతమ్మ, లక్ష్మి దౌర్భాగ్యానికి దుర దృష్టానికి చింతించేది, కాని లక్ష్మి తన

గత జీవితం క్రమంగా తన పనుల్లోనూ, బాబు ఆలనా పాలనల్లోనూ కొంత వరకు మరచిపో గలిగింది; కాని చంద్రాన్ని తల్చుకున్నపుడు ఆమె హృదయం నిరాశతో, దుఃఖంతో వ్రక్క లయ్యేది. బాబు బడికి వెళ్ళసాగాడు.

ఒకనాటి మధ్యాహ్నం సన్నగా, తెల్లగా, చక్కనివాడనగల ఒక వ్యక్తి వచ్చి వారి యింటిముందు నిలిచాడు. ఆ వూరికతను క్రొత్తవాడవటంవల్ల అతని వెంట కొందరు పిల్లలుకూడా వున్నారు. వారిలో ఒక కుర్రాడు "బాబూ....ఓ బాబూ... మీ యింటి కెవరో వచ్చారు.. బయటికి రా..." అంటూ రామయ్యగారి 'మనమడు' బాబును కేకేశాడు.

"ఎవరూ ?" అంటూ సీతమ్మ బయట కొచ్చింది.

అగంతకుడు "బామ్మా..." అంటూ ముందుకు గబగబా వచ్చాడు. అకస్మాత్తుగా వచ్చిన తన మనుమడు శేఖరాన్ని చూసి సంభ్రమాశ్చర్యాలతో ఒక్క-క్షణం స్థబురాలై పోయింది. అంతలో తేరుకుని "బాబూ" అంటూ కౌగలించుకుని రోదించసాగింది. అంతవరకు అణచి పెట్టుకున్న దుఃఖం పొంగిరాగా శేఖరం కూడా ఏడ్చేసాడు. ఐదేళ్ళ ఎడబాటు వారి హృదయాలను దుఃఖంతో పూడ్చేసింది. అనుకోని యీ సమాగమం వారి హృదయాలపై పన్నీటిజల్లు కురిపించింది.

ఎవరో క్రొత్తవ్యక్తి తన యింటికి వచ్చాడని తెలిసి రామయ్యగారు ఆదుర్దాగా యింటి కొచ్చాడు. హాల్లో కూచుని బామ్మతో కబుర్లు చెబుతున్న శేఖరాన్ని చూసి, హృదయం పొంగి అమాంతం వచ్చి కావలించుకున్నాడు. అనాడు ఆ గృహంలో తృప్తీ, శాంతీ, సుఖం నివాసం చేసాయి.

సాయంకాలం బడినుండి వచ్చిన బాబు హాల్లో మంచం మీద క్రొత్తవ్యక్తి వుండటం చూసి సరాసరి సీతమ్మ దగ్గర కెళ్ళాడు. "అమ్మమ్మా..ఆయ నెవరూ?" అంటూ. శేఖరం బాబురాకను గమనించాడుకాని, అంతగా పట్టించుకోలేదు.

"వాడూ నీలాగే మనుమడు, శేఖరం" అంది వాడి బుగ్గలు ముద్దెట్టుకుంటూ.

నాయనమ్మ అన్నమాట వినగానే శేఖరానికి కుతూహలం కలిగింది. వెంటనే లేచి బామ్మదగ్గరి కెళ్ళాడు; "ఈ అబ్బాయి ఎవరు బామ్మా" అంటూ. బాబు ఓ మారు శేఖరాన్ని ఎగాదిగా చూచి వెళ్ళి రామయ్య ఒళ్ళో కూచున్నాడు. రామయ్య వాడిని ముద్దులతో నింపేశాడు.

"తాతయ్యా...నేను కథ చెప్పనా?" అన్నాడు ముద్దుమాటల్తో.

"వీడు చాలా తెలివిగలవాడురా శేఖరం...పాపం వీడితండ్రి ఎవరో వీడికి తెలీదు. వీడు పుట్టకముందే ఎటో వెళ్ళిపోయాడు, పాపం. ఆ అమ్మాయి

నానా బాధలూ పడిందట. చివరకు ఎలాగో ట్రైనింగు పూర్తి చేసింది. యిక్కడ వుద్యోగం చేస్తోంది. చాలా మంచిది... ఆ అమ్మాయిని చూస్తే చాలా జాలేస్తోందిరా... పుట్టినప్పటినుండి నానా యాతనా పడిందట. మారుటితల్లి హింస లకు తండ్రి బలియై పోయాట్ట. ఎవరో దౌర్భాగ్యుడు తండ్రిని. ఈ అమ్మాయిని వంచించాడు. దిక్కులేని పక్షిలా యిలా వచ్చేసింది కడుపు చేత బట్టుకుని..." రామయ్య చెబుతున్న మాటలు శేఖరం మస్తిష్కంలో అలజడిని లేపాయి.

"ఆ అమ్మాయిపేరు వసంత లక్ష్మి కదూ" అన్నాడు ఆదుర్దాగా.

"నీ కెలా తెలుసు...." ఆశ్చర్యంగా నోరు వెళ్ళబెట్టారు యిద్దరూ.

"వసంతను పెళ్ళాడిన దౌర్భాగ్యుణ్ణి నేనే తాతయ్యా..." కుమిలింపు అతని కంఠంలో ప్రతిధ్వనించింది.

"శేఖరం..." అన్నమాట తప్ప మరేమీ అనలేకపోయారు వారిద్దరూ.

"అవును తాతయ్యా. నేను వసంతను పెళ్ళాడదల్చుకున్నానని నాన్నకువుత్తరం వ్రాసాను; నాన్న అది ఎంతమాత్రమూ జరక్కూడదనీ. తన అభీష్టానికి వ్యతిరేకంగా ప్రవర్తించేట్లయితే తనకూనాకూ సంబంధ ముండదని వ్రాశారు. కాని నేను వసంతను మనసారా ప్రేమించాను. ఆమె నా నరకంనుండి తప్పించటం నా బాధ్యత అనుకున్నాను. అందుకే ఎవ్వరికీ చెప్ప కుండా వసంతను రిజిష్టరుమ్యారేజి చేసుకున్నాను. నా చదువు పూర్తయ్యాక నా పెళ్ళిసంగతి చెబుదా మనుకున్నాను. కాని అంతలోనే నాన్నా అమ్మా పోయారు. అమ్మ వెళ్ళిపోవటం నా హృదయానికి గాయమైంది. మతిచెదిరిం దా స్థితిలోనే నేను మద్రాసు వెళ్ళిపోయాను. అక్కడ నాకు తెలిసిన మిత్రుడు నన్ను ఆదరించి మామూలు మనిషిని చెయ్యగలిగాడు. దాదాపు సంవత్సరం తరువాత నా భార్యను చూడబోయాను. కాని ఆమెజాడ తెలియలేదు. అత్తగారింటి కెళ్ళి అవమానం పొంది. విశాఖ పట్నంలోనే నా భార్యను అన్వేషిస్తూ ఇంతకాలం గడిపాను. కాని ఆమె సంగతేమి తెలియలేదు. ఎంతకాల మని స్నేహితులతో గడపను ? నా కున్న ఎం. ఏ. డిగ్రీకి విలువగా గుమాస్తాగిరి యిచ్చారు. కాని నాకు జీవితం మీదా, వుద్యోగంమీదా విరక్తి పుట్టింది. రాజమండ్రీకి ఎన్ని వుత్తరాలు రాసినా బదులు లేదు. యిటు మీ గురించిన ఆందోళనా, అటు వసంతకోసం అన్వేషణా రెండూ నన్ను దహించేసాయి. నా అన్వేషణ ఫలించలేదు. రాజమండ్రీ వచ్చాను ఎంతో ఎంక్వైరీ చెయ్యగా మీ రిక్కడ స్థిరపడ్డట్టు తెలిసింది. వచ్చేశాను ఈ జీవితంలో కలవగలనో, లేనో నను కున్న వసంతకూడా లభ్యమయింది. నా



రక్తాన్ని పంచుకు పుట్టిన బాబు..." మాట పూర్తిచేయక మునుపే "చంద్రం" అన్న పిలుపు విని వెనక్కి తిరిగాడు. తలుపువద్ద లక్ష్మి ఆనంద విస్ఫారిత నేత్రాలతో నిల్చునివుంది.

"వసంతా...నీవేకదూ...నా వసంతవే కదూ!..."

అంటూ ఒక్క ఉదటున వెళ్ళి ఆమెను అక్కున జేర్చుకున్నాడు. బాబుకు ఈ క్రొత్తమనిషి చర్యలు అర్థంకాక అమాయకంగా తాతయ్య ముఖంవేపు చూశాడు.

"మీ నాన్నరా బాబూ... నే నానాడే అనుకున్నా... వీడు మా శేఖరంకొడుకే నని..." అంటూ మునిమనుమడిని ఎత్తుకుని బయటకు వెళ్ళిపోయాడు.

బాబును ఎత్తుకుపోతున్న రామయ్య వేపు అందరూ తృప్తిగా ఆనందంగా చూశారు.















బొమ్మలకే ప్రాణాలొస్తే....

# రజ్జుసర్పం

రామాన్ని పోలీసులు పట్టుకుపోయా రనే వార్త ఊళ్లో దావానలం లాగా వ్యాపించింది. వ్యాపించ కేం చేస్తుంది? ఇందులో అసత్యం ఏమీ లేదు; ఆశ్చర్యం అంతకన్నా లేదు. రామం సంగతి మనకి తెలియదుగాని, అతని మిత్రులు మాత్రం ఈ శుభ ముహూర్తానికి లేక దుర్ముహూర్తానికి ఎదురు చూస్తూనేఉన్నారు.

రామం కమ్యూనిష్టని చాలా మంది నమ్మకం. ఐనా, అతని హితు లెవ్వరూ తెలిసినట్టు నటించేవాళ్ళు కారు. చాటుగా 'ఏమోయ్ కమ్యూనిష్టని' పిలిచేవాళ్ళు. రామం మందహాసం చేసే వాడు, అవు నన్నట్టు! అప్పుడప్పుడు తను ముందు చెయ్యబోయే దేశ సేవను గురించికూడా మాట్లాడేవాడు. ఇదీ ప్రస్తుతం రామం చరిత్ర. రామం ఇలా కమ్యూనిష్టయి చెడిపోయి నందుకు అతని మిత్రులు లక్ష్మిని నిందించేవాళ్ళు. ఈ మధ్య రామం మిత్రులతో కలవడంకూడా మానే వాడు!—లక్ష్మితోనో, ఏకాంతంగానో కాలం గడుపుతూ ఉండేవాడు. ఐతే,

చక్రపాణి



ఈ అరెస్టులో ఆశ్చర్యకరమైన విషయం ఒకటి జరిగింది. రామాన్ని అరెస్టు చేసింది బాంబులు చేస్తూ ఉండగా కాదు; ఖాదిదగ్గరికి పోతుండగా!—అతనిదగ్గర సెడిషన్ కిందకు వచ్చేదేమీ లేదు. అలాంటిది సంపాదించటానికి అతని గది సోదాకూడా చూడలేదు. మరి ఏ నేరంకింద పట్టుకున్నట్టు! వాళ్లకేం ఆధారాలు దొరికినై? ఏమో! వందలాది జీతాలు తింటున్న సి. ఐ. డీ. లే రామం రహస్యం యింతకాలం కనుక్కోలేకపోతే, మన మిప్పుడు బుర్ర బద్దలుకొట్టుకుని మాత్రం ఏం ప్రయోజనం! ఏమున్నా వెనుకటి సంగతులు తడివిచూస్తే. ప్రయోజనముంటుందేమో! చూద్దాము.

రామం పుట్టింది పల్లెటూళ్లో (మేనమామ లింట). ఐనా, మూడో క్లాసు నుంచి ఇప్పటివరకు టౌనులోనే చదువుకొంటున్నాడు; ఉంటున్నాడు. చదువులో అతనంత చురుకూ కాదు, మందమూ కాదు. వల్లించటంలో మాత్రం తోసివేయదగ్గవాడు కాడు. మొదటినుంచీ అతనికి స్నేహితులంటూ ఎక్కువలేరు. వేషంలో వ్యవహారాల్లో పూర్వఖత్తు. పిలకని పేటెంటు చేశాడని అంటూవుండేవాళ్ళు తోటి విద్యార్థులు. గ్రాంధికవాది. అరసున్న హత్య అయినందుకూ, బండి'ఱ' బలి ఐనందుకూ, వాపోయేవాడు. యిలాంటి రామం థర్డుయియరు; చివరకు పూర్తిగా మారిపోయాడు వేషంలోనూ, భాషలోనూ! పైగా రాజకీయాల్లోకూడా వేలు పెట్టసాగాడు. స్టూడెంట్ల కనీసపు కోర్కెలమీద ఒకటి రెండుసార్లు క్లాసులో ఉపన్యసించాడుకూడా.

ఈ మార్పుకంతా కారణం ఒక వ్యక్తి - స్త్రీలింగానికి చెందినవ్యక్తి - పేరు లక్ష్మి. ఈడు 16-18 మధ్య; ఆమె తండ్రి స్టేషనుమాస్టరు. విశాఖపట్టణంనించి బదిలీ అయి, యిక్కడికి వచ్చాడు. అతనికి శేషగిరి అనే కొడుకు ఒకడు. థర్డుయియరు చదువుతున్నాడు. లక్ష్మి ఫస్టియరు.

లక్ష్మి యింటర్వల్ సమయాలలో అన్న క్లాసులోకి వస్తుండేది. ఆమెకు కొత్తాపాతా లేదు. విశాఖపట్టణపు రాజకీయ వాసన ఆమెలో బాగా జీర్ణించిపోయింది. స్టూడెంటు ఫెడరేషనులో చేరమని అందరిని హెచ్చరిస్తూ వుండేది! కమ్యూనిజమన్నా కమ్యూనిస్టులన్నా ఆమె సింపతీ కనపర్చేది.

ఇక్కడి విద్యార్థుల్లో ఇంతకుపూర్వం రాజకీయ సంచలనం ఏమీలేదు. ఈమెనుబట్టి ఒక్కొక్కరు మారడం మొదలుపెట్టారు.. కాని రామాన్ని మాత్రం ఆమె వాదన లేమీ మార్చలేకపోయినై. అసలతను పాల్గొంటేగా



"పిన్నిగారూ! కాసిని ఆవుపాలు ఇప్పిస్తారా? ఈ చుట్టుపక్కల్లో మరెక్కడా ఆవు లున్నట్టే లేవు!..."

"అయ్యోరాత! మాకు ఒక ఆవుకూడానా?— అదో, మీ బాబాయి అచ్చ ఆవులాగే అరుపులు అరుస్తూ పిల్లల్ని ఆడిస్తూంటారే తల్లీ!"

మారటానికి, మారక పోవటానికి?— ఒక మూలని కూర్చునేవాడు, తనకి సంబంధ మేమీ లేనట్టు! లక్ష్మి కొంత కాలాని కతని తత్వం గ్రహించింది. అతన్ని పడిపించటానికో అన్నట్టు ఒకటి రెండు ప్రశ్నలు వేసి, సమాధానం, కాదు — అతని అభిప్రాయం చెప్పే దాకా ఊరుకునేది కాదు. మొదటి సారి తన్ను ప్రశ్నించినప్పుడు రామానికి శరీరం గగుర్పొడిచింది. సమాధానం చెప్పా లంటే నోట్లోనుంచి మాట బైటికి రాలేదు ఎట్లాగో ఆమె అభిప్రాయాలు తెలుసు కాబట్టి — ఏకీభవిస్తున్నా నన్నట్టు తెలియపరచాడు.

ఇలా అయింది వాళ్ళ పరిచయం. క్రమంగా రామం వ్యూస్ అన్నీ మారి పోయినై. శేషగిరిని అడిగి మార్క్స్ రాసిన 'కేపిటల్' తీసుకున్నాడు. కొన్నాళ్ళు అందరికీ కనపడేటట్టు చేత పట్టుకునికూడా తిరిగాడు.

లక్ష్మి రామంల పరిచయం స్నేహంగా మారింది, వృద్ధిపొందింది. విద్యార్థు లది ప్రేమ అని కూడా అనుకున్నారు. విద్యార్థులదాకా ఎందుకు రామానికే తెలియదు, అ దేమిటో!

ఇలా సంవత్సరంనర గడచింది.

రామం బి.ఏ.కి కూర్చున్నాడు. రిజల్ట్సు వచ్చినై; పాసయాడు. లక్ష్మికూడా ఇంటరు పాసయింది. శేషగిరి గ్రూప్ లో తప్పాడు. అతని తండ్రి అతనికి రైల్వేలో ఉద్యోగంకోసం ప్రయత్నం చేస్తున్నాడు.

రామం శేషగిరికోసమంటూ స్టేషనుమాష్టరుగారింటికి పోతూ వుండేవాడు. టీ పుచ్చుకొని, కాసేపు బాతాఖానీ కొట్టి రైలుపట్టాల వెంటే షికారుకు వెళ్తూ వుండేవాళ్ళు ముగ్గురూ. ఒక్కోనాడు శేషగిరి ఏదైనా పనిలో వుంటే, వీళ్ళిద్దరే వెళ్ళివస్తుండేవారు. ఇద్దరే వున్నప్పుడు రామం ఏదన్నా లోకాభిరామాయణం ఎత్తేవాడు. లక్ష్మి దాన్ని ఎలాగో ఒకలా తిప్పి కాపిటలిజానికో, ఫాసిజానికో ముడివేసి, చర్చను నీరసం చేసిపారవేసేది. ఒకనాడు మాటల సందర్భంలో రామం, తండ్రి తన్ను పెళ్లిచేసుకోమనీ. వాళ్లిచ్చే కట్నంతో బి. ఎల్. చదవమనీ నిర్బంధిస్తున్నాడని లక్ష్మికి చెప్పాడు. ఆమె నవ్వి. 'ఇందులో నిర్బంధమేముంది? పెళ్లి చేసుకోక, బ్రహ్మచారిగా వుంటావా?' అంది. రామం ఏం చెప్పుతాడు? బ్రహ్మచారిగా ఉంటానంటే ఒక చిక్కు! 'పెళ్ళి చేసుకొంటాను; కాని, ఆ పిల్లను గాదు, నిన్ను' - అని చెప్పటానికి దమ్ములు లేవు; లక్ష్మి యింతవరకేమీ సందివ్వకపోయె! ఏం చేస్తాడు, ఆ వేళకి ప్రసంగం మార్చాడు.

మర్నాడు షికారుకు పోయినప్పుడు, రామం తాను రాసిన వ్యాసాల కటింగ్సు కొన్ని లక్ష్మికి యిచ్చాడు. లక్ష్మి హెడ్డింగ్సు చూసి, యిచ్చేసింది. ఆ వ్యాసాల హెడ్డింగులివి. 'రష్యాలో వివాహం ఒక సమస్య కాదు.' 'లైంగిక సూక్తికి పర్యాయపదమే వివాహం!' 'భారతదేశంలో ఆడదాని అధోగతి.' రామం భయపడుతూనే లక్ష్మిని అభిప్రాయమడిగాడు: లక్ష్మి తలవాచేటట్లు చివాట్లు పెట్టింది; నీకేం తెలుసని ఈ లైంగిక సమస్యలు తీసుకుంటావంది. భారతదేశంలో మగవాళ్ళకి ఉత్తమగతులు పట్టినాయి కాబట్టి, మాకు లేవని దుఃఖమా! అంది. మీరంతా కాన్విక్టు వార్డరులు; మీవల్ల ఖైదీలకేం సౌఖ్యాలు లభిస్తాయంది!-వైవాహిక సమస్యలు చర్చ చేయడానికి నీకేం అధికారం వుంది? నువ్వెవ్వరి ప్రతినిధివి?....ఇలా ఎన్నో ప్రశ్నలు వేసింది గుక్కతిరక్కుండా! రామం ఉక్కిరిబిక్కిరి అయ్యాడు. గుడ్లు వప్పగించి, ఊరుకున్నాడు. తర్వాత లక్ష్మి సాత్వికంగా బోధించింది — నీకు అందని విషయాన్నిగురించి చర్చించవద్దని. రామం ఆ వేళకు శోకతెంచుకు బయటపడ్డాడు.

మర్నాడు రామం చెట్టు కింద జ్యోతిష్కుడికి నాలుగణాలు దర్శించుకున్నాడు. పిట్టచేత ఆకు లాగించాడు-త్వరలో శ్వశురగృహ నివాసయోగముందని వచ్చింది. రామం మరోసారి కాఫీ తాగి, ఇంటికి పోయి, గదితలుపు బిగించి, సాయంత్రందాకా తంటాలు పడి పదిపేజీల వుత్తరం రాశాడు:- అందులో మొదటి నాలుగుపేజీల్లో లక్ష్మి అనే అయస్కాంతంవల్ల తను ఎలా ఆకర్షింపబడిందీ రాశాడు. తర్వాత నాలుగు పేజీల్లో తన యోగ్యతలు - చివరి రెండు పేజీల్లో లక్ష్మి చేయూత లేంది ఈ భవసాగరం ఈదలేననీ తెల్పాడు.

రామం ఉత్తరం పోస్టుచేశాడు - లక్ష్మి జవాబుకూడా యిచ్చింది క్లుప్తంగా-మూడు మాటల్లో - రామం ఆమెని సరిగా అర్థం చేసుకోలేదట. వివాహ విషయంలో తన అభిప్రాయాలు రామానికి ఇదివరకే తెలుసట. తన్ను వరించటానికి తగిన త్యాగం రామం చెయ్యలేదట!

చివరిమాటకు రామం గుండె ఆగిపోయింది. మళ్ళీ ఇంకోమాటు చదువుకోలేకపోయాడా వుత్తరం. ఆవాళంతా పిచ్చికుక్కలాగా తిరిగాడు. రాత్రి గదికి చేరి, లెటరుప్యాడ్ తీశాడు. ఏమేమో రాశాడు. కొట్టివేశాడు. చివరకు ఈ అల్టిమేటం తయారు చేశాడు:-

కామ్రేడ్ లక్ష్మి!

నీ వుత్తరం నా హృదయం మీద బాంబులాగా పని చేసింది! నీ పాలసీ హిట్లరు పాలసీకన్నా దుర్మార్గంగా ఉంది. పద్దెనిమిది మాసాలనించీ నువ్వు నన్నూ, నా పట్టుదలనూ ఎరుగుదువు! ఈ రోజున నా త్యాగం పరీక్షించగోరుతావా? ఐతే ఇదే పరీక్ష! ఈ వుత్తరం అందిన యిరవై నాల్గు గంటల్లో నువ్వు నన్ను ప్రాణంతో చూడలేవు! యిదే నీకోసం నేను చేస్తున్న త్యాగం; ప్రతిజ్ఞ!

ఇట్లు,
నీ కామ్రేడ్ కాగోరు
'రామం'

తిరిగి:- నువ్వు నీ అభిప్రాయం మార్చుకునేపక్షంలో నేను నా ప్రతిజ్ఞ ఉపసంహరించుకోడానికి వీలుంటుంది. లేకపోతే ఇదే తుది.

నీ కామ్రేడ్, 'రామం'

లక్ష్మి వుత్తరం చదువుకుని, ఆదుర్దాపడింది. రామం పట్టుదల ఆమెకు తెలుసు....స్టూడెంట్లు ఏమన్నా నవ్వుతాల కంటే, వాళ్ళతో మాట్లాడకుండా ముగదీసుకునేవాడు-సంవత్సరాల తరబడి; పలకరించినాకూడా ముఖం తిప్పుకునేవాడు. ఈ మధ్య ఇంట్లో అలిగి, నాలుగైదురోజులు అన్నం తినలేదని

కూడా అతను చెప్పినట్టు ఆమెకి జ్ఞాపకం! మరి కర్తవ్యమో! తన మూలాన హత్య జరగాల్సిందేనా!

ఎంత ఆలోచించినా, ఆమె ఒక నిశ్చయానికి రాలేకపోయింది. మధ్యాహ్నం ఈ సంగతి శేషగిరిదగ్గర చల్లగా బయటపెట్టింది. అతడు వివరాలన్నీ ఒక్కొక్కటే తెలుసుకున్నాడు. నువ్వేమీ ఆదుర్దాపడవద్దని చెల్లెలికి ధైర్యం చెప్పాడు. రామానికి నేను చెప్పుతానని వుత్తరం తీసుకున్నాడు.

శేషగిరి రామాన్ని కలుసుకోనేలేదు. ఆసాయంత్రమే రామం అరెస్టయ్యాడు.

ఇంతకూ రామమెందుకు అరెస్టయిందీ బయట పడనేలేదు. పట్టుకుపోయిన పోలీసులకి సిగరెట్ లంచం పెట్టినా మాకు తెలియదన్నారు. అరెస్టుకి పూర్వాపరసందర్భాలు విచారించినా-అంటే అగ్నిరూపం, ధూమరూపంలో కూడా ఆచూకీ ఏమీ బయట పడలేదు. దావానలరూపందాకా లేచి వుండక తప్పదేమో!

మర్నాడు మేజస్ట్రేటుకోర్టుకి చాలా మంది చేరారు. రామం మిత్రులు కొందరు దండలు తెచ్చారు. ఎందుకో లక్ష్మిమాత్రం రాలేదు. కేసు తీర్పు అయినాక ఇక్కడినించే లక్ష్మి యింటికి పోయి ఆమె కామ్రేడ్ జైలులో పడ్డందుకు సానుభూతి చూపివద్దా మనుకున్నారు కొందరు మిత్రులు.

సాయంత్రం బహిరంగసభ ఏర్పాటు చేసి, అందులో ప్రభుత్వచర్యను-రామంలాంటి యువకుల్ని అకారణంగా జైళ్లల్లో కుక్కుతున్నందుకు-తీవ్రంగా ఖండించా లనుకున్నారు, కొందరు నోటితీట నాయకులు.

రామాన్ని తీసుకొచ్చి బోను ఎక్కించారు. ప్రజలూ, మిత్రులూ జయజయధ్వానాలు చేశారు. రామం మందహాసంతో ప్రత్యుత్తర మిచ్చాడు. అతని ముఖాన నమ్రతతో కూడిన అహంకారం - కొంత మంది జాతీయ నాయకులలో గోచరించేది - తొణికిసలాడుతూంది.

ప్రజ అంతా తహతహలాడిపోతున్నారు. నేరారోపణ వినటానికి - తాము ఊహించుకున్నది స్థిరపరచుకోటానికి. ఆ శుభముహూర్తమూ వచ్చింది. రామానికి చార్జిషీటు చదివి వినిపించారు!-ఒక్క రామమే కాదు, అక్కడున్న వాళ్ళు చాలామంది దిగ్భ్రమ చెందారు? ముఖాలు నల్లబడిపోయినై ఒక్కొక్కరే అక్కడినించి జారుకున్నారు. వివరాలన్నీ బయటపడేటూ కాకూడా చాలామంది ఉండలేదు! రామంమీద మోపబడింది హత్యానేరం కాదు; ఆత్మహత్యానేరం. దానికి ప్రమాణం లక్ష్మికి అతను రాసిన వుత్తరం. ఐతే - కోర్టులో మేజస్ట్రేటు లక్ష్మి పేరుమాత్రం బయట పెట్టలేదు.

# సినిమా క్విజ్




పై 2 బొమ్మలూ 2 సినిమా పేర్లు తెలియజేస్తవి ... ఏమిటవి? (జవాబులు 110 వ పేజీలో)



శాంతకి శుభలేఖ చూసినదగ్గరనుంచీ పెళ్ళికి వెళ్ళటమా, మానటమా, అన్న ఆలోచన తెములటం లేదు. వెడితే జయకి స్కూలు పోతుంది. వెళ్ళకపోతే అన్నగారు ఏమన్నా అనుకుంటాడేమో? ప్రయాణం అంటే మళ్ళీ బోలెడు ఖర్చు. ఏమి చెయ్యాలన్నది తేమలక తలనొప్పి పట్టుకుంది. ఎప్పుడూ నాలు కొట్టేసరికి ఇంటికి వచ్చే జయ, ఆరోజు ఎందుకు ఆలస్యం చేసిందో? అని ఎదురు చూస్తోంది శాంత. ఆనంద మోహన చాలా ఉత్సాహంగా మెట్లు ఎక్కుతున్నాడు. అతన్ని చూడకుండా రోడ్డు చివరకి చూస్తోంది.

'ఏమిటీ, రాణీగారు చాలా దీర్ఘాలోచనలో వున్నట్టున్నారే' అని శాంత పక్కకి వచ్చి నిల్చున్నాడు.

'జయ ఇంకా రాలేదేమిటి?' అంటూ దూరంగా జరిగింది.

# సినిమా క్విజ్




పై 2 బొమ్మలూ 2 సినిమా పేర్లు తెలియజేస్తవి ... ఏమిటవి? (జవాబులు 110 వ పేజీలో)




'అదా సంగతి. ఇంకా నా కోసం చూస్తున్నావేమో అనుకుంటున్నా. ఇక లోపలికి దయచెయ్యవచ్చు; పలనన పుత్రికారత్నంబు సినిమాకు వెడలినట్లు విన్నవించమని ఆజ్ఞ మంజూరు చేసిరి.'

'అబ్బా, ఏమిటా మాటలు, ఇంకా నయం వాళ్ళకి మన భాష తెలవదు కనక సరిపోయింది. లేకపోతే ఎగతాళి చేసేవాళ్ళు.'

'రాణీగారి ఆజ్ఞ శిరసావహించెద గాక; ఈ దీనుడు పోవుచున్నవాడు.'

ఫలహారం తెచ్చి బల్లపైన పెట్టి దూరంగా కూర్చుని, 'చూడండి మీ హాస్య ధోరణిని కొంతసేపు వదలెయ్యండి బాబూ!' అని మూతి ముడుచుకుంది శాంత.

పళ్లెం ఖాళీచేసి మంచంమీద వెన్ను వాల్చాడు.

'అబ్బ, మాట్లాడితే ఆ ధోరణి, లేకపోతే ఈ వరస, విసుగు వస్తోంది బాబూ', అంటూ మంచంకోడుమీద కూర్చుంది.

రెప్పవాల్చకుండా శాంతకేసి చూస్తున్నాడు.

'అబ్బబ్బ. ఈ పెళ్ళికి తప్పకుండా వెడతా. అప్పుడుకానీ తెలవదు' అని విసుక్కుంది.

'ఈ మహోద్ఘాతం ఎంతయు ప్రయాణంబుకా దేవి! అటుల చెప్పుము. ప

ప్రాంతంబుకు విజయము చేయుచుంటిరి.'

'నా తలకాయ. ఏదు పొస్తోంది. అన్నయ్య కూతురు పెళ్ళిట;' శుభలేఖ తెచ్చి ఇచ్చింది శాంత.

'పైకం ఏమయిన పంపియుంటిరా?'

'ఏమిటండీ మీ గొడవ. పైకంలేదు, గియికంలేదు. ఆఖరికి వుత్తరంకూడా రాయండే.'

'అటులైన ఏమి చేయదలంచితిరి ?'

'మీ రేమి చెపుతారో అని నేను అనుకుంటే నన్నే అడుగుతున్నారా? బాగుంది.'

మెట్ల తలుపు తెరచిన చప్పుడయి వరండాలోకి వెళ్ళింది శాంత.

'ఆనంద్ గాడు రాలేదా?' అంటూ కోటేశ్వరరావు గుంపు జొరబడింది.

వాళ్లని చూడగానే వళ్ళు చల్లబడ్డంత పని అయింది శాంతికి. వాళ్ళు వస్తే వో పట్టాన పోరు. ఒహో వేళ వదలించుకున్నా, కొంత డబ్బు అప్పు పేరుతో అర్పించుకోవాలి. తను వెళ్లేందుకే డబ్బు వుంటుందో వుండదో: తెలివితక్కువ, కాకపోతే అక్క దేతేరని చెపితే పోయేవాళ్లేగా? ఇప్పుడు అనుకునిమాత్రం ఏమి లాభం.

వాళ్లతో కలిసి ఆనంద్ మోహాను బయలుదేరాడు. శాంతని తలుపు వేసుకోమని సైగ చేశాడు.

మళ్లా వంటరిగా వుండాలి. పోనీ జయ వున్నా కొంత మెరుగు. 'పాపం దాని కేం తెల్సు. చిన్నపిల్ల' అని విసుక్కుంది.

ఎన్నో యేళ్ళు ఈ బొంబాయి కాపరం కోసం కలలు కంది. జయ పుట్టేదాకా ఆ మాట నెగ్గనేలేదు.

వచ్చిమాత్రం ఏమి బావుకున్నట్టు? చాలా యేళ్ళు పొద్దున్న వెడితే, రాత్రి పది కొట్టాల్సిందే రావటానికి. కొత్తగా పెట్టిన కాపరమని ఎంతో వోర్పుతో మసులుకుంది. ఇప్పుడు హోదా పెరిగి ఇంటికి తొందరగా వస్తున్నా రనుకుంటే ఈ గ్రహాలు పట్టుకుంటున్నాయి. ఎంత వస్తుందో ఏమో. నగ లన్నీ కర్పూరంలా కరిగిపోయాయి. తనకి వాటి మీద మోజు లేదు. కానీ వెళ్లేది పల్లెటూరు పెళ్ళికి. వాళ్ల గౌరవం అంతా మెడనిండా వుంటేనే. తనకి మిగిలినది అరిగిపోయిన వక్కపేట గొలుసు; చేతులు చూసుకుంది. వక్కజత గాజులు; వుసూరుమంటూ కనపడుతున్నాయి. చీకట్లో చాలా సేపు కూర్చున్నట్టు గుర్తుకి వచ్చి లేచి లైటు వేసింది.

స్టౌవును ముట్టించి వంటపనిలో పడింది. ఎన్ని చేసినా టయిము ఎనిమిది దాటలేదు. బట్టలపెట్టి తెరచి ముందు పెట్టుకూర్చుంది. చీరలు అన్నీ రోజూ కట్టుకునేవే. పెళ్ళికి

వెడితే ఏమి కట్టుకోవటం! అన్న కొత్త బెంగ ఇంకొకటి తయారయింది.

జార్జెట్సు ఆ వూళ్ళల్లో కట్టుకుంటే ఏమి బాగుంటుంది? ఏం చెయ్యటం? అదే కట్టుకోవాలి అని పైకి తీసి సరిగ్గా మడతపెట్టి మళ్లా పెట్టేసింది. కాయి తాలకట్ట బయటికి తీసింది. ఎప్పుడేనా డబ్బుపెట్టి పుర్చిపోయి వుడచ్చు. చాలా జాగ్రత్తగా ప్రతీదీ రెండేసి సార్లు చూసుకుంటోంది. పొరపాటుని కూడా పెట్టనందుకు విసుక్కుంది. తండ్రి పంపిన దస్తావేజు ముందు దూరంగా విసిరేసినా మళ్లా తీసి మడత విప్పింది. పదిరూపాయల నోట్లు రెండు - సంతోషంతో గుండెలు కొట్టు కున్నాయి. నిజమో కాదో అని తిప్పి చూసుకుంది.

ఆ దస్తావేజు వోసారి చదువుకుని, కవులు కాయితం వుండే తప్ప అన్న గారు వక్క దమ్మిడీ తనకి పంపనందుకు కోపం తెచ్చుకుంది. 'వెడుతున్నాగా, దీని సంగతికూడా చూస్తా'నని పెట్టెలో పెట్టుకుంది. పక్కవాటాలోనివాళ్ళు సినిమానించి వచ్చేశారు. మళ్లా జయ కోసం చూస్తూ ముందుకు వచ్చి నిల్చుంది. జయని విడిచి, వసంత వెళ్ళటం చూసి శాంత లోపలికి వెళ్ళి పోయింది.

జయ మొహామ్మీదికి పడే జుట్టుని వెనక్కి తోసుకుంటూ పుస్తకాల బాగ్గు మోసుకొచ్చి తండ్రి బల్లమీద పడేసి 'చాలా బాగుంది అమ్మా పిక్చరు' అంటూ తల్లి మెడని చుట్టుకు దగ్గరగా నిల్చుంది. చెయ్యి విడదీసి 'వెళ్ళి బట్టలు వమార్చుకో' అంది శాంత.

రోజు స్కూలునించి రాగానే కొంతసేపు తల్లి దగ్గర గారాలు చెయ్యటం అలవాటు పడింది. తల్లి అన్నమాటకి. దుఃఖము వచ్చినంత పని అయి అక్కడే కదలకుండా నిల్చుంది జయ.

ఆనంద మోహను రావటం చూసి జయని తీసుకు పంటగదికి వెళ్ళింది శాంత. జయ తంటూనే కునికిపాట్లు పడుతోంది.

శాంతకి ఏమి చేస్తే కోపము వస్తుందో అది చెయ్యటం సరదా; కోపంలో చేసే చేష్టలకి పగలబడి నవ్వటం. అది చూసి శాంత ఇంకా వుడికిపోవడం, చివరికి ఏడుపు మొదలుపెడితే, 'దేవీ కనికరించి వరాలు కోరుకో అన్నాము' అంటూ ప్రాధేయపడి చాలావాటికి వప్పేసు కుని రాజీ కుదుర్చుకోవడం ఆనంద్ కి ఆనందం.

ఆ రోజు వరాల్లో వూరికి పంపటం వకటి. జయని జాగ్రత్తగా శాంత వచ్చేటంతవరకూ చూసుకోవటం రెండు. ఈ రెండూ ఆప్టే ఇబ్బంది పడక్కర్లేదు అనుకున్నాడు. ఇంక

మూడోదే కాస్త మదత పేచీగాఉంది. పుష్కలంగా డబ్బు ఎక్కడ తెచ్చేదా అని.

అందులో నెల చివర ఎవర్నీ అడగటం అన్నదానికి సమాధానం రావటం లేదు. పోనీ వెళ్ళవద్దు అంటే? శాంతని పిల్చాడు. అప్పుడే నిద్రపట్టినట్టుంది, పలకలేదు. పాపం, కోపంతప్ప ఏమీ తెలీదు. ఇన్నేళ్ళనించీ నోరుతెరిచి వెడతానని అడగలేదు. అప్పుడే ఐయ్యేకొన్ని నెలల్లో పది ఏళ్ళు పూర్తి అవుతాయిలావుంది. తను ఎన్నిసార్లు తన వాళ్ళదగ్గరకి వెళ్ళొచ్చిందీ గుర్తుచేసుకున్నాడు. శాంత మంచంచివర కూర్చుని అలిసిన మొహంలోకి చూస్తున్నాడు. కళ్ళకింద గీతలు వెక్కిరిస్తున్నాయి. బుగ్గలు లోతుకి పోయాయి. కళ్ళు ఇంకా విశాలంగా పొడుగ్గా కనపడుతున్నాయి. చేతిగాజుల్లో వేళ్లుపెట్టి తిప్పుతున్నాడు. గుండ్రంగా పొట్లాల్లావుండే చేతులు పుల్లల్లా తోచాయి. తన సుఖం చూచుకోదు. ఎప్పుడూ తండ్రీ కూతుళ్ళని మేపడంతోనే సరిపెట్టుకుంటుంది. తిరిగి వచ్చాక శాంత విషయం తను కనుక్కోవా లనుకున్నాడు ఆనంద మోహను.

పాలగంటకి ఉలిక్కిపడి లేచింది శాంత. చీటీ ఇచ్చి సీసా పుచ్చుకుంది. ప్రయాణం సంగతి వాడికి ఎందుకు చెప్పటం అని వూరుకుంది.

రోజూ తెల్లవారేసరికి వంట చెయ్యటం మామూలే. ఆ రోజు రాత్రికి కూడా రొట్టెలు చేసి పెట్టేసింది. స్నానంచేసిన వళ్లు ఆరకుండానే వచ్చిన ఆలోచన చెప్పాలని ఆనందుని లేపింది. చల్లటి చేతులు వంటికి తగలగానే మెలుకువ వచ్చినా కళ్ళు తెరవలేదు. శాంత మొహం దగ్గరగాపెట్టి లేవమని గోకింది. ఆనంద్ చేతిలో ఇరుక్కుంది. చెప్పేది వినండి అంటూ విడిపించుకుంటూ చెప్పుకుపోతోంది. ఇప్పుడు మళ్ళా చెప్పు అని నవ్వుతున్నాడు. 'పోండీ' అంటూ మెల్లిగా కొట్టి కోపంతో మొహందాచుకుంటూ తప్పించుకుపోయింది.

మళ్ళీ ఎవరిపనుల్లో వాళ్లు హడావిడిగా తిరుగుతున్నారు. కారియర్లు సర్ది నీళ్ళసీసాలతోసహా సిద్ధం చేసి వాకిట్లో పెట్టింది శాంత. ఆఫీసుకు వెళ్ళే వేషంతోవచ్చి శాంత కెదురుగా నిల్చున్నాడు. చేతి కున్న గాజులజత తీసి ఇచ్చింది.

అవి తీసుకునేందుకు మనస్కరించలేదు. 'ఆఖరిజత కాదూ' అని శాంత కళ్లల్లోకి చూశాడు.

'పోనీ మానెయ్యమంటారా ?' అని అమాయకంగా అడిగింది.



"నీ లోగడ కథలో ఉరిపోసుకొని ఆత్మహత్య చేసుకొన్న సుశీలని : రాసుకో
మా ప్రేతలోకపు కథలు బోలె డున్నాయి చెపుతా !...

'జయతో చెప్పావా ప్రయాణం సంగతి' అంటూ జయని పిల్చి 'మీ అమ్మ వూరికెడితే మనిద్దరం వుందామా?' అని అడిగాడు.

వుండనని, వుంటానని చాలా సేపు గొడవచేశాక వుండేందుకు వప్పుకుంది.

శాంతని స్టేషనుకి రమ్మనిచెప్పి తను అక్కడికే వచ్చి కలుస్తానని చెప్పి ఆనంద మోహాను వెళ్ళిపోయాడు.

జయ స్కూలుబస్ హారన్ వినగానే బిక్కమొహం పెట్టింది. 'మళ్ళా ఎప్పుడు వస్తావమ్మా' అని పుస్తకాల సంచీ కిందపెట్టి అడిగింది.

శాంతకి కళ్లు చెమ్మగిల్లాయి. 'ఇదే మొదలు విడిచివుండటం. తొందరగా వచ్చేస్తాలే. నాన్నగారు వుంటారుగా, భయంలేదు. పక్కఇంటి పాటి నీకు కావల్సినవన్నీ చేసి ఇస్తుంది.' అని దగ్గరగా తీసుకు తల నిమిరింది. మళ్ళా హారన్ మోగేసరికి పరుగెట్టుకుంటూ వెళ్ళింది. కిందకెళ్ళి టాటా చెప్పింది.

బస్సు వెళ్ళేదాకా చూసి శాంత లోపలికి వచ్చింది. పోనీ మానేస్తే ఏమి అనిపించింది. పిల్లని అవస్తపెట్టి వెళ్ళడ మేమిటి? అని ఆలోచనలతో సతమత మవుతోంది. పక్కఇంటి పాటి వచ్చి 'బండి ఎన్నిగంటలకి' అని అడిగాక మళ్ళా వెళ్ళేందుకే నిశ్చయించుకుని తొందరగా సర్దటం మొదలుపెట్టింది.

పాటి మొల్లో డబ్బు తీసి శాంత చేతిలో పెడుతూ 'మళ్ళా నువ్వు ఇచ్చే

టప్పుడు మా కోసలు చూడకుండా ఇవ్వు' అని చెప్పింది.

'వద్దులెండి. వారు స్టేషన్లుకి తెస్తా నన్నారుగా' అని చేతులు దాచుకుంది శాంత.

'ఒక సమయంలో రాకపోతే ఏమి చేస్తావు? నువ్వు తిరిగివచ్చిన వెనక ఇద్దువులే; తొందరేమి' టంది పాటి.

వక్క ర్తీ ప్రయాణం చెయ్యటం పుట్టాక అదే మొదలు కావటం మూలాన కొంత ఖంకారుగా వుంది. పాటిని స్టేషనుదాకా తోడు రమ్మని తీసుకెళ్ళింది.

'బండి వచ్చేసిందే' మీఆయన ఎక్కడ! అంటూ వెతుకుతోంది పాటి 'నీ దగ్గర వున్న డబ్బు ఇవ్వు. టిక్కెట్టు తెస్తా'నని పాటి వెళ్లబోయింది. అనంద మోహను హడావిడిగా ముందుకి వెళ్ళిపోతుంటే పాటి అరచింది.

అప్పటికే ఎక్కడా ఖాళీలేదు. అన్ని పెట్టెలూ కిక్కిరిసి వున్నాయి.

'రెండవ తరగతి ఆడవాండ్ల పెట్టె సుమారుగా జాగా వుంది' అని పాటి చూసివచ్చి చెప్పింది. శాంతని ఎక్కించి ఆనంద్ టికెట్టు మార్చేందుకు వెళ్లాడు.

రైలు కదులుతూండగా వచ్చాడు. కూడా నడుస్తూ టిక్కెట్టూ డబ్బూ చేతికి ఇచ్చి. ప్లాస్టిక్ గాజులు ఎఱ్ఱవి జేబులోంచి తీసి లోపలికి విసిరాడు. రైలు ఎందుకో వక్కకుదుపు కుదిపి ఆగింది. ఆనంద్ వేగంగా శాంత పెట్టె దగ్గరకి వచ్చాడు. 'నా దగ్గర డబ్బు వుంది. పాటిదగ్గర తీసుకున్నా. మీ దగ్గర పెట్టుకోండి.' అని ఆనంద్ జేబులో పెట్టింది శాంత. ఇంటిదగ్గర ఏర్పాట్లన్నీ ఏకరువు పెడుతోంది. పూర్తి కాకుండానే రైలు జరిగింది. పాటితో వెళ్తున్నట్టు చేత్తో సైగచేసింది. చేతికి తొడిగిన గాజులు చూసుకుంది. ఆనంద్ కనపడేటంతవరకూ చూస్తూ వెళుతున్నట్టు చేయి కదుపుతూనేవుంది.

ఎవరిసామాన్లు వాళ్ళు సర్దుకుంటూ చాలా సేపు గడిపాక మాటలు, ప్రశ్నలు మొదలుపెట్టారు శాంత కిటికీలోంచి బయటికి చూస్తోంది. లోనావాల వచ్చేసింది. మేఘాలు కూడా వస్తూన్నట్టు కనపడుతున్నాయి. వాటి ఆకారాల్లో తండ్రీ, పినతండ్రీ. అన్నగార్లూ అంతా కనపడి వెళుతున్నట్టు వూహిస్తోంది. 'ఎన్నేళ్ల తరవాత మళ్ళా ఈదారిని చూస్తున్నా' ననుకుంది.

ఆ పెట్టెలోనే ప్రయాణం చేస్తున్న మరో తెలుగు ముసలమ్మ ప్రశ్నల వర్షం కురిపిస్తోంది. ఏవూరు వెడుతూంటా? మీ ఆయనకి ఏమి పని? జీతం ఎంత? అన్నింటికి ముఖావంగా సమాధానం చెప్పే శాంతకేసి వక సారి కోపంగా చూసి పక్కకి తిరిగి కళ్ళు మూసుకుంది. అంత దూరం

నించి వచ్చినా, నిడదవోలు వచ్చేసరికి ఖంగారు ఎక్కువయింది. తన సామాన్లు అన్నీ గుమ్మం దగ్గరకి చేర్చింది; రేగల్లు దాటింది. కాళ్ళు చేతులు వణుకుతున్నాయి. కొవ్వూర్లోనే దిగుతానని తనతో కూడా ప్రయాణం చేసిన ముసలమ్మకి చెప్పింది. స్టేషను వచ్చేసింది. ఎల్లాగో కొంత ధయిర్యాన్ని పట్టుకు వేళ్ళాడి, మెల్లిగా దిగి, తన సామాన్లు దింపుకుంది. తెలిసిన మొహం ఒక్కటీ కనపడలేదు. తను వెళ్ళాల్సిన చోటికి బస్సులు పడ్డాయట. వెళ్ళేవాళ్ళతో కలిసి బస్సెక్కింది. వంతెన ముందే బస్సు ఆపి దిగమన్నాడు. అక్కడ నించి ఎల్లా వెళ్ళటమా అని దిగులుతో నాలుగువక్కలా చూస్తోంది.

వీరయ్యతాత కిర్రు చెప్పులు చప్పుడు చేసుకుంటూ అటే వస్తున్నాడు. శాంత ఎదురెళ్ళి 'తాతా' అని పలకరించింది.

కళ్ళపైన చెయ్యిపెట్టుకు 'ఎవరు?' అని అడిగి 'శాంతమ్మవి కాదూ?' అని గుర్తుకు తెచ్చుకు చాలా సంతోషంగా యోగక్షేమాలు అడిగాడు. 'అయితే మీ అన్న వచ్చాడా పిలుపుకి' అని శాంత కేసి చూశాడు. 'అబ్బే ఎవ్వరు రాలేదు. శుభలేఖ మాత్రం వచ్చింది.' అని పూరుకుంది శాంత.

ముక్కుమీద వేలు వేసుకున్నాడు. 'పట్నం వెళ్ళి పురదల్ని పిల్లల్ని తీసుకొచ్చాడంట. నువ్వా చెల్లెలి వేగా! వచ్చావుగా! అయి అన్నీ ఎందుకులే. నా తెలివి నిలోచ్చి పెట్టి మాట్లాడుతున్నా' అని నొచ్చుకున్నాడు వీరన్న.

'ఎవరైనా మనిషి వుంటే. సామాన్లు ఇంటికి పట్టుకు రావాలి' అని నసిగింది శాంత.

కఱ్ఱపైన గెడ్డం ఆన్చి ఎవరైనా వస్తున్నారో ఏమోనని చూస్తున్నాడు వీరన్న.

'అయితే తాతా నా పొలం నువ్వే చేస్తున్నావా?' అని అడిగింది శాంత.

'వక పడాదేగా నాకు ఇస్తా. మీఅన్నే చేసుకుంటున్నాడు. ఏమి ఇస్తున్నాడు? ఏంటి సిస్తు?' అని వీరన్న అడిగాడు

'ఇంతవరకూ వక్క దమ్మిడీ పంపలేదు. ఎప్పుడూ నష్టము స్తోందని ఏటా వో వుత్తరం మాత్రం వ్రాస్తాడు. ఇప్పుడు భూములు ధర ఏమన్నా పెరిగాయా' అని అడిగింది శాంత.

పెరక్కేం నీ భూమికి యకరకు ఐదు, లేకపోతే ఆరువేలు రావచ్చు ఏం అమ్మేస్తావా' అన్నట్టు చూశాడు.

'నేను వుండగా బేరం వస్తే బాగుండును' అంది శాంత.

'మీ అన్ననిగాని బేరం పెట్టమంటివా రెండేలుకంటే లేదు అంటాడు ధర. నీ యిష్టం మరి,' చుట్టదూరంగా పారేస్తూ వీరన్న చెప్పాడు.

నువ్వు ఎవరికేనా చెప్పి బేరం పెట్టి పెడుదూ. అన్నీ కుదిరాక చెపుతాను' అంది శాంత.

'నేను బేరం పెట్టానని తెలుస్తే గోలపెడతాడు. నాతో గొడవ పెట్టుకున్నాడుగా, మాట్లేవు. అయినా నీ భూమి కనక చెప్పి చూస్తాలే. సాయంకాలంమాటు వోపాలి ఇంటికిరా. మీ మామ్మని కూడా చూడచ్చు. ఎవర్నైనా పిల్చుకొస్తా, శానా సేపు నిల్చున్నావు. ఎప్పుడు తిన్నావో ఏమో' అంటూ వెళ్లాడు వీరన్న.

వెంట పెట్టుకొచ్చిన కుఱ్ఱాడికి గుర్తు చెప్పి పంపాడు. నీళ్ల బేగ్ శాంత పట్టుకు వాడితో కూడా నడుస్తోంది. చాలా ఇళ్లు, కొత్తగా కట్టిన డాబాలు, పెంకుటిళ్లు - వూరు ఎంత మారింది అనుకుంది శాంత.

వో కొత్త డాబాలోకి తీసుకెళ్ళాడు కుఱ్ఱాడు. పెద్ద పందిర ముందువున్నా ఇల్లు బాగానే కనపడుతోంది. అరుగు మీద అంతా కొత్తవాళ్ళే. అన్నగారు లోపలినించి వస్తున్నాడు. 'ఎప్పుడు వచ్చావే' అని పక్క మాట అని



కూర్చున్నవాళ్లదగ్గరికి వెళ్ళాడు.

శాంత మనస్సు చివుక్కుమంది. ఎన్నోఏళ్లతరవాత వచ్చినందుకు ఎంతో ఆదరణ చూపుతాడు అనుకుంది. సామాను వో మూల పెట్టమంది. వాడి చేతిలో డబ్బులు పెట్టి లోపలికి వెళ్ళింది శాంత.

వడ్డాణంజెట్టు వెనక్కి జరుపుకుంటూ వదినగారి చెల్లెలు ఎదురయింది. 'ఏవమ్మోవు వదినా'అంటూ కౌగలించుకుని 'ఎప్పుడు రావటం? అన్నయ్యేరీ?' అని అడిగింది.

'నేనే వచ్చా. మీ అన్నయ్యకి శలవ దొరక లేదు' అని చెప్పింది శాంత.

అప్పగారితో 'మీ ఆడబిడ్డ వచ్చిందేవు' అని చెప్పి శాంతని స్నానం చేసేందుకు పిల్చుకెళ్ళింది. పెట్టె అవి గదిలో పెట్టించింది రాజ్యం. శాంతకి ప్రయాణం బడలిక అప్పుడు తెలుస్తోంది. వదినగార్ని తనే వెళ్ళి పలకరించింది.

'ఏ పదిమంది వున్నా రని. పక్కపిల్ల పెళ్ళి. నాలుగు రోజులు ముందు వస్తా వనుకున్నాము. పోనీలే అసలు వచ్చావు అదే సంతోషం' అంది వదిన ఏదో మాట్లాడాలి గదా అన్నట్టు.

నాలుగు మెతుకులు తిని సామాను పెట్టిన గదిలోకి వెళ్ళి వో చాప పరుచుకు పడుకుంది. ఎంత సేపు పడుకుందో ఏమో లేచేసరికి పొద్దు కుంకుతోంది. ఇంకా బద్ధకం వదల్లేదు. వంటగది గుమ్మానికి చేర్లపడి నిల్చుంది శాంత.

వదినగారి సిగకి పువ్వులు చుట్టుతోంది భాగ్యం. 'మీ సొంత ఆడబిడ్డ వచ్చిందిటగా. ఇంక మేము అవసరం వుండంలే,' అని భాగ్యం చెల్లెలు లక్ష్మి చెప్పుతోంది.

'ఎక్కడో వుండి ఏటికి కోటికి అన్నట్టు వస్తే ఏమి ప్రేమలు వుంటాయి. నిజం చెప్పద్దూ. మీ దగ్గర వున్న చనువు అమ్మాయి దగ్గర నాకు లేనేలేదు. మళ్ళా చెప్పలేదు అనుకునేరు. పెళ్ళి వారు వెళ్లేదాకా మీరు ఇంక ఇంటికి వెళ్లడానికి వీల్లేదు, తెల్సిందా. పిల్లతో కూడా మా రాజ్యాన్ని మిమ్మల్ని పంపాలని వుంది' అని వదినగారు చెప్పటం శాంత వింది.

పెరట్లో రాజ్యం పువ్వులు గుచ్చుతోంటే శాంత అక్కడికి వెళ్ళి కూర్చుంది.

'ఇప్పుడే లేచావా?' అని గుచ్చే సూది శాంత చేతిలో పెట్టి వెళ్ళింది రాజ్యం.

టిఫిను కాఫీ తెచ్చి తీసుకోమని శాంతముందు పెట్టింది రాజ్యం.

'ఈ పిల్లకి ఎందుకో తనంటే ఇంత ప్రేమ' అనుకుంది శాంత.

'పెళ్ళి పిలుపుకి బయలుదేరమని తొందర పెడుతున్నాడు పురోహితుడు. ఏమే రాజ్యం అల్లా

కూర్చుంటె ఎల్లాగే. పిలుపుకి వెళ్లాలి లే అని, ఆ పక్కనవున్న శాంతతో, 'నువ్వు కూడా రా వెడదాము' అని వదినగారు పిలిచింది.

'నేను గుచ్చిపెడతా, నువ్వు వెళ్లు రాజ్యం' అంది శాంత.

'మీరు వెళ్ళిరండి. నేనూ వదినా కలిసి నరుసుకి జడ కుడతాము' అని రాజ్యం అనటంతో పిలుపుకి వెళ్లటం తప్పింది.

రాజ్యం అందిస్తోంటే శాంత అట్టకి పువ్వులు పెట్టి కుట్టింది. ఇద్దరూ కలిసి పంతో అందంగా జడ తయారుచేశారు. గులాబిపువ్వులు రావటంతో రెండు పెద్ద దండలు గుచ్చి చెమ్కీ చుట్టింది శాంత.

'ఎంతబాగా గుచ్చిందో చూడ'మని రాజ్యం పందిట్లోవున్న బావగార్ని పిల్చుకొచ్చి చూపెట్టింది.

శాంత పక్కన కూర్చుని 'మీ ఆయన రాలేదేమే' అని అన్నగారు అప్పుడు అడిగాడు.

'శలవ దొరకలేదు. జయకి స్కూలు పోతుందని తీసుకురాలేదు' అని సర్ది చెప్పింది శాంత.

వచ్చే బంధువులు వస్తున్నారు. ముహూర్తానికి రమ్మని పిల్చేందుకు రాజ్యం శాంతకూడా వెళ్ళారు. ముహూర్తం సమీపిస్తున్నా వియ్యాపురాలు రాలేదు. ఏమిటి అని ఆరా తీస్తే లక్ష్మిని కాఫీ పంపమందెట. ఇప్పుడు వీలులేదు తెల్లారితేకాని అందెట. దాంతో వాళ్ళు రామని కూర్చున్నారని వార్త తెచ్చాడు ఒక పెద్దమనిషి.

ఎవర్నీ అడక్కుండానే రాజ్యం శాంతా టిఫిను కాఫీ చేయించి తీసుకెళ్ళి దగ్గరుండి అందరికీ ఇచ్చి పిల్చుకు వచ్చారు.

మొగపెళ్ళివారికి శాంతమీద రాజ్యంమీద గౌరవం ఏర్పడింది. ఏది కావల్సినా వీళ్ళనే అడుగుతున్నారు. శాంతకూడా వడ్డనలోకి, అదీ వెళ్ళి చేస్తోంది.

వచ్చిన బంధువుల్లో ఒకావిడ 'నగలు మోటని పెట్టుకోలేదా? లేక మామూలుగానే లేకా' అని అడిగేసింది శాంతని.

పక్కన వున్న రాజ్యం 'లేకేమి ఖర్మం. ఆ వూళ్ళల్లో ఇక్కడలా దిగేసుకుంటే జంతువుల్ని చూసినట్టు చూస్తా'రని ఖచ్చితంగా జవాబిచ్చింది.

ఆవిడ పక్కనేవున్న లక్ష్మి 'అబ్బో చెప్పావులే, మా తోటికోడలు చెల్లెల్ది కూడా బొంబాయే. ఎన్నో కొత్త నగలు పెట్టుకు వస్తోవుంటుంది. అక్కడి వాళ్లు బోలెడు పెట్టుకుంటారనికూడా చెప్పింది;' అని రాజ్యంతో అంది.

'ఆవిడ కోతలు వినేందుకు నువ్వు దొరికివుంటావు. లేకపోతే అన్ని నగలు రోజూ పెట్టుకు తిరిగితే ఈ పాటికి

ఎవడో ఎత్తుకుపోయి వుండేవాడే' అంది రాజ్యం.

శాంత ఏమీ మాట్లాడకుండా ఇంకో చోటికి వెళ్ళింది. రాజ్యంకూడా వచ్చి పక్కనే కూర్చుంది.

పెళ్ళివారి అలకలు, తీర్పులు అన్నీ సవ్యంగా జరిగాయి. అప్పగింతలు అయి అంతా శోకాలు పెడుతున్నారు. పిల్లతో వచ్చేవారంతా బయలుదేరండి అని చెప్పి వెళ్ళారు.

'ఎవర్ని పంపుతుంటావు' అని రాజ్యాన్ని సలహా అడిగింది అప్పగారు.

'నేను రేపు వెళ్ళిపోవాలి కనక మీ ఆడబిడ్డని పంపు' అని చెప్పింది. వెనక నిల్చున్న లక్ష్మి 'శాంతక్క వెడితే మేము వెళ్లం బాబూ' అని మూతి ముడుచుకుంది.

'మీ అప్పచెల్లెళ్ళు ఇద్దరూ, నూ పిన్ని వెళ్లండి' అని లక్ష్మికి చెప్పింది వదినగారు.

రాజ్యానికి అప్పగారిమీద కోపం వచ్చినా పయికి తేలలేదు. అసలు ఆడ బిడ్డ అంటే లేదు; అన్నదమ్ములాళ్ళ పిల్లలమీద ఎందుకు ఇంత అభిమానమో అర్థం కాలేదు. ఐనా నాకెందుకులే అని సరిపెట్టుకుంది.

పెళ్ళివారు వెళ్ళగానే సందడి తగ్గి బావురుమన్నట్లు వుంది ఇల్లు.

శాంతకి విజయ ఏమి చేస్తోందో అని గుర్తుకు రాగానే ఆ రోజే బయలు దేరా లనిపించింది. వీరయ్య యింటికి దారి తెలుసుకు వెళ్ళింది. వీరయ్య భార్య ఎదురువచ్చి ఎంతో ఆప్యాయతతో లోపలికి తీసుకెళ్ళింది. చిన్నప్పటి సుచ్చట్లు ఎంతోసేపు చెప్పింది. 'మీ నాన్నైనా అమ్మైనా వుండివుంటే ఇన్నేళ్ళు చూడకుండా వుండేవారేనా?' అని కళ్ళు వత్తుకుంది.

శాంతకి కూడా కళ్ళు నీళ్ళతో నిండాయి 'అమ్మాయి' అంటూ వీరయ్య లోపలికి వచ్చాడు.

'నీ భూమికి పద్దాను గేలు వచ్చేట్టు బేరం తెచ్చాను.ఓ పోటీమీద వచ్చింది. లేకపోతే ఎనిమిదేల కంటే రాదు. నీ కిట్టమయితే సెప్పు; ఇప్పుడే అగ్రిమెంటు రాయించేత్తా.'

శాంత తన చెవుల్ని తానే నమ్మలేక పోయింది. 'తండ్రి తనకి ఇచ్చినప్పుడు. అంతా పల్లుభూమి అని హేళన చేశారు అత్తారివేంపు. ఇప్పుడు ఇంత ధర పెరుగుతుందని తెలిస్తే, వాళ్ళకి తగిన సమాధానం చెప్పి వుందును. ఏమి లాభం. ఈ సంగతి వాళ్ళకి ఇప్పుడు తెల్సెనా అప్పులకోసం పీకుతారు' అనుకుంది.

'ఏటి అమ్మాయి ఆలోసిస్తున్నావు' అని వీరన్న అనగానే, 'అబ్బే ఏమి లేదు. నీ కంటే ఈ వూళ్ళో నా మంచి కోరే వాళ్ళు ఎవరున్నారు? నీకు మంచి దని తోస్తే ఇప్పుడే వ్రాయిం




"ఏమోలే పెద్దమనుషులున్నారని ఊరుకుంటే, వాళ్ళు పోయాకకూడా 'ఒసేవ్, ఏమేవ్' అని వెధవకూతలు కూస్తావా?"

చెయ్యి. అన్నయ్యకి ఎప్పుడు చెప్పాలి అన్నదే భయంగా వుంది' అంది శాంత.

'నన్నేం శాస్తాడులే, నా మీదే సవాల్ చేస్తాడేమో సూడు' అని వీరన్న నసిగాడు.

శాంత వో నిర్ణయానికి వచ్చేసింది. 'ఏమన్నా కానీ అమ్మటం ఖాయం. అన్నగారి సంసారం అన్ని విధాలా బాగున్నప్పుడు, ఇది వాళ్ళ కెందుకు వదిలెయ్యాలి? పైగా ఇన్నేళ్ళనించీ దాని మీద వచ్చింది వాళ్ళే తీసుకున్నారు. తను వచ్చినందుకు వాళ్లేం ఎక్కువ సంతోష పడటం లేదు. ఎందుకో, ఏమో.'

తండ్రి ఇచ్చింది తనెందుకు అనుభవించకూడదు అనుకుంది. 'పిలిపించి బేరం కుదుర్చు' అని వీరన్నకి చెప్పింది శాంత.

వీరన్న భార్య 'అంతడబ్బు వక్క పాలి ఇస్తాడా?' అని అడిగింది.

'ఆడికాడ వుందిగనకే నేను మాట వరస కనగానే పట్టుకున్నాడు. నాకు మాత్రం తెలవదంటే?' అని భార్యని కసిరాడు.

వీరన్న వెళ్ళగానే 'మీ పెద్దత్త పోయేముందు వో గొలుసు, గాజులు చేయించి నా దగ్గరే పెట్టింది. ఏవూసు అనలేదు అనుకో. శాంతకి పుత్తరం

ప్రాయాలన్నా ఆడిసేతేగా రాపించా లనుకునేది. మీ పిన్నత్తకి ఆ వస్తువు సంగతి సెప్పొద్దు అంది. ఎల్లేప్పుడు బాగానేవుంది. అమ్మాయి ఎల్లగానే ఏటో తల్లో మంట అంది అంట. కూసేపట్లో పాణం పోయింది అని సెప్పుకున్నారు. మీ అత్త వడ్డీ కిచ్చిన డబ్బు అంతా మీ అన్న తీసేసుకునే డాబా ఏశాడు. మీ వదిన ఒంటినిండా మలామా పూతలా. ఎంత బంగారం చేసేయించిందోనంట. పెళ్ళికొడుక్కి ఏదేలు ఇచ్చారంటగా?' అని అడిగింది.

తెలవదన్నట్టు పెదిమ విరిచింది శాంత.

'ఇంతకీ నేసెప్పేదేమంటే ఆ వస్తువు నువ్వు తీసుకెళ్ళు. నేనూ పెద్దదాన్నయ్యానా, తరవాత నీకు ఎవరు చేరుస్తారు ననక?' అని వీరన్న భార్య లోపలికెళ్ళి తెచ్చి కళ్ళకద్దుకు శాంత చేతిలో పెట్టింది. పద్దాలుగు తులాలు గొలుసూ. పదితులాలు గాజులూ' అని చెప్పింది.

పెద్దత్త ఎప్పుడూ దూరపు ఆలోచన వుండేది. తన పెళ్ళికి భూమి వ్రాయించిందికూడా ఆవిడే. తండ్రిని పలకసర్లు చేయించమని ఎంతో పోరు పెట్టింది. చేతిలోవున్న పలకసర్లు తిప్పి చూసుకుంది. అసలు మామ్మ ఆ వస్తువ ఇవ్వకపోతేమాత్రం ఎవరు అడగ్గలరు? ఎల్లాగయినా ఆ నిజాయితీ ఆ తరంతోటే ఆఖరేమో! తన చిన్నప్పుడు నాన్న దగ్గర వీరన్నతాత ఎంతెంత కట్టలు దాచేవాడో గుర్తుకు వచ్చింది శాంతకి.

'ఏటి నవ్వుతున్నావు అమ్మాయి?' అంది.

'అబ్బే, చిన్నప్పుడు తాత నాన్న దగ్గరకి డబ్బుకట్టలు తేవడం గుర్తుకొచ్చింది. నేను రోజూ కానీ పుచ్చుకుని గంగిరెద్దువాడి కిచ్చి పొగిడించుకోవటం గుర్తు వచ్చి నవ్వాను' అని శాంత చెప్పి, 'నువ్వు కాబట్టి నా కోసం దాచి ఇచ్చావు; మరొకాళ్ళయితే నాకెందు కిస్తారు' అని వినయంగా తాత భార్యతో అంది.

'ఆఁ ముండాది ఇంతమాత్రానికేనా' జనమం అంతా ఎతికితే ఒకటయినా మంచిపనిదొరకలా?' అని నిట్టూర్చింది.

వస్తువులు మళ్ళీ ఇచ్చి, 'వెళ్ళేటప్పుడు తీసుకుంటా. ఓసారి చిన్నత్తని చూసి వస్తా' నని బయలుదేరింది శాంత.

'చూడు అమ్మాయి డబ్బువూసు ఎత్తమోక. పీక్కుతినేత్తాడు నీ అత్త కొడుకు' అని చెప్పింది మామ్మ.

ఇంటి దగ్గర ఎదురయిన రాజ్యంతో మేనత్తని చూసేందుకు వెడుతున్నానని చెప్పింది. తాను కూడా వస్తానని బయలుదేరింది రాజ్యం. ఎంటెద్దు బండి మాట్లాడింది అప్పలమ్మ. బండి

పుంతలోంచి వెడుతోంది బ్రహ్మ
చెముడు డొంకలు గురివింద తీగెలు
అల్లాగే వున్నాయి. దూరంగా తాటి
తోపూ, గొడ్లపాకలూ, అక్కడ
అక్కడా చుట్టు గుడిసెలు, పంటకాలవ
పైన తాటిబద్దెలు అన్నీ ఎరుగున్న వే.
పచ్చటి పొలాలు పలకరించినట్టు
వున్నాయి. 'ఎన్ని వూళ్ళు తిరిగినా
చిన్నతనంలో పెరిగిన చోటు నచ్చినట్టు
ఏదీ నచ్చదేమో' అనిపించింది.

'ఎప్పుడో అక్కయ్యతో వో సారి
వెళ్ళాను' అని రాజ్యం మాటలు
మొదలు పెట్టింది.

'నేను మాత్రం ఏ వకటి రెండు
సార్లు వెళ్ళానో అత్తయ్య ఇంటికి.
ఎప్పుడూ ఆవిడ నాన్న దగ్గరే వుండేది,
మా చిన్నతనంలో' అంది శాంత.

రోడ్డు మరీ బాగుండలేదు. బండి
కుదుపు భరించలేక రాజ్యం ముందుకి
వంగుతూ అంది.

'దేశంలో ఎంత మార్పు వచ్చినా
పుంతలో మాత్రం రోడ్డు రాలేదు'
అంది శాంత.

బండివాడు చుట్ట పారేసి, 'వోట్ల
కాడ ఆ వూరి పెసిడెంటుగారికి
ఈడ నెగ్గిన ధర్మారావుగారికి సెడింది.
రోడ్డుకి ఏసిన కంకరు గుట్టలు మళ్లా
తీయించేశా రండి' అని చెప్పి పాడు
బడ్డ గుడి రాగానే 'వచ్చేశామండి
వూళ్ళోకి' అన్నాడు, బండివాడు.

మేనత్తగారి ఇల్లు ఏమీ మారలేదు.
విరిగిపోయిన మట్టిగోడల మధ్య వున్న
పెంకుటిల్లూ, ఇంటి ముందు మురికి
గుంటా అల్లాగే వున్నాయి. రాజ్యాన్ని
పిల్చుకు లోపలికి వెళ్ళింది శాంత.
పెరట్లో చిన్నగుడ్డ చుట్టుకు కూర్చుంది
మేనత్త. పరామర్శలు, పలకరింపులు
అయ్యాక 'అమ్మాయి ఎవరే?' అని
అడిగింది మేనత్త.

'మా వదిన చెల్లెలు. మర్చి
పోయావా?' అని అడిగింది శాంత.

'ఎవరు రాజ్యమా? ఎవర్నీ గుర్తు
పట్టలేక పోతున్నానే; నీ కెందరే
పిల్లలు?' అని అడిగి, చూడు మీ వదిన
పెళ్ళికికూడావచ్చి పిలవలేదు; దాని
పొగరు. వక్కదాన్ని బతికున్నాను
గదా!' అని ఆయాసపడింది మేనత్త.

మాట తప్పించాలని 'ఏదో ఆ
హడావిడిలో రాలేకపోయివుంటుంది'
అని శాంత అంది.

'ఈ మాటల కేమిలే. అసలు మీ
అన్నకి డబ్బుదాహం పుట్టింది. అప్ప
కూడ పెట్టిన డబ్బు అంతా చిల్లిగవ్వ
నాకు ముట్టకుండా తనే తీసుకున్నాడు.
మీ వదిన ఎంతో బంగారం కొందిట
అప్పది పెట్టేగా ఈవిడ వడ్డాణాలు
గిడ్డాణాలు చేయించింది. నాకు
కొంతేనా ఇవ్వవచ్చుగా!' అని మూలి
గింది మేనత్త.

'మీ కోడలు లేదా' అని అడిగింది. శాంత.

'తేకేం, వుంది. కొరివితో తల గోక్కున్న అంత సుఖం. కోడలు మాట్లాడితే. వాడేమో దాని పల్లో పడిపోయె. నాకా వోపిక లేదు. అలాగే వార్చి పడేస్తున్నా' అంటూ మళ్ళీ తగ్గటం మొదలుపెట్టింది మేనత్త.

రాజ్యం 'పడదామా' అని అడిగింది.

'ఏమీ పొద్దేమే అప్పుడే వెళ్ళ టమూ?' అంటూ కోడల్ని పొలి తొబ్బలు పెట్టింది రమ్మని శాంత మేనత్త.

కొడుకు వచ్చాడు కోడలు బదులు. 'అది ఏదిరా?' అని తల్లి అడిగింది.

'ఎందుకు అల్లా అరుస్తావ్? ఎన్ని సార్లు చెప్పాను, దాని వంట్లో బాగుండ నప్పుడు పిలవ్వద్దని,' కసిరాడు.

'సరేలే, దానికి నాకూ బాగున్న దెప్పుడు కనక. శాంత చూస్తుం దని పిలిచాను' అంది తల్లి.

శాంత కేసి అదోలా చూసి 'ఎవరో అనుకున్నా. నిన్ను గుర్తుపట్టలేదు సుమా? ఇల్లా తయారయ్యావేం? మీ ఆయనకి ఏమిస్తున్నారు?' అంటూ ఆరాలు మొదలు పెట్టాడు, మేనత్త కొడుకు సూర్యం.

మౌనంగా నవ్వి వూరుకుంది శాంత.

'సరే కాని బొంబాయినించి ఏమి తెచ్చావే అని వెకిలిగా నవ్వుతూ అడి గాడు. భార్య రావటం చూసి 'లక్ష్మి రా, రా, చుట్టం వచ్చింది' అంటూ భయపడుతూ అటు చూశాడు.

వున్న నగలన్నీ పంటిని తగిలించు కుంది. మంచి నలుపురంగు శరీరం మీద బంగారం గంభీరంగా కనపడు తున్నా ఇత్తడి కళ వుట్టిపడుతోంది వాటికి. 'అంత తీరిగ్గా కూర్చున్నారేం' అని కోపంగా సూర్యం కేసి చూసింది లక్ష్మి.

అబ్బే, తీరికా? అమ్మ ఎందుకో పిలిస్తే వచ్చా. ఈవిడ ఎవరో తెలుసు కదూ?' అని శాంతని ఫలానా అని చెప్పుకున్నాడు భార్యకి.

'ఇంకేం మళ్ళా వచ్చి ముచ్చట్లు ఆడుకోవచ్చు. ముందు వెళ్ళి నోటు రాయించుకురండి' అని వెటకారంగా శాంత కేసి చూసింది లక్ష్మి.

ఈసారి శాంతకి కోపము వచ్చినా పైకి ఏమనలేదు. 'వెళ్ళివస్తా' అని మేనత్తకి చెప్పి బయలుదేరింది.

'మా ఆవిడ నిర్వాకం వినకుండానే వెళ్ళిపోతావా?' అని గర్వంగా సూర్యం లక్ష్మి కేసి చూస్తూ శాంతని అడిగాడు.

'కనపడుతూనే వుందిగా! ఇంక విన కర్లేదు' అంది శాంత.

'అబ్బో నిన్ను పొగడలేదనా ఆ అక్కసు' అంది లక్ష్మి.



సూర్యానికి మతిపోయింది. చూడ్డానికివచ్చిన శాంతని లక్ష్మి నోటినించి రక్షించటం ఎల్లాగో తోచక, 'అయితే నువ్వుకూడా వస్తావేమిటి?' అని లక్ష్మిని అడిగాడు.

వాళ్ళ ముచ్చట్లు వినకుండానే శాంతా, రాజ్యం వాకిట్లోకి వచ్చారు. మేనత్త వెనకాలే వచ్చింది.

శాంత మేనత్త చేతిలో డబ్బు పెట్టి 'పటిక బెల్లం తెప్పించుకో' అంది.

'ఎందుకే' అంటూనే లెక్క పెట్టుకు బొడ్డులో దోపుకుంటూ 'వుండు అమ్మా' అని; 'లక్ష్మి బొట్టు పెట్టవే' అని కోడల్ని పిలిచింది.

దొడ్లో వాళ్ళు పగలబడి నవ్వుకోవటం వినపడుతోంది. రాజ్యం గడప మీద అక్కవిడతలో వున్న కుంకం

శాంతకి పెట్టి తనూ పెట్టుకుని 'వస్తా' మని చెప్పి బయలుదేరారు.

బండి మళ్లా వూరు విడిచి పుంత లోకి వచ్చేసరికి చీకటిపడుతోంది.

రాజ్యం 'ఎందుకు వచ్చానా అని పించింది వదినా' అని చెప్పింది.

'ఎల్లా బ్రతుకుతున్నారో బాబూ! వున్న కాస్సేపు తేళ్ళూ జెఱ్ఱులూ పాకి నట్టు అయింది నాకు. వకటి రెండు గదుల్లో వున్నా ప్రాణానికి హాయిగా వుంటుంది మాకు. ఆ అందానికి ఆ నగలు, ఆ మాటలు, ఏదో రాక్షసిలా వుంది, చెప్పద్దూ. పోనీ వాటికేంలే అనుకున్నా ఇల్లైనా సుభ్రంగా పెట్టుకో వచ్చుగా! ఆ ముసిల్దానిచేత వండించక పోతే చేసుకోరాదూ?' అని శాంత రాజ్యంతో అంది.

'నా కూఁడా వచ్చినదగ్గర్నుంచీ చూస్తే అల్లాగే అనిపిస్తోంది. ప్రతిమాట డబ్బుకి ముడి. అది కాకపోతే సినిమా మాటలు, అవి అయిపోతే, ఎవరెవరు ఎవరితో లేచిపోయారో చిట్టాలు విప్పటం; వినలేక విసుగొచ్చి మనం ఏదయినా అన్నామో వ్యాఖ్యానం మొదలుపెడతారు. నరసుకూఁడా ఈ మాటలు బాగా పట్టుబడ్డాయి. ఇంక మా అక్కకి కూతురు ఏది చెప్పినా అదే సమర్థించి మన్నే తిడుతుంది. మన కెందుకనుకో' అని రాజ్యం వూరుకుంది.

శాంతకి భూమిసంగతి రాజ్యానికి చెప్పాలనిపించింది. కొంతసేపు పోయాక, 'మా నాన్న నాకు ఇచ్చిన పొలం వుంది. దాన్ని అమ్మెయ్యాలని వుంది' అని నసిగింది.

'వీళ్ళు దాని మీద సిస్తు ఎప్పుడూ పంపటం లేదు. మీ అన్నగారు ఏమీ అనుకోని మనిషి కనక సరిపోయింది' అని రాజ్యంతో అంది శాంత.

'మీకు డబ్బు ఇచ్చి వ్రాయించు కున్నారుటగా ఆ పొలం' అని రాజ్యం అడిగింది.

'ఇదోటా పైగా, అన్నీ వట్టిదే' అని శాంత చెప్పింది.

బండి ఇంటి సమీపానికి రావటం చూసి ఇద్దరూ వూరుకున్నారు.

ఏదో గుర్తుకి వచ్చినట్టు శాంత బండిని వెనక సందులోకి తోలమంది వీరన్న ఇంటి ముందు బండి ఆపి లోప లికి వెళ్ళింది. వీరన్న భార్య అన్నం వడ్డిస్తోంది. 'తాతా నాన్న వ్రాసిన దస్తావేజు ఇదిగో' అని బాగ్ లోంచి తీసి చేతిలో పెట్టింది.

'ఇది వుంది కందా? మీ అన్న సవాలు చేశాట్ట - ఎల్లా కొంటాడో రాతా కోతా ఏమీ లేదు' అని అంటూ దీపం ముందుకు వచ్చి చదువుకుని, మెళ్లో తాళాలు తీసి పెట్టెలో పెట్ట మని భార్య చేతిలో పెట్టాడు.

'రేపు పొద్దున్నే వచ్చేస్తా, వూ...




"కళ్ళు కనుపించటంలా అట్టా తన్నుకుంటూ పోతున్నావ్?"
"కనపడితే వివాహం ఎందుకు చేసుకునేవాణ్ణి?"

చేసి మధ్యాహ్నం బండీ ఎక్కిం చెయ్యి నన్ను' అంది శాంత.

'పూర్తిఅవుతే అల్లాగే ఎల్లుండిగాని' అని గిన్నె ముందు కూర్చున్నాడు. వీరన్న.

శాంత వచ్చి 'ఆలశ్యం చేసినందుకు ఏమీ అనుకోవద్దు' అంది రాజ్యంతో.

ఇంటికి వెళ్ళేసరికి వదినగారు రొప్పుతూ శాంత మీద మాటలు విసురటం మొదలు పెట్టింది.

ఏమీమాట్లాడకండా తన సామాన్లు వున్న గదిలోకి వెళ్ళింది శాంత. పెట్టిలోవి అన్నీ కిందపడేసి వున్నాయి. అన్నీ సర్దుకుని పెట్టిమీదే కూర్చుంది.

రాజ్యాన్ని అప్పగారు ప్రశ్నలు వేస్తోంది. 'ఇబ్బే ఇంకెక్కడికీ వెళ్ళలేదే. వాళ్ళింటి కెళ్ళి వచ్చేశాము' అని చెప్పటంతో కొంత సర్దుకుని 'ఆవిడని కూడా తిండికి పిలు' అని చెల్లెలితో అంది. ఏదో పూర్తిచేసివచ్చి అక్కడే పడుకుంది. కాని తెల్లవార్లూ నిద్దర పట్టలేదు శాంతకి.

రాజ్యం కూడా ప్రొద్దుటే లేచి రాజమండ్రీ వెళ్ళాలని అప్పకి చెపుతోంది.

ఆ సమయంలోనే తనూ వెడుతున్నానని శాంత చెప్పింది.

'నువ్వు అసలు పెళ్ళికోసమే వచ్చావా? మేము పచ్చగా వుంటే చూడలేక, ఆస్తులు అమ్మకాలు పెడుతున్నావుటగా. మేము బాగుంటేనే నీకు ఇంత పెట్టడం' అని మొదలు పెట్టింది వదినగారు.

'నే నేం మిమ్మల్ని పెట్టమని అడగ లేదు. నాకు మా నాన్న ఇచ్చిందాని మీద వచ్చేది కూడా మీరే తింటు న్నారు. నాకూ మా నాన్న ఇచ్చింది అనుభవించాలని వుంటుంది; అని వుద్రే కాన్ని అణుచుకుంటూ శాంత అనే సింది.

'ఆయనే ఇచ్చాడు. ఎంత చేస్తే అంత మంచి పొలం అయిందో. అసలు ఎవడు కొంటాడో మేమూ చూస్తాము. మీ అన్న కేమీ ఆమాత్రం పలుకుబడి లేకపోలేదు,' అని విసురుగా లోపలికి వెళ్ళిపోయింది వదినగారు.

రాజ్యం శాంతని వూరుకోమన్నట్లు సైగ చేసింది. శాంత సామాన్లు బయ టికి తెచ్చుకుంది. రాజ్యం చేతిలో వో తెల్ల గుడ్డ పెట్టి కళ్ళనీళ్ళు వత్తు కుంటూ 'నాకు చెల్లెళ్ళు లేరన్న కొరత లేకుండా కూడాకూడా తిరి గావు. మళ్ళా ఎప్పుడో చూడటం.' అని 'వెళ్ళవస్తా. అన్నయ్యకి చెప్పు' అని చెప్పింది శాంత.

మళ్ళా వదినగారు వచ్చింది. ఈ పూట వెళ్లేది అదా ఏమిటి చెప్పటం? అయినా మీ అన్నకి నువ్వు అంటే అసహ్యం వేసే రాత్రి వెళ్ళిపోయారు. చెట్టంత మనిషి ఇంట్లో వుండగా, వూళ్ళోవాళ్లా నీకు బేరాలు పెట్టడం. మాకు తెలియకపోవు. అన్నీ తెలి శాయి. నేను విరోధినీ, నువ్వు చుట్టాని వీనా' అంటూ రాజ్యం చేతిలో గుడ్డ తీసి విసిరేసింది.

రాజ్యం గుడ్డని తీసుకు కళ్ల కద్దు కుంది.

శాంత వెడుతున్నా నని వీధిలోకి వచ్చింది.

'ఎల్లా వచ్చిందో అల్లా మర్యాదగా మధ్యాహ్నం బండికి ఇక్కడినించే వెళ్లమని వాళ్ల అన్న చెప్పారని చెప్పు', అని రాజ్యంతో అంది అప్పగారు.

శాంత కళ్ళు తుడుచుకుని సామాను అప్పలమ్మని తెమ్మని వెళ్ళిపోయింది.

వీరన్న భార్య 'అప్పీ, నువ్వు బస్సు కాడ వుండు' అని పంపేసింది.

శాంత వీరన్న భార్యని కావలించు కుని ఏడ్చి వదినగారు అన్నవి చెప్తు కుంది.

ముసిలిప్రాణం కరిగి పోయింది. మాటరాక పెదిమలు వణికాయి.

శాంతని దగ్గరగా తీసుకుని 'ఆళ్ళ తోటి ఏటిలే. నువ్వు మీ అమ్మల్లే మంచి పేరు తెచ్చుకున్నావు. నామల్లే చిప రంటా సుఖంగా వుండు' అంటూ వస్తువులు చేతిలో పెట్టింది.

'నువ్వే వుంచుకో, నా కెందుకు' అంది శాంత.

'ఎంత మాట అమ్మాయి, నా కెందుకు తల్లీ' అంటూ ఇంత పసుపు మూట చేతిలో పెట్టి ఈ పాతికా పెట్టి కోకా, రయికా కొనుక్కుని కట్టుకో' మంది వీరన్న భార్య.




"ప్రఖ్యాత చిత్రకారులు మిస్టర్ రావ్ మోదరన్ ఆర్టుని గురించి రెండు ముక్కలు మాట్లాడుతారు."

బస్సు చప్పుడు విని శాంతని తీసుకు రోడ్డుదగ్గరకి వచ్చింది. వస్తానని ఎన్నో సార్లు చెప్పి శాంత బస్సు ఎక్కింది.

అప్పలమ్మ చేతిలో డబ్బు చూసుకోకుండా శాంత మెడకేసి కన్ను ఆర్పకుండా చూస్తోంది.

'ఏశే, డబ్బులిత్తే తీసుకుపోక' అని వీరన్న భార్య కసిరింది.

బస్సు కదిలింది. వూరి పొలిమేర విడుస్తూంటే శాంత కళ్ళల్లో నీళ్ళు జలజలా రాలాయి. వీరన్న ముందే వున్నాడు. 'వూరుకో తల్లీ' అని పాగా కొంగుతో కళ్ళు తుడుచుకున్నాడు.

వీరన్నతోకూడా బస్సు దిగింది శాంత. ఎక్కడికో తీసుకువెళ్లాడు. ప్లీడర్ని పిలిపించి అవతలవాళ్ళకి నచ్చచెప్పించాడు.

అన్నీ పూర్తయ్యాక కోనేవాడు 'అంత డబ్బూ తేలేదు' అన్నాడు.

'ఏటి, నాటక మాడుతున్నావా?' అని వీరన్న ఎగిరిపడ్డాడు.

'ఇం కెవరో సర్దుతా నన్నారు' అని వెళ్ళి పిల్చుకొచ్చాడు.

'తొందరగా కానివ్వు' అని కసిరాడు వీరన్న.

'పని పూర్తయినా డబ్బు ఎట్టా తీసుకెల్తుద్ది. బ్యాంకి కాయితం తేవాలి' అని బ్యాంకికెళ్లాడు, వీరన్న.

ప్లాటు ఫారం మీద కూర్చున్న శాంతకి వీరన్న మంచితనమే తిరుగుతోంది బుఱ్ఱలో.

'రైలు వచ్చిందా?' అంటూ హడావిడిగా వచ్చాడు వీరన్న. శాంత చేతిలో

చెక్కు పెట్టి 'భద్రం తల్లీ' అని చుట్టూ చూసి 'లోపల పెట్టెయ్యి' అన్నాడు—

'మీ యిద్దరి రుణం ఎలా తీర్చటం' అంది శాంత.

'మీ నాన్న ఎల్లిపోయాడా? అల్లాగే నేనూ ఎప్పుడో! కళ్ళు మూస్తా. నాన్న పేరున పిల్ల పిల్ల అనుభవించాలి. తెల్సిందా! పాడుచెయ్యక సొమ్ముని జాగ్రత్త చెయ్యి' వందసార్లుచెప్పాడు.

'రైలు వస్తోంది, మా అన్నయ్య వూళ్లో లేకండా వెళ్ళిపోయాడు'అంది.

'నీ కాడ దస్తావేజు వున్నట్లు తెల్లను కుంటా. ఆయన వప్పుకుంటేకాని రిజిస్టరు కాదుగా! అందుకని ఎత్తువేశాడు. ఇంక వచ్చాక బలే ఫార్సు జరుగుతుందిలే' అని బోసి నోటినిండా నవ్వాడు వీరన్న. 'కొన్నవోడు ఏమీ తక్కువవోడుకాడు. చూశావుగా డబ్బు తేలేదని నాటకమాడాడు', అని గర్వంగా చెప్పాడు.

రైలు ఆగినా అంత రద్దీలేదు. ఆడ వాళ్ళ పెట్టెలో ఎక్కించి 'జాగ్రత్తగా చేరాక, కార్డుముక్క రాయి' అని; మళ్ళీ 'వద్దులే, మీ అన్నకాడికేగా వత్తుంది' అన్నాడు వీరన్న.

శాంత కనపడేటంతవరకు వీరన్న కేసి చూసింది. చెక్కుని భద్రంగా చేతి బ్యాగ్‌లో పెట్టింది. వీరన్నకి అన్న మీద పగ తీర్చుకునేందుకు ఇది అదను అయివుంటుంది. అతని ధోరణి కొంచం అల్లాగే అనిపించింది. ఛీ, పాపం, తన కోసం ఇంత శ్రమపడితే ఈ ఆలోచనేమిటి అని సమాధాన పడింది. ఈ సారి రైలు ప్రయాణం విసుగనిపించింది. జయ వెళ్ళగానే ఏమి చేస్తుందో! ఇల్లు గుర్తుకి రాగానే ఏవో తియ్యటికలొచ్చినంతఆనందంగావుంది.

బొంబాయి దగ్గరపడింది. తను వచ్చేది తెలియదుగా? ఎవరు వస్తారుతే అనుకుంది. ఇంటికి చేరేసరికి పొద్దు తిరిగింది. పక్కవాటాలో సామాను పెట్టిద్దామనుకుంది కాని తలుపులు తీసి వుండటంతో కూలివాడిని పంపి తలుపు తట్టింది. ఆనంద్ మోహన్ తలుపు తెరిచి శాంత అంత తొందరగా తిరిగివచ్చిందే అన్న సంతోషంతో 'వచ్చావా' అని ఎంతో ఆప్యాయంగా చూశాడు.

శాంతకి దుఃఖం, సంతోషం రెండూ పక్కసారి వచ్చాయి. వెళ్ళినదగ్గర నించీ జరిగిన వన్నీ గుక్కతిప్పుకోకండా చెప్పేసింది. గాజులు చూపెడుతూంటే కన్నీటిబొట్లు జారిపడి ప్లాస్టిక్కు గాజు ఎఱ్ఱరంగు కడిగినట్టు మెరిసిపోయింది.

ఆనందుకి శాంతమీద జాలేసింది. ఆప్యాయంగా తల నిమిరాడు. అల్లాంటి క్షణాలు జీవితానికి జీవం పోసి, ఎన్నో ఏళ్ళు ఖాళీగావుండే సంసారానికి ఎండాకాలంలో వర్షపు జల్లులా తెలియని ఆనందాన్ని ఇస్తుంది.

ఆ క్షణాలని నెమరేసుకుంటూ జీవి



తాన్ని వదల్లేక పడేబాధ. 'నన్నెప్పుడూ ఎక్కడికీ పంపకండేం' అంటూ వచ్చే దుఃఖం ఆపుకుంటూ ఆనంద్ గుండెల్లో మొహం దాచుకుంది శాంత. ఇద్దరి మనస్సులూ కడిగినట్టు నిర్మలంగా ఒకటయి ఎన్నో ఏళ్ళు వెనక్కి వెళ్ళి వచ్చినట్టు నిల్చాయి. మాటలు లేని ఆప్యాయత మళ్ళీ ఇద్దర్నీ ఆవహించింది మళ్ళీ జీవితం ముందుకు సాగిపోయింది



"పెద్దమ్మా! అస్సల్ నీ పేరేవిఁటే?"

"అంతా నా చిన్నప్పుడు సుబ్బులక్ష్మీ! సుబ్బమ్మా! సుబ్బీ! సుబ్బులూ! అని పిల్చేవారు; ఏఁవిఁటో ఇప్పు డంతా రుబ్బులక్ష్మీ! రుబ్బమ్మా! రుబ్బూ! రుబ్బులూ! అంటున్నారు; ఏంచెప్పను, కాలం మారిపోయిందే పిచ్చితల్లీ!—"



"ఏమిరా కృష్ణా! మీ నాన్నగారి పే రేమిరా?..."

"అంతకుముందు వాసుదేవరావుట. నే పుట్టాక వసుదేవరావు అని చిన్నమార్పు చేసుకున్నారుటండీ!"



"సంతాన వేణుగోపాలయ్యంగారు తమరే కదండీ?..."

"అవు, త త తమ రో...??..."



"తెలీదూ?... కుటుంబరావు అంటారు నన్ను..."

పడవేసి తుర్రు మని లోనికి పోయింది
శశికళ. నవ్వుకుంటూ చదువ నారం
భించాడు శైలేంద్ర.

బావకు, శశికి,

మా పరీక్షలైపోయినై. త్వరలో
బయలుదేరి వస్తున్నాను. దయచేసి



స్టేషనువద్దకు బండిని పంపించండి.
విశేషా లేమీ లేవు. నా ఆరోగ్యం బాగానే
వుంది. అత్తయ్యకులాసా అని భావిస్తాను.
నేను వస్తున్నట్లు అత్తయ్యకు తెల్పండి.
ఏమి వ్రాయాలో తెలియటం లేదు. మరి
ముగిస్తాను.

మీ 'చంద్రిక'

చంద్రికాదేవి గురించి ఆలోచనలో
మునిగిపోయిన శైలేంద్ర ఒక్కసారి
గతంలోకి వెళ్ళాడు.

చంద్రిక తల్లీ, తండ్రీ లేని అనాథ. చిన్నప్పటినుండి మేనత్త కమలమ్మ గారు, శైలేంద్ర శశికళలతో సమానముగ చూస్తుండుటవలన చంద్రిక జీవితం సాఫీగానే గడచిపోతున్నది. శైలేంద్రతో చంద్రిక వివాహం జరిపిస్తే వారి జీవితం ఆనందమయంగా సాగిపోతుందని కమలమ్మగారి భావన.

చంద్రిక ఇతరులను యిట్టే ఆకర్షించేటంత సౌందర్యముకల స్త్రీ. ఎంతసేపైనా అలా చూడాలనిపించే రూపమామెది. శైలేంద్ర కూడ ఆమెకు తీసిపోడు. నిండైన విగ్రహం. మేలిమిరంగులో మెరిసిపోతున్న ఆ యువకుడు అందచందాలలోనే కాక గుణగణాలలో కూడ ప్రత్యేకస్థానాన్ని ఆక్రమించాడు. పట్టణ వాతావరణమునకు అలవాటు పడిన వ్యక్తి ఐనప్పటికీ, ప్రశాంతమైన పల్లె వాతావరణములో ప్రజాసేవ చేయాలన్న ఉన్నత ఆశయాలతో డాక్టరై తిరిగి వచ్చి వైద్యవృత్తిలో అచిరకాలంలోనే పలువురి మన్నన సంపాదించాడు. స్వవిషయములోనే కాక యెదుటివారి సంస్కారమును అర్థం చేసుకొని వారి అభిలాషలను, ఆశయాలను తీర్చ ప్రయత్నించే ఆదర్శ పురుషుడు. అందువలననే చంద్రిక కళాశాలలో ఉన్నత విద్యను అభ్యసించేందుకు ఆసక్తి చూపుతున్నదని గ్రహించి, త్వరలోనే వివాహం జరిపించాలన్న తల్లికి సర్ది చెప్పి చంద్రికను గుంటూరు పంపించాడు. ప్రస్తుతం చంద్రిక బి.యస్.సి. పరీక్షలు ముగించి వస్తోంది.

శశికళ స్కూల్ ఫైనల్ పరీక్ష వ్రాసింది. గులాబిరంగులో, అందమైన కండ్లతో యెప్పుడూ చిలిపిగ నవ్వుతూ, నవ్విస్తూ వుండే శశిలో ప్రత్యేకమైన ఆకర్షణ వుంది. స్వతహా తెలివైన దైనప్పటికీ, ప్రతిపని శైలేంద్రకు చెప్పి చేస్తుంది. వివాహం చేయాలన్న 'తల్లి' సంకల్పానికి యెదురు చెప్పలేక అంతటితో చదువు ఆపివేయటానికే నిశ్చయించుకొంది పదహారు వసంతాలు నిండిన శశి.

చిన్నప్పటినుండి చంద్రిక అణకువతో యెదుటివారిని గౌరవించ నేర్చుకొన్న వ్యక్తి. బావంటే అమితమైన భక్తి గౌరవాలు, తనకంటె చిన్నదైన శశిపై ప్రేమాభిమానాలు చూపుతూ ఆ యింటిలో ప్రత్యేకస్థానాన్ని పొందింది. శైలేంద్ర చిలిపిగ యెంత విసిగించినా నవ్వి వూరుకొనేది. "నీవు మాత్రం తక్కువా? బదులు చెప్పమ్మా!" అన్న మేనత్తతో "పోనివ్వండి. బావ నాకంటె పెద్దవారు. నవ్వుతూ అన్నంత మాత్రానే తిరిగి సమాధానం యివ్వటం దేనికి" అని జవాబిచ్చేది. శశికూడా అన్నతోపాటు చంద్రికను వేళాకోళం పట్టిస్తే "నిన్ను యేడిపించే సమయం రాకపోతుందా? అల్లరి పిల్లా!" అని చంద్రిక సమాధాన

ముతో మారు మాట్లాడక వూరుకొనేది శశికళ.

'అవును. చంద్రి యెప్పుడూ విదానమే' మనస్సులో అనుకొంటున్న శైలేంద్ర "అన్నయ్యా ఈ లోకంలోనికి వస్తావా? వదిన త్వరలోనే రాబో తున్నదిగా. అత్రుత దేనికి?" అంటూ నవ్వుతున్న శశి చెవి మెలిపెడుతూ ఆమెతోపాటు లోనికి నడిచాడు శైలేంద్ర.

* * *

"అమ్మా! వదిన వచ్చింది" అంటూ ఆనందముతో అరుస్తున్న శశిని చూసి "వచ్చిన వదిన తిరిగి పారిపోదుగా! యెందుకంత హడావుడి చేస్తావు?" అని నవ్వి "ఏమ్మా! ప్రయాణం చేయుట వలన బడలికగా వుండి వుంటుంది. స్నానావికి రా" అని చంద్రికతో చెప్పి వంటపని చూసేందుకై వెళ్ళింది కమలమ్మ. "పరీక్షలు బాగా వ్రాశావా? చంద్రీ" అంటున్న శైలేంద్రకు "తృప్తి కరంగానే ముగించాను బావా!" అని జవాబిచ్చి స్నానానికి లేచింది చంద్రిక. ఆ రోజు శశి హాస్యోక్తులకు జవాబివ్వక, ఆలోచనలో వున్న చంద్రిక ప్రవర్తన శైలేంద్రకు విచిత్ర మనిపించింది.

ఆ రోజు యెక్కువమంది రోగులు లేనందువలన హాస్పిటలు బాధ్యత నర్సుల కప్పగించి సాయంత్రం త్వరగా ఇంటికి చేరుకున్నాడు శైలేంద్ర. స్నానపానాదులు ముగించి వెన్నెలగా వున్నందువలన శైలేంద్ర, శశి, చంద్రిక మేడపైకి వెళ్ళారు. కొంతసేపు చంద్రిక చెప్పే కాలేజీకబుర్లు, గుంటూరువిశేషాలు విన్న తరువాత "ఇప్పుడేవస్తా"నంటూ క్రిందకు వెళ్ళింది శశి. నిమిషకాలం వారి మధ్య నిశ్శబ్దమే తాండవించింది. కొన్నిక్షణా లైన తరువాత నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ "బావా! జీవితం గురించి మీతో నేనెప్పుడూ ముఖాముఖి మాట్లాడలేదు మాట్లాడలేను కూడ. ఏ పరిస్థితులలోను నన్ను నిందించక అర్థం చేసుకొని ఆద రించగల వివేకవంతులు, సహృదయులు మీరు" అంటున్న చంద్రికతో "ఇంత ఈ ఉపోద్ఘాత మేమిటి? సూటిగా చెప్పు చంద్రీ" అన్నాడు శైలేంద్ర "క్షమించండి బావా! నా అభిప్రాయాలు మీతో సూటిగా చెప్పలేను. దయచేసి ఇది చదవండి. నా మన స్సేమిటో పూర్తిగా తెలుస్తుంది. అపార్థం చేసుకో రనే ఆశిస్తాను. నన్ను మన్నించండి" అంటూ తానుకూడ క్రిందకు వెళ్ళి పోయింది.

"బావా!

తల్లిని, తండ్రిని కోల్పోయి మాతా పితృ ప్రేమ యెరుగని నేను ఈ యింటిలో అంతకంటే యెక్కువ ఆదరణ పొందాను. అందుకు నేను జీవితాంతము ఋణపడివుంటాను. భగవంతుని సృష్టిలో మానవు లందరు ఒకే విధముగ వుండరు ఒకే అభిప్రాయాలు కూడ వుండవు

మానవ దృక్పథము విచిత్రమైనది. ఎవరి ఆలోచనలు యే విధంగా పయనిస్తాయో చెప్పటం కష్టము. జీవితములో యెప్పుడు, యే సంఘటన జరుగుతుందో యెవరు యే విధంగా మారుతారో తెలియదు. నా జీవితములో కూడ ఒక ముఖ్యమైన సంఘటన జరిగింది. సాధారణముగ నేను కాలేజినుండి నేరుగ హాస్టలుకు వెళ్ళేదాన్ని. ఒకరి విషయాలలో జోక్యం చేసుకొనే మనస్తత్వం కాదు. నేను యెవరి దృష్టిలోనూ పడకూడదన్న భావనలోవుండేదాన్ని. నా చదువూ, నేనూ తప్ప మరో ప్రపంచముతో సంబంధము లేకుండానే నా బి. యస్‌సి. రెండు సంవత్సరాలు గడచిపోయినవి.

చివరి సంవత్సరంలో అంటే నేను రెండవ సంవత్సరం పరీక్షలు వ్రాసి సెలవలు గడచిన తరువాత కాలేజికి వెళ్ళిన క్రొత్తలో ఒక విచిత్రమైన వ్యక్తితో విచిత్ర పరిస్థితులలోనే పరిచయమైంది. ఆయనపేరు అమరేంద్ర. ఒకనాడు నేను హాస్టలుకు వెళ్తూ ఒక యింటి ముందు ఆగి అలా చూస్తూ వుండిపోయాను. సాధారణముగ నేను తలయెత్తి యే యింటినీ పరికించను. అతి మనోహరముగవున్న గులాబి, విరజాజి, సంపెంగ, మల్లెలు, సన్నజాజి, చంపక, చామంతి మొదలైన వివిధ పుష్ప వృక్షములతో ఆ యింటిముంగిట నున్న తోట కన్నులపండువుగా వుంది. ఆ రోజు మరింత విరబూసి వుండటముతో నాకు తెలియకుండానే అలా నిలబడిపోయాను.

ఆ పువ్వులను తదేక దృష్టితో పరికిస్తున్న నేను పరిసరాలనే మర్చిపోయాను. నా కనులకు అందమైన ఆ కుసుమములు తప్ప మరేవీ గోచరించుటలేదు. అందువలన అక్కడ ఒక పురుషుడున్నాడనే గమనించలేక పోయాను.

'మీ ఏకాగ్రతను భంగపరుస్తున్నందుకు క్షమించండి. లోపలికిరావచ్చు' అన్న పురుషకంఠంతో బాహ్య ప్రపంచములోపడి అక్కడ నేనుకాక మరోవ్యక్తి వున్నారని తెలుసుకున్నాను. సంస్కారవంతులని ఆయన మాటలు నిరూపిస్తున్నందువలన, మరోసారి రమ్మని కోరటముతో కాదనలేక లోపలికి వెళ్లాను. 'హలో! మీరా చంద్రికా! ఆహ్వానించినా రాని మీరు పిలువకనే వచ్చారంటే యెంత అదృష్టం. ఈ రోజేదో విశేషముంది సుమా!' అంటూ వచ్చింది ఒక స్త్రీ. ఆమె నా క్లాస్‌మేట్, పేరు వీణ. చాల మంచిది. 'అన్నయ్యా! ఈమె నా క్లాస్‌మేట్. పేరు చంద్రిక. మితభాషిణి. మనవలె అధికముగా మాట్లాడదు' అని చెప్పుతూ 'ఈయన మా అన్న అమరేంద్ర. నాగార్జునసాగర్‌లో ఇంజనీర్‌గా పనిచేస్తున్నాడు' అంటూ ఆయనను నాకు పరిచయం చేసింది.

'మీరు పుష్ప ప్రియులనుకుంటాను' అని ప్రశ్నించిన అమరేంద్రతో 'యెందు

కలా అనుకుంటున్నా'రని నే నడిగితే, 'రచయితలు కాని రచయిత్రులు కాని ప్రకృతి సౌందర్యాన్ని చూసి పరవశించి వ్రోతా రని విన్నాను' అని జవా బిచ్చారు.

వీణ కోరికపై తరచుగా వాళ్ళ యింటికి వెళ్తుండేదాన్ని ఆమరేంద్రకూడ నావలె ప్రత్యేకాభిప్రాయాలు వున్న వ్యక్తి. మా మధ్య స్నేహం పెరుగుతూనే వుంది. మాకు తెలియకుండానే ఒకరిని ఒకరం అభిమానించుకోవటము ప్రారంభించాము. అంతవరకు ప్రేమంటే యేమిటో తెలియని నేను ఆయనను ప్రేమించుట ప్రారంభించాను. చిన్నప్పటినుండి మీరంటే నాకు అభిమానం. కాని దానిని 'ప్రేమ' అని నిర్వచించలేను. మీరంటే అంతులేని గౌరవం. మీరు నన్ను వివాహం చేసుకోవా లని అనుకుంటున్నా రని తెలుసు. మీరే ఆలోచించండి బావా! భార్యాభర్తలమధ్య వుండవలసినవి ముఖ్యముగ ప్రేమానురాగాలే కాని భక్తి గౌరవాలు కావు కదా! ప్రేమానుబంధం లేనినాడు వారు సుఖంగా యెలా వుండగలరు?

'చిన్నప్పటినుండి పెంచి పెద్ద చేసినందుకు నీవు చూపవలసిన కృతజ్ఞత యిదా?' అని అత్తయ్య ప్రశ్నిస్తే సమాధానం చెప్పలేను. మీరే చెప్పండి. ఒకరిబాధను పూర్తిగా అర్థంచేసుకొని పోగొట్టగల డాక్టరు మీరు. అంతేకాదు. నా పరిస్థితిని, నా అభిప్రాయాలను అర్థం చేసుకోగల విజ్ఞానవంతులు. నేను తప్పు చేశా నని మీరంటే మీరు యేవిధమైన శిక్ష విధించినా, అనుభవించేందుకు సిద్ధమే. నాకై నేను ఆలోచించుకోగల వయస్సు వుంది. నా వ్యక్తిత్వాన్ని చంపుకొని మీ మీద గౌరవముతోనే మిమ్మల్ని వివాహం చేసుకొని జీవించి తీరా లంటే సమాధానం చెప్పలేను. కాని న్యాయ మేమిటో మీరే ఆలోచించండి

చిన్నప్పటి నుండి నన్ను అభిమానిస్తున్నా రని, నాపై ఆశలుపెంచుకొన్నా రని నాకుతెలుసు. ఒక్క యింటిలో మీతోపాటు పెరిగిన నాకు మీ మీద భక్తి గౌరవాలు తప్ప మరేభావాలూ కలుగలేదు. ఒక్క పరిధిలో పెరిగిన వ్యక్తులం మనం. మీకై మీరు నిర్ణయించుకోండి. మీరు న్యాయమే ఆలోచిస్తారని, మనస్సు తెలుసుకొని ప్రవర్తించగల రని నాకు నమ్మకం వుంది. నేను నిరాకరించినంత మాత్రానే కోపగించుకుంటా రని నే ననుకోను. నన్ను మన్నించండి బావా! 'నీవు చేసింది తప్పు. నీవు చూపవలసిన కృతజ్ఞత యిది కా' దని మీరు నిందిస్తే భరించలేను. మరొకసారి క్షమించమని ప్రార్థిస్తున్నాను. నన్ను సహృదయముతో అర్థం చేసుకోండి బావా! అర్థం చేసుకోండి. సెలవ్.

— 'చంద్రిక'

చదవటం ముగించిన శైలేంద్ర 'చంద్రీ' అంటూ బాధగా ఆలోచనలో

ముడిగిపోయారు. అంతులేని అనురాగం యెవరిమీద పెంచుకొన్నారో వారి నిరాదరణ శరాఘాతంవలె బాధించింది. విధి విచిత్రమైనది. భగవంతుని అపూర్వ దృష్టిలో పరిభ్రమించే సర్వసాధారణ మానవులకు ప్రేమ సహజమే యైనా, తాము చేయగల ఉత్తమ సంస్కారం అందరికీ అలవడుతుందా?

మనస్సు పరిపరివిధాల పోతున్నది. పదిమందికి కట్టుకట్టి గాయాలు మాన్పి బాధలను తీర్చగల డాక్టర్. ఈనాడు తన మనస్సులో రేగిన గాయాన్ని యెలా మాన్పుకోగలడు? 'తప్పదు. చంద్రిక సుఖించాలంటే నేను ఆమెకు దూరముగా వుండాలి. ఈ సంకల్పం నాకు బాధ కలిగించినప్పటికీ, చంద్రిక సుఖంకోసం సంతోషముగ భరించాలి. స్వచ్ఛమైన ప్రేమకు ప్రతిఫలాపేక్ష వుండదంటారు. నిజమే. నేను చంద్రికనుండి యేమీ కోరను' ఈ విధమైన నిర్ణయముతో కలతనిదురలో రాత్రి గడచింది.

మరుసటిరోజు శైలేంద్ర ప్రవర్తన చూసి యేమీ అర్థంకాక అయోమయంలో వుండి పోయింది శశికళ. చంద్రిక తనలో తాను మథనపడసాగింది. విస్పారముగ, యేవిధమైన హాస్య ప్రసంగాలు లేకుండా ఆ ఉదయం గడచిపోయింది.

"చంద్రీ, నీతో మాట్లాడాలి. ఒకసారి పైకిరా!" అన్న శైలేంద్రమాటలు విని మౌనముగ అతన్ని అనుసరించింది చంద్రిక. కొన్ని క్షణాలు మౌనమే రాజ్యం చేసింది. "చంద్రీ! నేను చెప్పేది సావధానముగ విను. ఒక్కటి మాత్రం నిజం. మనసులేనిచోట మనిషి బ్రతకటం కష్టం. నిన్ను బలవంతాన వివాహం చేసుకొనేపాటి మూర్ఖుడినికాదు. నీ కోరికలు తీర్చాలని, నీ అభిరుచులు నశింపకూడదనే కదా ఆనాడు అమ్మకు సర్దిచెప్పి నిన్ను చదువుకు పంపించాను. ఎవరికోసం యెందుకు? నీ చదువు నాకేమైనా లాభిస్తుందా? నేను డాక్టర్. నీవు ఉద్యోగము చేయవలసిన అవసరంలేదు ఐనా నీ ఆసక్తి చంపటం నా కిష్టంలేక అమ్మకు నచ్చచెప్పాను. ఒకరి ఆశయాలను కాదని మూర్ఖంగా నాస్వంతం చేసుకొనే వ్యక్తినికాదు చంద్రీ! ఈనాడు మాత్రం నీ కోరిక నెందుకు కాదంటాను? నీవు కోరుకొన్న వ్యక్తితో సుఖపడతానంటే నేనుమాత్రం యెందుకు అంగీకరించను? ఐతే చిన్నప్పటినుండి పెంచి పెద్దజేసి తన కోడలిగ చేసుకోవాలన్న అమ్మకు ఈ విషయం బాధ కలిగించవచ్చు. అది సహజమే యైనా భరించక తప్పదు. ఒకరు బాధపడతారని నీ నిర్ణయం మార్చుకో నవసరంలేదు. నీవు జీవితాంతము యెవరితో కలిసి సుఖమయ జీవితం సాగిస్తావో, యెవరైతే నీ కష్ట సుఖాల్లో తోడునీడగా వుంటారో, యెవరి మృదు మధురవాక్కులు విచార సమయంలోకూడ నీ మదియందు అమృతమ



చిలికిస్తాయో, ఆ వ్యక్తిని నీవు — సంపూర్తిగ అర్థం చేసుకొని సర్వ సుఖాలతో ప్రశాంతముగ గడిపితే చాలు. చదువు, సంస్కారం, లోకజ్ఞానం కలిగిన నీవు నీ జీవిత భాగస్వామిని యెన్నుకోవటములో పొరబడవనే ఆశిస్తాను. అమ్మకు చెప్పిఒప్పించే బాధ్యత నాది. నీ బావగా కాక మనసు తెలుసుకొన్న ఒక స్నేహితుడిగా నీ వివాహం జరిపిస్తాను. ఒకరికి సంతోషం కలిగించా లని, ఇరువురు ప్రేమైకజీవులను వివాహబంధంతో శాశ్వతముగ ఒక్కటి చేశానన్న సంతృప్తి నా కెప్పుడూ వుంటుంది.

మనస్ఫూర్తిగ మిమ్మల్ని ఆశీర్వదిస్తాను. అమూల్య కల్యాణ కౌతుక సమృద్ధి కలగాలని దీవిస్తాను. చంద్రతారార్కముగ మీ దంపతులు ఒక్కటిగ జీవించాలని కోరుతుంటాను. ఇంతకన్నా నీ బావగా నీ వేది కోరినా చేస్తాను. నావద్ద యేదీ దాచకు చంద్రీ! ఈ ప్రపంచములో నీ శ్రేయస్సు కోరే బావ వున్నాడని మరచిపోకు. నా మాటలు నిన్ను యే విధముగానైన బాధిస్తే క్షమించు. వెళ్లు చంద్రీ! చాల టైము గడచింది. నీ కోర్కె

తప్పక నెరవేరుస్తాను. నిశ్చింతగా వుండు" ముగిస్తూ దీర్ఘశ్వాస వదిలాడు శైలేంద్ర.

"క్షమించండి బావా! నేనే మిమ్మల్ని బాధించి వుంటాను. నాకు తెలుసు. మీ అమృత హృదయ మెంతో గొప్పదని. మీ విశాలతకు, ఉదారస్వభావానికి నా మనస్సు ఉప్పొంగిపోతూంది. మీ త్యాగానికి విలువ కట్టలేను. నా అనురాగ జ్యోతి ఆరిపోకుండా నిలబెట్టి నా జీవితానికి సఫలత చేకూర్చిన పుణ్యమూర్తులు మీరు. మీకు అంజలి ఘటించటం మినహా నేనేమి చేయగలను? చాలు బావ! నన్ను మీరు అర్థంచేసుకున్నారు. అంతే చాలు ఈ చంద్రిక మీ యెడల యెప్పుడూ కృతఘ్నురాలుకాదు. పవిత్ర హృదయానికి నా జోహార్లు. నా వలన సౌకుమార్యమైన మీ హృదయం గాయపడితే మన్నించండి" ఉద్వేగముతో క్రిందకు వెళ్ళిపోయింది చంద్రిక.

కొన్నిరోజులు మౌనముగానే గడచిపోయినవి. అన్న ప్రవర్తన అర్థంకాక, చంద్రిక ముఖాన్ని అర్థం చేసుకోలేక తికమక పడుతోంది శశికళ. ఎప్పుడూ చిలిపిగ వుండే శైలేంద్ర ముఖములో గాంభీర్యం తొణికిసలాడుతున్నది. హాస్పిటలులో యెక్కువకాలం గడపి ఇంటికి తిరిగి వస్తున్నాడు. సంభాషణ కూడా అధికముగ సాగించుటలేదు. ఎంత దాచినా, ఆ ముఖంలో యేదో తెలియని బాధ. వెలితి ప్రస్ఫుటముగ గోచరిస్తున్నది.

చంద్రికకూడ అలాగే వుంటున్నది. శశికి కాలేజి విషయాలు చెప్పి, తఱుచుగ కొన్ని నవలలగురించి విమర్శనాత్మకంగా ఆమె కర్థమయ్యేట్లు బోధించేది. ఇప్పుడు వాటి విషయమే పట్టించుకున్నట్లు లేదు. పైగా చంద్రిక తననుండి తప్పించుకు తిరుగుతున్నదని, యెక్కువకాలం వంటరిగ గడుపుతున్నదని శశి గ్రహించింది. తనకే కాక అన్న శైలేంద్రకు కూడ దూరముగ వుంటున్నదని గమనించిన శశిలో కొంత అనుమానము పొడచూపినది. ఐనా చంద్రిక మనస్తత్వం అర్థం చేసుకోవటం కష్టమని వూరుకున్నది. వెనుకతరం వ్యక్తి కావటం వలన కమలమ్మగారికీ విషయాలు అంతగా తెలియవు.

ఒకరోజు తలవంచుకొని వ్రాసుకొంటున్న శైలేంద్ర తల్లి రాకను గమనించలేదు. "చాల కాలంనుండి నీతో మాట్లాడా లనుకుంటున్నాను బాబూ! ఏదీ? నీవు నాకటువంటి అవకాశమిస్తేనా?" తల్లి మాటలకు తలయెత్తి "చెప్పమ్మా! నీమాట యెన్నడూ కాదనలేదుగా!" అంటున్న శైలేంద్ర తల్లి అడగబోయే విషయాన్ని గురించి ఆలోచిస్తున్నాడు.

"చంద్ర పరీక్షలైపోయినవి. నా ఆరోగ్యం అంత బాగుండుటలేదు శశి




"ఊరినున్న ఒక్క సంగతి చెప్పకుండా ఈ రెళ్ళాడు."

కూడ వివాహదశలో కాలుపెట్టింది. ముందు నీ పెండ్లి జరిగితే తరువాత శశి గురించి ఆలోచించవచ్చు. ఇంతకాలం ఆ తరుణం యెప్పుడు వస్తుందా అని యెదురుచూశాను. ఇంక వినీక్షించలేను. మీ వివాహ మైతే నాకు తృ ప్తిగా వుంటుంది. శైలూ! తండ్రిలేని మిమ్మల్నీ, తల్లీ తండ్రీ లేని చంద్రినీ అల్లారుముద్దుగా పెంచాను. మీరు సుఖపడుతుంటె జూసి ఆనందించటం తప్ప ఈ వయసులో నేను కోరుకునేది యేముంది? నీవు అంగీకరి స్తే మంచి రోజు చూసి ముహూ ర్తం పెట్టిస్తాను. తరువాత శశికి జరిపించవచ్చు. ఏమంటావు బాబూ!"

తల్లికి యేమిసమాధానంచెప్పాలా అని ఆలోచిస్తున్న శైలేంద్రను "ఏమిటి శైలూ! సమాధానం చెప్పవేం? ఇటీవల నీ వెందువల్లనో మారినట్లున్నావు. కారణం చెప్పు. ఏదైనా నీ యిష్టప్రకారమే జరుగుతుంది కదా?" అన్న తల్లిమాటలకు కొన్ని క్షణాలు గడచిన తరువాత నెమ్మదిగ "అంత త్వరపడటం దేనికమ్మా? ముందు చంద్రి వివాహం కానివ్వు" సమాధానం చెప్పాడు. ఆ మాటలు కమలమ్మకు పిడుగుపాటుగ ధ్వనించాయి. "ఏమిటి శైలూ, నీ వంటున్నది? నీ కేమైనా మతిపోయిందా? చంద్రి పుట్టిననాటినుండి నీ భార్యగా పిలువబడుతోంది. ఈ నాడు మాత్రం అలా యెందుకు జరగకూడదు? ఐనా యిప్పుడు ఈ మార్పుకు కారణ మేమిటి?" రుద్ధకంఠముతో అంది.

"ఆగమ్మా! నే చెప్పేది పూర్తిగవిను.

ఇందులో చంద్రి తప్పు కాని, అపార్థం చేసుకొనే అవసరం కానీ లేవు. దయ చేసి చంద్రిని నిందించకు. చంద్రిని నే సమర్థిస్తాను.

"ఒక పుష్పాన్ని కోరుకుంటాం. అది అందరాని దైనప్పుడు నిరాశ చెందటం మానవ సహజం. కాని ఆ పుష్పాన్ని స్వీకరించే అర్హత, అవకాశం మనకు వున్నదీ, లేనిదీ ముందుగా తెలుసుకో వాలి. అలాకాక బలవంతాన దానిని పొందా లనుకుంటే మూర్ఖత్వమే అవు తుంది. క్షమించమ్మా! అసలు విషయం చెప్తాను విను. చంద్రి మరొకరికి మన సిచ్చింది. మనస్ఫూర్తిగ ఆ వ్యక్తిని వివాహం చేసుకోవా లని కోరుకున్నది. ప్రేమించటము సహజమే నమ్మా! ఆ ప్రేమ నిలుపుకొన్ననాడే ఆ వ్యక్తులు ధన్యు లౌతారు. చంద్రి మనసు తెలిసి కొన్న మనము ఈ వివాహం జరిపించితే వాళ్ళ జీవితాలను ఆనందమయం చేసిన ఫలందక్కుతుంది. శశితోపాటు సమంగా ప్రేమాభిమానాలతో చంద్రిని పెంచావు. అటువంటి నీవు ఆమె బాధను సహించ గలవా? శశితోపాటు చంద్రికూడ సుఖ పడా లని కోరుకోవా? నీవు ఈ వివాహా నికి అంగీకరించి వారిని హృదయ పూర్వకముగ ఆశీర్వదించమ్మా! చంద్రి అమాయకురాలు. మనము అపార్థం చేసు కొని తనని నిందిస్తా మని భయపడు తున్నది. వెళ్ళమ్మా. వెళ్ళి చంద్రికి ధైర్యం చెప్పు" ఆవేశంగా ముగించాడు శైలేంద్ర.

"బాబూ! నీవు చెప్పింది నిజమేనా? చంద్రి మరొకరిని ప్రేమించిందా? భగవాన్! కలలోకూడ ఊహించలేదే! ఎప్పటికైనా నీ భార్య కావలసినదే అని భావించాను కాని యిలా జరుగుతుం దని అనుకోలేదు." భారంగా మాట్లాడుతున్న తల్లి మాటలకు అడ్డు వస్తూ "బాధ దేని కమ్మా! యెక్కడైనా చంద్రి సుఖ పడటమేగా నీ వాశించేది. మన సొకచోట మనిషొకచోట. అంతకన్నా దుర్భరమైన జీవిత మేముంది? అందువలన ఈ వివాహానికి మనస్ఫూర్తిగ అంగీకరించు" బ్రతిమాలుతున్న ధోరణిలో అన్నాడు శైలేంద్ర.

"శైలూ! నిన్ను కాదన్న కోపం లేకపోగా. చంద్రినే సమర్థిస్తున్నా వంటే నీ హృదయమెంత నిష్కల్మష మైనదో అర్థం చేసుకోగలను. సరే! మీ ఇష్టమై నట్లే కానివ్వండి. కాని, నీ వివాహ మెంత త్వరలో కాగలిగితే నా కంత సంతృప్తి" నిట్టూరుస్తూ అంది.

"చాల సంతోషమమ్మా? నాకు తెలుసు నీవు చంద్రిని తప్పక దీవించగల వని ఇప్పుడే నా వివాహ ప్రసక్తి తీసుకురాకు ముందు శశి వివాహం కానివ్వు. మరేమీ అడగకు" గంభీరముగ వున్న శైలేం ద్రను చూసి మారు చెప్ప లేక లోనికి నడిచింది కమలమ్మ.

అమరేంద్ర తల్లి దండ్రులైన కాంతమ్మ ఆనందరావులతో సంప్రదించి వివాహ ముహూర్తం నిర్ణయించటం, కొలది రోజులకే ఆ శుభకార్యము నెరవేరటం వెంట వెంటనే జరిగి పోయాయి. చంద్రిక అత్తవారింటికి వెళ్ళిపోతుందంటే, ఆమెతో పెరిగిన శశి, శైలేంద్రలకు, పెంచిన కమలమ్మకు తెలియని బాధగా వుంది. ఆరోజు రానే వచ్చింది. పుస్తకం చదువుకొంటున్న శైలేంద్ర చంద్రిక రాకను గమనించి తల పైకెత్తాడు.

"బావా! బహుశా నేను చాల రోజులకు గాని, ఈ ప్రాంతాలకు వచ్చే అవకాశం వుండ దనుకుంటాను. ఈ చివరిరోజు మీతో మాట్లాడా లని వుంది. అనుమతిస్తారా?"

"క్రొత్తగా మాట్లాడుతున్నావే చంద్రీ! నావద్ద నీ కెప్పుడూ స్వాతంత్ర్య ముంటుంది. నీవు మరొకరి భార్యవైతే మాత్రం నేను బావను కాకపోతానా? మనలోమనకు అనుమతులూ, ఆజ్ఞాపనలూ దేనికి?" నిష్కల్మషముగ మాట్లాడు తున్న ఆ నిర్మల మూర్తికి మనస్సు లోనే అంజలి ఘటించింది చంద్రిక.

తిరిగి ప్రారంభిస్తూ శైలేంద్ర "చంద్రీ! విద్యా వినయాలతోపాటు వివేకవంతుడు, రూపవంతు డైన భర్తను పొందావు. చిరకాలం అదృష్టవంతురాలిగ జీవించా లని ఈబావ కోరుకుంటా డని మరువకు. ఎక్కడ వున్నా నా శుభాశీస్సు లు నీ కెప్పుడూ లభిస్తాయి." అతని మాటలకు అడ్డువస్తూ "మీరు యెప్పుడూ నన్ను అభిమానిస్తా రని, నా శ్రేయస్సు అభిలషిస్తా రని నాకు తెలుసు బావా! ఆ నమ్మకంతోనే నాగురించి మనసు విప్పి పూర్తిగ తెలియపరుచుకున్నాను. ఒకటి మాత్రం మరువకండి. మీరు కూడ వివాహం చేసుకొని, విచార మెరుగని సంసార జీవితములో, అనురాగ స్రవంతిలో జీవిస్తుంటే చూసి ఆనందించా లని నా కోరిక. ఆజ్ఞాపిస్తున్నా ననుకో కండి. ఈ యింటినుండి నా నిష్క్రమ ణతో అత్తయ్యకు బాధగా వుండవచ్చు. అందుకే ఈ స్థానాన్ని వెంటనే ఒకస్త్రీ పొందాలి. అది యెంతత్వరగా జరిగితే అత్తయ్యకు అంత సంతోషముగ వుంటుంది. కనీసం ఆమెమీద వుండే ప్రేమ, గౌరవాలతోనైనా వెంటనే పెండ్లి చేసుకోండి. చిన్నప్పటి నుండి నన్ను అభిమానించారు. ఆ అభిమాన ముతోనైనా కోరిక తీర్చండి. ఈ యింటి కోడలు, మీ జీవితాన్ని తీర్చిదిద్దే భార్య, మీ ప్రాణసమానమైన శశికి వదినా, నాకు చెల్లెలూ వచ్చిననాడు మీకంటే యెక్కువ ఆనందించేవా న్నన్నా రని మరచి పోవద్దు." ప్రార్థిస్తున్నట్లుగా అంది చంద్రిక.

"ప్రయత్నిస్తాను చంద్రీ! వివాహం జీవితాని కెంత ముఖ్యమైనదో నాకు

తెలుసు. అది ఇప్పట్లో సాధ్యం కాక పోయినా తప్పక జరిగి తీరుతుంది. అందరి ఆనందమే నా ఆనందం. శశి పెండ్లి ముందు జరిగితే నాకు తృప్తిగా వుంటుంది. ఆమెకు తగ్గ వరుని అన్వేషించడములో కొంతకాలం గడుస్తుం దనుకుంటాను. నీవు వెళ్ళి పోవడముతో శశి వంటరిగ బాధపడ వచ్చు. ముందు ఆమెకు తోడు యేర్పర చాలి. నా యీ ఆశయం నెరవేరిన తరు వాతనే నా వివాహ విషయం ఆలో చిస్తాను:" సమాధానం చెప్పాడు శైలేంద్ర.

"అవును. వంటరిగ శశిని యెక్కువ కాలం యింట్లో వుంచినా బాగుండదు. ఆమె అదృష్టవంతురాలు కాగలదనే ఆశిస్తున్నాను. అందచందాలతో పాటు ఉత్తమ గుణాలను కూడ పుణికి పుచ్చుకున్న స్త్రీ శశి. ఎక్కడవున్నా నన్ను చిన్నప్పటినుండి ప్రేమాభి మానాలతో గౌరవించిన ఈ యింటిలోని ప్రతివ్యక్తి శ్రేయస్సు కాంక్షిస్తాను. సహృదయ సౌందర్య సద్గుణమూర్తియైన స్త్రీ మీకు భార్యగా రావాలని భగవంతుని ప్రార్థిస్తాను. నాకు తెలియకుండా మీ మనస్సు నొప్పించివుంటే క్షమించండి బావా!" అంటూ ముగించి కడపటిసారిగ అతనివద్ద సెలవు తీసికొని వెళ్ళి పోయింది చంద్రిక.

చంద్రిక కాపురానికి వెళ్ళునప్పుడు "వదినా! నన్ను గుర్తువుంచుకొని తరచుగ వుత్తరాలు వ్రాస్తుంటావు కదూ! ఎక్కువగ వద్దులే. అమూల్యమైన మీ కాలాన్ని వృధా చేశానని అన్నయ్యగారు నాపై కోపగించుకుంటారేమో!" చిలిపిగా మాట్లాడుతున్న శశితో "మా అన్నయ్య వచ్చేవరకు నీ అల్లరి యిలాగే వుంటుందిలే! ఆసమయం కూడ త్వరలోనే రాబోతున్నదిగా!" అని నవ్వుతూ, "ఐనా శశీ! నన్ను మర్చిపోవ టమా? ఇంకెప్పుడూ అలా అనకు. అత్తయ్య ఆరోగ్యం జాగ్రత్తగ చూస్తుండు" గంభీరముగ పలికి కమలమ్మగారి పాదాలకు చివరిసారిగ నమస్కరించి వెళ్ళిపోయింది చంద్రిక.

చంద్రిక వెళ్ళిపోవడం, శైలేంద్రకూడ యెక్కువకాలం రోగుల సేవలో గడుపు తున్నందువలన శశి వంటరిగ బాధపడ సాగింది. నిత్యమూ కొన్ని గంటలు తల్లికి భగవద్గీత చదివి వినిపిస్తుంది. సాయంత్రం సమయాల్లో అప్పుడప్పుడు నవలలు చదవటం ఆమె అలవాటు.

స్వతహా నెమ్మదస్తుడు, యితరులను గౌరవించి ఆదరించగల మనస్తత్వం కలవాడగుటవలన అనతికాలంలో అతని పేరు ప్రఖ్యాతులు పలువురికి తెలిసినవి. శారీరక బాధలకు తట్టుకోలేక, యెక్కువ డబ్బుతో వైద్యం చేయించుకోలేని నిరు పేదలకు ఉదారముగ వైద్యము చేసి వారికి సంపూర్ణారోగ్యం కలిగేటంతవరకు




"పిచ్చి ఎవరికి?"

కంటికి రెప్పవలె చూసే శైలేంద్రను ఆరాధ్యదైవముగ పూజిస్తారా వ్యక్తులు. అసలు డాక్టరు ప్రవృత్తే విచిత్రమైనది. విభిన్న మనస్తత్వాలు కల వ్యక్తులు వస్తుంటారు. సహనము కోల్పోయి, బాధలకు తట్టుకోలేని కొందరు వ్యక్తులెంత అతిగా విసిగించినప్పటికీ, చిరునవ్వుతో వారిని ఓదార్చి వారి బాధలు తొలగించటమే తన బాధ్యత అన్నట్లు ప్రవర్తించే శైలేంద్రను చూసి ఆశ్చర్యపడనివా రుండరు. ఎంత కోపస్వభావులైనా, శైలేంద్ర చల్లనిమాటలు వింటే మారు మాటాడక మందు వేయించుకుంటారు. రోగులపాలిట కల్పతరువు శైలేంద్ర.

రోగుల సేవలో యెక్కువసమయం గడుపుతున్న శైలేంద్ర కాలగమనం కూడ గుర్తించుటలేదు. రోజులు దొర్లిపోతున్నవి. ఆ వూరివా రందరి ఆదరణ పొందిన శైలేంద్రను చుట్టుప్రక్కల ఊరి వ్యక్తులు కూడ గౌరవించసాగారు. శైలేంద్ర మందులకంటే అతని అమృత వాక్కులు కొంత బాధను చల్లార్చి మనశ్శాంతిని కలిగిస్తాయని కొందరి అభిప్రాయం. స్త్రీ పురుష తారతమ్యం, హోదా అంతస్తులను చూడక యెవరినైనా సమదృష్టిలో చూడగల వ్యక్తి.

మానసిక, శారీరక బాధలకు కృంగి కృశించి, జీవితముమీద ఆశను కోల్పోయిన వ్యక్తులకు కూడ తేనె లూరించు

మాటలతో నవోత్సాహము కల్గించి శక్తి నంతా ధారపోసి జీవం ప్రసాదించ గలడు. ఎందరో స్త్రీలకు భర్తలను, పురుషులకు గృహిణులను, మాతృ మూర్తులకు బిడ్డలను దక్కించిన ఫలం పొందిన పుణ్యపురుషుడు.

ఒకరోజు మధ్య వయస్సులైన ఇద్దరు దంపతులు ఒక కన్యను తీసుకొని వచ్చి తమ బిడ్డను రక్షించి, ప్రాణం పోసి పుణ్యం కట్టుకోమని శైలేంద్రను ప్రార్థించారు. స్పృహ తప్పి వున్న ఆ స్త్రీని లోపలికి తీసి కెళ్ళి తాత్కాలికోప శమనమునకై కొన్ని మందులు వేసి ఆమెను యెలాగైనా బ్రతికిస్తా నని వాగ్దానం చేసి పంపించాడు శైలేంద్ర. ఆ స్త్రీ పేరు మాలతి. తరచూ హిస్టీరియా మాదిరి వస్తున్న దని ఆమె తల్లిదండ్రులు చెప్పగా తెలుసుకొన్నాడు. అదీ ఒక వారం రోజులనుండి అలా వస్తున్న దని వారు చెప్పారు. మానసిక సంఘర్షణ కారణంగా ఆమె ఆరోగ్యం దెబ్బతిన్న దని శైలేంద్ర ఊహించాడు. ఆరో జంతా తెలివి వచ్చేందుకై మందులు, ఇంజక్షన్లు వాడుతూనే వున్నాడు.

"వద్దు రాధా, వద్దు. నన్ను అపార్థం చేసుకోవద్దు. నేను యే తప్పూ చేయలేదు. దయచేసి నన్ను అర్థం చేసుకో." మందు కలుపుతున్న శైలేంద్ర ఆమె కలవరి స్తున్న దని గ్రహించి దగ్గరకు వెళ్ళాడు. "భగవాన్! నన్ను నమ్ము రాధా! నేను నీ కే అపకారము చేయలేదు. అనుక్షణము నీ శ్రేయస్సు కోరే నేను, నీ జీవితాన్ని నాశనం చేస్తానా? ఎందుకు రాధా! నీ మాటలతో నన్ను బాధిస్తావు? భగవాన్! ఈ మాటలు భరించలేను" తిరిగి కలవ రించింది మాలతి.

మందు త్రాగించిన శైలేంద్ర ఆమెకు తెలివి రావటం గమనించి యేమైన చెప్తుం దేమో నని సమీపానికి వెళ్లాడు.

"ఏమిటి నే నెక్కడ వున్నాను? ఎవరు మీరు?" ప్రశ్నించింది శైలేంద్రను.

"ఫరవాలేదు. మీరు హాస్పిటలులో వున్నారు. మీకు తప్పక నయమవుతుంది. మీ అమ్మా నాన్నలను పిలువమంటారా?" అన్నాడు శైలేంద్ర.

"వద్దు డాక్టర్, వద్దు. నేను జీవించ కూడదు. దయచేసి నన్ను మరణించ నివ్వండి. నావంటి నిర్భాగ్యులు బ్రతికే కన్నా చనిపోతేనే సుఖపడతారు. మీకు పుణ్య ముంటుంది. నన్ను బ్రతికించ కండి" దుఃఖస్వరముతో అంది మాలతి.

"బాధపడకండి. మీరు యెందుకు మరణించా లనుకుంటున్నారు? ఇంత చిరుతవయసులో మిమ్మల్ని వేధిస్తున్న సమస్య లేమిటి? చెప్పండి మాలతీ! నాకు చేతనై నంతవరకు సాయపడతాను" అనునయంగా అడిగాడు శైలేంద్ర.

"వద్దు డాక్టర్. దయచేసి నన్నేమీ అడగవద్దు. జీవించా లని ఆశలేదు. నా ప్రాణమైన వ్యక్తుల సుఖాన్ని నాశనం

చేశా నన్ను నిందతో జీవించలేను. నన్ను మరణించ నివ్వండి" తిరిగి స్పృహ కోల్పోయింది.

రెండు రోజులు గడచిపోయాయి. మాలతి ఆరోగ్యం కొద్దిగ నయ మనిపించింది. డాక్టర్ శైలేంద్ర సహనాన్ని చూపి, ఓర్పుతో తనను చూస్తున్న విధానానికి ఆశ్చర్య పడింది మాలతి. అతనంటే గౌరవం యేర్పడింది.

"క్షమించండి. శారీరక బాధలను తీర్చగల డాక్టర్నే కాని, మానసిక బాధలు తొలగించగల వ్యక్తిని కాను. ఐనప్పటికీ యెందువలననో మీ హృదయా వేదన తెలుసుకోవాలని వుంది. అన్యథా భావించక చెపితే సంతోషిస్తాను" అన్నాడు శైలేంద్ర.

శైలేంద్ర మీద యేర్పడిన గౌరవము వలన, తన మనస్సులో బాధ అర్థం

చేసుకోగల సహృదయుడని భావించి కొన్ని క్షణాలు ఆగిన తరువాత చెప్పటం ప్రారంభించింది మాలతి.

"నేనూ, రాధ అనే మరొక అమ్మాయీ స్కూల్ ఫైనల్ వరకు కలసి చదువుకున్నాము. మా మధ్య స్నేహలత దిన దినము మరింత పటిష్ఠముగ అల్లుకో పోగింది. రాధంటే నాకు ప్రాణం. అలాగే రాధకూడ నేనంటే అంతులేని అభిమానం చూపుతూ వుండేది. అమ్మా నాన్నలకు నేను ఒక్కగా నొక్క ఆడ పిల్లను కావటమువలన పై చదువులకు పంపిస్తే వంటరిగ వుండవలసి వస్తుం దని నన్ను మాన్పించారు. తరువాత సంవత్సరానికల్లా రాధపెండ్లి జరిగి పోయింది. అతనిపేరు సుధాకర్. రాధకు బావ వరుస అవుతాడు. రాధంటే తగని ప్రేమ. కావాలని రాధను చేసుకున్నాడు. తన వివాహ కారణముగ మా స్నేహం ఆగిపోలేదు. ఉత్తర ప్రత్యుత్తరాలు సాగుతుండేవి. రాధ వ్రాసే ప్రతి ఉత్తరములోను 'మా శ్రీవారూ, నేనూ నిన్నెప్పుడూ ఆహ్వానిస్తూనే వున్నాము. నీవు మా యింటికి వచ్చే అదృష్ట మెప్పుడు? అన్నట్లు, ఆయన నిన్నెప్పుడూ అభినందిస్తూ వుంటారు. నీ ఉత్తరాలు బలే చమత్కారముగ, గంగా ప్రవాహము వలె వుంటాయట' అని వ్రాస్తుండేది. ఆమెను నిరాశపర్చటం యిష్టంలేక ఒకటి రెండు సార్లు వెళ్ళి ఒకరోజు మాత్రం వుండి వచ్చేశాను. 'వేసవికాలం హైదరాబాదులో హాయిగా గడుపుదువు గాని. ప్రతిసారిలా కాక ఈసారి ఇరవై రోజులైనా వుండనిదే వూరుకోను తప్పక వస్తావనే ఆశిస్తాను' అని వ్రాస్తూ మరీ మరీ రమ్మని కోరింది.

"రాధంటే మా అమ్మా, నాన్నా కూడ అభిమానం చూపేవారు. అంతేకాకుండా మా రెండు కుటుంబాలమధ్య తరుచూ రాకపోకలు జరుగుతుండేవి. అందు వలన నన్ను రాధ రమ్మని వ్రాసిందని చెప్పగానే పంపించేందుకు అంగీక రించారు. చిన్నప్పటినుండి అల్లారు ముద్దుగ పెంచిన అమ్మా నాన్నా నా యిష్టాన్ని యెన్నడూ కాదనరు. ఈసారి ఆ దంపతులతో యెక్కువ రోజులు సంతోషముగ గడపాలని హైదరాబాద్ బయలుదేరాను.

"నన్ను చూసి రాధా, సుధాకర్ చాల ఆనందించారు. ప్రతిరోజూ సాయంత్రం సుధాకర్ ఆఫీసునుండి వచ్చిన తరువాత తప్పనిసరిగ షికారుకై వెళ్ళేవాళ్ళము. సుధాకర్ చాల కలుపుకోలు మనిషి. నిష్కల్మషముగ మాట్లాడే వ్యక్తే కాని, తన మాటలు మరొక విధముగ అర్థం చేసుకుంటారని తెలియదు. నాతో సుధాకర్ చాల చనువుగ మాటాడేవారు ముభావముగ వున్న వ్యక్తులనుకూడ నవ్వించి మాట్లాడించగలరు.

"ఈర్ష్యాద్వేషాలు యెప్పుడో ఒక

ప్పుడు కొందరుస్త్రీలలో కలుగుతాయి. ప్రశాంతముగ సాగిపోతున్న జీవననౌకను ప్రయ్యలు చేసి. అనురాగాలు చిందుతున్న సంసార జీవితములో విషబిందువులు కలిపి, స్వర్గతుల్యమైన జీవితాన్ని నరకం చేయగల శక్తి 'అసూయ'కు వుంది. ఆ అసూయ వ్యక్తులను అపార్థం చేసుకోవట ములో కలుగవచ్చు. లేదా స్వతహా ఆ వ్యక్తులందు వుండి వుండవచ్చు. ఏది యేమైనా ప్రశాంత జీవితంలో అశాంతి కలిగించగల శక్తి దాని కుంది.

"మొదటినుండి సుధాకర్ విచిత్రమైన వ్యక్తి అన్న భావన నాలో వుండేది. నేను వెళ్ళిన తరువాత కొన్ని రోజులు సంతో షముగ దొర్లి పోయాయి.

"కాని నా దురదృష్టం. నన్ను నా ప్రాణస్నేహితురాలే అపార్థం చేసు కున్నది. స్వయముగ నేను కాఫీ కలిపిన రోజు 'ఓహో! మాలతి కలిపిందా కాఫీ! అందుకే యింత రుచిగావుంది. మా రాధ కాఫీతయారుచేస్తే యెప్పుడు హోటలుకు పోదామా అనిపిస్తుంది.' సుధాకర్ హాస్యానికి అంటే రాధ కోపముగ వెళ్ళి పోయింది. నేను నవ్వి వూరుకున్నాను. అంతటి చిన్న విషయాలు కూడ రాధ సీరియస్‌గా తీసుకుంటుం దనుకోలేదు. ప్రతిరోజు యిలాగే సుధాకర్ చిలిపిగ యేదో ఒకటి అంటూ వుండేవాడు. రాధను నొప్పించాలన్న దురుద్దేశం మాత్రం కాదు. ప్రతిచిన్న విషయానికి నన్ను ఘనముగ పొగిడి ఆకాశాని కెత్తి వేయటం అతని అలవాటు. అటువంటి సమయములో రాధ చిరాకుగ వుండటం నేను గమనించాను. ఈ విధముగ ప్రతి రోజు తన హాస్యప్రసంగాలతో రాధకు కోపం తెప్పించేవాడు. రాధ అపార్థం చేసుకుంటుం దని భావిస్తే అలామాట్లాడ డనుకుంటాను.

"ఒకరోజు గోల్కొండ వెళ్ళాము. నా కాలికి యెదురుదెబ్బ తగిలితే, సుధాకర్ వెంటనే తన రుమాలు గాయానికి కట్టి 'ఏమిటి రాధా ? అలా చూస్తావు ? మాలతికి అలసటగా వుంది వుంటుంది ప్లాస్కులో కాఫీ పోసివ్వరాదూ ?' అని అడిగాడు. 'కష్టపడి కట్టుకట్టినవారు కాఫీ యివ్వలేరా? ఐనా నా స్నేహితురాలు మీకు ఎక్కువై పోయింది' దురుసుగ అంది రాధ. అప్పట్లో తన మాటలలోని గూఢార్థం గ్రహించలేక పోయాను. మరొకరోజు సినిమాకు వెళ్ళాము. క్రొత్త పిక్చరు కావటం వలన జనం అధిక ముగ వున్నారు. సుధాకర్ ప్రక్క రాధ తరువాత నేను కూర్చున్నాము. నా ప్రక్క కుర్చీలలో యెవరో అల్లరి విద్యార్థులు కూర్చుండుట వలన తన యెడమప్రక్క కుర్చీ ఖాళీగావుం దని అక్కడ కూర్చోమన్నాడు సుధాకర్.

"ప్రక్కవాళ్ళ అల్లరి భరించలేక అక్కడకు వెళ్ళి కూర్చున్నాను. 'మీ ప్రక్క కూర్చుంటే ఫరవాలేదు కాని

అక్కడ కూర్చుంటె యేమౌతుంది?' అంది సుధాకర్‌తో రాధ. ఆ మాటలు వెక్కిరిస్తున్నట్లుగ వున్నాయి.

"రోజురోజుకీ రాధ నాపై చిరాకు ప్రదర్శించడం గమనించాను. ఒక విషయాన్ని నేను గ్రహించ గలిగాను. 'మనుషులు దూరముగ వున్నంత వరకే మమతలు పెరుగుతాయి' ఒకనాడు 'ఏమిటి రాధా? యెందుకింత కోపముగ వుంటున్నావు? నేనేమైన తప్పు చేశానా?' నెమ్మదిగ అడిగాను

"ఏమీ తెలియనట్లు అడుగుతావే మాలతీ? ఏనాడూ నిన్ను చిన్నబుచ్చే టందుకు నేను కుందనై పోయాను. నా స్నేహితురాలిగా నీకు ఆతిధ్యమిచ్చాను. నా సంసారంలో నువ్వు తొలగిస్తా వని అనుకోలేదు. నేను యెంతన్నా పేరాశ నా పట్ల ప్రేమకు మారింది నా టానికీ నీ మనసు నిలువదు. నాలోని అశాంతికి కారణం యెవరో తెలుస్తుంది.' రాధ అంత తీవ్రమైన జవాబు యిస్తుందనుకో లేదు. ఆ జవాబుతో నా మనస్సు విలవిలమై పోయింది. ఇక అక్కడ వుండలేక పోయాను. మరునాటి రోజున తిరిగి మా వూరు వచ్చేశాను. 'అప్పుడే వెళ్ళాలా?' అన్న సుధాకర్‌కు ఇంటిమీద బెంగగా వుంది అన్నసాకు చెప్పి తప్పించు కున్నాను. ఇక్కడకు వచ్చిన తరువాత రాధకు ఉత్తరం వ్రాశాను. ఎవరు సుఖ పడాలని కోరుకున్నానో వారి సుఖం నావలన దూరమైన దని విన్నప్పుడు నా మనస్సులో కలిగిన సంచలనము అంతు లేనిది. తరచూ నాకు ఫిట్స్‌మాదిరి వచ్చి పడిపోతానట. చివరకు మీ గురించి విని ఇక్కడకు తీసుకొని వచ్చా రనుకుంటాను అమ్మా నాన్నా.

"నిజంగా నాకేమీ తెలియదు. అన్నా చెల్లెళ్ళూ, అక్కలూ యెవ్వరూ లేని నేను సుధాకర్‌ను అన్నగానే భావించాను. అంతేకాని నాలో యే విధమైన నీచ భావాలూ లేవు. డాక్టర్! ఇందులో నా తప్పు వున్న దంటారా? నేను చేయని నేరానికి శిక్ష అనుభవించాలా?" బాధగా అన్నది మాలతి.

"నేను మాలతీ! మీ మనసు మంచిదై నప్పుడు బాధపడటం దేనికి? నిజం నిప్పులాంటిది. రాధ తన పొరపాటు గ్రహించకపోదు." శైలేంద్ర ఓదారు స్తుండగనే మాలతి తల్లిదండ్రులతో రాధా సుధాకర్‌లు వచ్చారు హడావిడిగ

"చెప్పు మాలతీ! అపార్థం చేసు కోవటం మానవసహజం. నిజాన్ని నిరూపించాలి కాని చచ్చి సాధిస్తావా?" అని సుధాకర్ అడుగుతుంటే "నన్ను క్షమించు మాలతీ! గాఢంగా ప్రేమించిన ఆయన నన్ను చులకనచేయటం సహించ లేకపోయాను. వారి ప్రేమకు దూరమవు తున్నాననే బాధతో నిన్ను నిందించాను. హాస్యానికి అంటున్నారేమోనని గ్రహించకూడా స్త్రీ సహజమైన ఈర్ష్యను

క్షమాపణ అందుకొంటాను. లేకపోతే పరో లోకములో నైనా నీ క్షమార్పణకై యెదురుచూస్తాను. అన్నయ్యను అపార్థం చేసుకొనక నీ జీవితం ప్రేమపూరితం చేసుకోమని ప్రార్థిస్తూ

నీ 'మాలతి'

నిష్కళంకిని యైన మాలతి హృదయాన్ని మనసులోనే అభినందించాడు శైలేంద్ర.

కొలది రోజులలో, రాధ క్షమార్పణ అందుకున్న తృప్తితో మాలతి సంపూర్ణ ఆరోగ్యవంతురాలు కాగలిగినది.

*    *    *

తరువాత కొన్ని రోజులకు సుధాకర్ శైలేంద్రవద్దకు వచ్చి "డాక్టర్! సూటిగా చెప్తున్నందుకు అన్యథా భావించకండి. మాలతికి మీ పైన అంతులేని గౌరవం. ఆమె మాటలవలన మిమ్మల్ని అభిమానిస్తున్నదని గ్రహించినాను. మీరుకూడ అంగీకరిస్తే వివాహం జరిపించా లని ఆమె తల్లిదండ్రులు నన్ను పంపించారు. మీ అభిప్రాయం తెలిపితే సంతోషిస్తాను" అన్నాడు.

"మాలతి అన్ని విధాలా యోగ్యవతి యైన స్త్రీ. ఆమెను చేసుకునేందుకు నా కభ్యంతరం లేదు. కాని ముందు నా చెల్లెలి వివాహం కానిదే నేను చేసుకోను." తన అభిప్రాయం చెప్పాడు శైలేంద్ర.

"మీ నిర్ణయం తెలుసుకున్నాను. మీ చెల్లెలికి కూడ మా బంధువులలో ఒక సంబంధ ముంది. అతను మా పిన్ని కొడుకు. పేరు మాధవ్. ఎమ్. ఏ. పాసై రీసెర్చికి వెళ్ళాడు. మీకు నచ్చితే అన్ని విషయాలూ మాట్లాడుకోవచ్చు. మీ కభ్యంతరం లేకపోతే రెండూ ఒక్కసారే జరుగుతాయి." అని సెలవు తీసుకొని వెళ్ళిపోయాడు సుధాకర్.

రూపలావణ్యాలతో పాటు ఆస్తి, హోదా కలిగిన మాధవ్ శశిని భార్యగా స్వీకరించేందుకు అంగీకరించాడు. శైలేంద్రకూడ మాలతి విషయములో తన నమ్మిక నిలిపి సర్వ్వటముతో పలుపురి పెద్దల సమక్షములో వారి శుభాశీస్సులతో ఆ రెండు శుభకార్యాలూ నిర్విఘ్నముగ జరిగిపోయాయి.

కమలమ్మగారి కోరికపై చంద్రిక, అనురేంద్ర, శశి, మాధవ్, మాలతి, శైలేంద్ర తను వివాహమైన తరువాత ముఖ్యమైన 'దసరా' ఆ యింటిలో సరదాగా గడపాలని నిశ్చయించుకున్నారు. ఆ యింటి అతిథులుగ రాధ, సుధాకర్‌లు ఆహ్వానించబడ్డారు

'అక్కా! అక్కా!' అని మన స్ఫూర్తిగ పిలుస్తూ, కపటమెరుగని హృదయముతో మాట్లాడుతున్న మాలతిని చూసి 'అమృతమూర్తి శైలేంద్రకు తగ్గభార్య' అనుకున్నది చంద్రిక.

"శశీ! యెప్పుడూ నన్ను వేళాకోళం పట్టించేదానివి. అన్నయ్య వచ్చాక బుద్ధి




"సరుకులు పట్టుకొచ్చేప్పుడు పేరుపెట్టి పిలవద్దని ఎన్నిసార్లు చెప్పాను."

మంతురాల వైపోయావు సుమా!" నవ్వుతూ అన్నది చంద్రిక.

అంతవరకు నిశ్శబ్దముగ నున్న శశి "అన్నట్లొదినా! నాకు అల్లుడుగారి నెప్పుడు ప్రసాదిస్తావు?" చిలిపిగ ప్రశ్నించింది చంద్రికను. "నీవు నాకు కోడలి నిస్తావా మరి?" తిరిగి ప్రశ్నించింది చంద్రిక.

"లేదు. లేదు. చంద్రికకు కోడల్ని కాదు, ముందు నాతో ఆడుకునేందుకు అల్లుడి నివ్వాలి చెల్లమ్మ!" శశిని ఉడికించాలని అన్నాడు శైలేంద్ర.

"అలాగే అన్నయ్యా! వెంటనే కూతుర్ని ఇవ్వమని మాలతి వదినకు మనవిచెయ్యి" తకీమని జవాబిచ్చింది శశి. ఈసారి కమలమ్మగారితోపాటు అందరూ బిగ్గరగ నవ్వేశారు. మాలతిని చూసి తృప్తిగ నవ్వుకున్నారు రాధా సుధాకర్లు.

ఆ యింటిలో తిరిగి ఆనందోత్సాహాలు వెల్లివిరిశాయి. ప్రతివ్యక్తి ముఖములో సంతోషాతిశయాలు తొణికిసలాడుతున్నాయి. జీవితములో అంతులేని ఆనందం లభించిననాడు మానవుడు ఆదర్శముగ ఉన్నతపథంలో సంచరించగలడు. అలాగే ఆశించినవి నెరవేరినప్పుడు 'ఆత్మ' సంతృప్తి చెందుతుంది. చిన్నప్పటినుండీ తాను పెంచి పెద్దజేసిన చంద్రిక కోరుకున్నవ్యక్తి అమరేంద్రతో సుఖపడుతున్నందుకు, శశి అనుకూలవంతుడైన భర్తతో సంతోషం పొందుతున్నందుకు, సర్వగుణ శోభితయైన మాలతిని చేపట్టి శైలేంద్ర ఆనందం అనుభవిస్తున్నందుకు కమలమ్మగారి ఆశయం నెరవేరింది. ఎవరి సుఖం కోసం పాటుపడినదో ఆ వ్యక్తు లందరు ఈనాడు సంతోషముగ వున్నందువలన, వారు కలకాలం అలాగే వుండాలని లోక కల్యాణమూర్తియైన భగవంతుని హృదయపూర్వకముగ ప్రార్థించినది కమలమ్మ.




ఓ మామిడి మగువలారా!
　　ఓ కోయిల కొమ్మలారా!
పరిగబూసినా ఏలా?
　　కొసరి కూసినా ఏలా? ఓ॥
మనసులోని గాయాలను
　　మరల కెలికినా ఏలా!
మధువు పేరుతో గుండెల
　　మంట లేపినా ఏలా? ఓ॥
కసాయి యగు మన్మథునికి
　　అసువులు పోసే ఏలా?
అల్లాడెడి యీ విరహిణి
　　అసువులు తీసే ఏలా? ఓ॥
ప్రతి పువ్వొక బాణముగా
　　వచ్చి తాకుచున్నది
నిరంతరము నరాలలో
　　నిప్పు రగులుచున్నది ఓ॥
తుమ్మెద జుమ్మన్నదిలే
　　కమ్మని తల పెవ్వరిదో?
తెమ్మెర రమ్మన్నదిలే
　　తీయని పిలుపెవ్వరిదో? ఓ॥
చలి చలిగా హేమంతము
　　చాల బాధ నింపెనే,
వెచ్చ వెచ్చ వసంతమే
　　వచ్చి మరీ చంపెనే. ఓ॥

# మనసు లేని మనసు

శేఖర్ రైలుస్టేషనుకు వెళ్లాడు. రైలు రావడానికి యింకో గంట విరామం వుంది. గంటవిరామం అంటే ప్లాట్ ఫారం మీద వున్నప్పుడు [illegible] సేపు కాదది.

రైళ్ళు ఆలస్యంగా రావడాన్ని గురించి రెండుక్షణాలు విసుక్కున్నాడు శేఖర్. ఒకరకంగా చూస్తే పూర్వకాలంలోలాగా రైళ్ళు అనేవి లేకపోతే ఆలస్యంగా రావడం అనే బెడద వుండదు. కాని అసలు రైళ్ళే లేకపోతే— యీ విశాల ప్రపంచంలో బ్రతకడం ఎలా సాధ్యం?

ప్లాట్‌ఫారం చిన్నది. చిటికలో ఒక మాటు పచారుచేసి రావచ్చును. ఇలా ఎన్నిసార్లు పచారు చేస్తే గంటగడిచేను? ఇదో రకమయిన శిక్ష. ఇంతకంటే మరేంటుంది.

కనుచీకటి పడుతోంది. స్టేషన్లో గుడ్డిలాంతరు వెలిగిస్తున్నాడు పోర్టరు.

శేఖర్ సిగరెట్టు ముట్టించాడు.

స్టేషన్లోనుంచి ఎస్. ఎస్. బయటకు వచ్చాడు. మెడలో ఉత్తరీయం సవరించుకుంటూ బయలంతా కలయచూశాడు.

'హల్లో శేఖరంగారా? నమస్తే! రైలుకోసం వచ్చారా?'

'నమస్తే. అవునండి. రైలుకోసం.'

రైలుకోసం కాకపోతే, తన గుడ్ల గూబ ముఖం చూడడానికి వచ్చానను కుంటున్నాడా?– అనిపించింది శేఖర్‌కు.

'పంద నిముషాలు లేటు.'

శేఖర్‌కు గట్టిగా ఏట్టూర్చాలనిపిం చింది. కాని ధైర్యం చాలలేదు.

బాగా చీకటి పడిపోయింది.

ఆకాశంలో అక్కడక్కడ నక్షత్రాలు అగుపిస్తున్నాయి.

ఈ చీకట్లో– ఈ స్టేషన్లో ఒంటరిగా తను షికార్లేమిటి– అనుకున్నాడు.

నలుగురయిదుగురు తప్పించి నర సంచారం లేదు. వాళ్ళెవరూ తనకు తెలీదు.

నాలుగయిదు సిగరెట్లు ఒక్క– ఊగిని పీల్చేశాడు. నోరంతా చెగటుగా చేదుగా తయారయింది. పెదిమలు బిగిసి పోయాయి.

శేఖర్ తనలో తను నవ్వుకున్నాడు.

సీత జ్ఞాపకానికి వచ్చింది. ఒక్క జ్ఞాపకమే ఎందుకు? – కాస్త నిదానంగా వుంటే రైలుబండిలో రానేవస్తుంది.

సీతను తలుచుకుంటే శేఖర్‌కు నవ్వు వస్తుంది.

పచ్చిపిల్ల– ఈ పిచ్చిపిల్లకోసం తను స్టేషనుకు రావడం. రైలు ఆలస్యం విసువు. చీకటి.

అన్నీ భరిస్తూ ఆలస్యంరైలుకోసం నిరీక్షణ. రైల్లో వచ్చే సీతకోసం ప్లాట్ ఫారంమీద పచార్లు.

నిజానికి తనకు సీత యేమిటి? ఏమీ కాదు. స్నేహితురాలు. అంతే. కాలేజిలో చదువుకునేప్పుడు పరిచయస్తురాలు.

తనకు అంతే తెలుసు. సీతకు యింకా చాలా తెలుసు – అనిపిస్తుంది, అప్పు డప్పుడూ.

వెన్నెల్లో కూచున్నప్పుడు 'యెప్పుడూ యిలాగే వుండిపోతే ఎంత బాగుంటుంది'– అంటుంది సీత. కాని తనకు భయం, భోజనం, నిద్ర... యివన్నీ ఎట్లా? ఊరికే వెన్నెల్లో కూచుంటే– అదీనీ, యిసుకలో తతిమ్మా పనులన్నీ ఏమయిపోతాయి?

సీత కివన్నీ యేమీ తట్టవు. భోజనం తుచ్ఛమయింటట. ఇక కూచోటం తప్ప తక్కిన వన్నీ తుచ్ఛమయినవట

భోజనం తుచ్ఛమయిన దంటే తను యొక్కనాటికీ నమ్మడు. పోపీతే, చిన్న పిల్లతో గొడవెందు కని ఊరుకుంటాడు

ఇట్లా అనేక సందర్భాలు – తనకు యిదంతా గొప్పకాదు.

ఊరికే రోజులు గడిచిపోతున్నాయి తనకు కావలసింది అంతే.

ఇవాళ సీతనించి టెలిగ్రాం రావడం తోటే, సీతనించి వచ్చిన మొదటి ఉత్తరం చదువుకున్నాడు, వెదికి తీసి. అవే అక్షరాలు – గుండ్రగా, ముత్యాలకుమల్లే.

మాష్టారూ! మీకు ప్రేమలో నమ్మకం లేకపోతే మానె! మనుష్యుల్లోనయినా ఉంది కదా! మిమ్మల్ని నేను అర్థం

చేసుకోలేనని మీకు సందేహం వద్దు. అన్నీ ఆలోచించుకునే నేను ఈ నిశ్చయానికి వచ్చాను. నా నిశ్చయం తారుమారు చేయకండి. చాలు!

—ఈ మాటలు తనకేం అర్థంకావు.

ఈ భాషే తనకు కొత్త. చదివి డ్రాయర్లో పడేశాడు. అర్థం కాని ఉత్తరాలు అంతకంటే యింకేం చేయాలి?

సీత తనకు పరిచయం. ఒకరకంగా ఆ అమ్మాయి తనని ఆకర్షించింది. ఈ ఆకర్షణకు ఏకరకాల అర్థాలు చెప్పుకుంటే – తన కేం తెలీదు.

తను యీ ఊరికి వచ్చేస్తూ వుంటే సీత ఏమన్నది?

'మాష్టారూ: ఊరు దాటిపోతున్నాడు మర్చిపోతారా?'

'మర్చిపోతే ఉత్తరాలు రాస్తూ వుండు' అన్నాడు తను.

'ఉత్తరాలకు జవాబు రాయడం మర్చిపోతారా?'

'మర్చిపోతే గుర్తుచేస్తూ వుండు–'

'గుర్తు చేసినా మర్చిపోతారా?'

ఏమిటో, మెలిక ప్రశ్నలు. ఒక్కటీ తనకు సాఫీగా తోచవు. అర్థంకావు.

అప్పుడు తను అన్నాడు: 'నువ్వే నన్ను మరచి పోతావు, పెళ్ళయ్యాక. అప్పుడు మరచిపోయా నన్న విషయం కూడా మర్చిపోతావు'.

సీత తన ముఖంలోకి విచిత్రంగా చూచింది.

ఆడవాళ్ళు – వాళ్ళ వేది కళ్ళు!– అనుకున్నాడు, తను.

ప్లాట్‌ఫారం గబగబ పరుగెత్తుతున్నట్లయింది.

గణగణ గంట మోగింది.

శేఖర్ మనస్సు ఆలోచనలను విదిలించుకుని ఒకమారు కలయచూచింది.

అమ్మయ్య– అనుకున్నాడు, శేఖర్.

ప్లాట్‌ఫారం మళ్ళీ ఒక్కమారు చుట్టివచ్చాడు.

దూరంగా స్తంభం దగ్గర ఎవరో భోజనం చేస్తున్నారు– పులుసువాసన ఘాటుగా తగుల్తోంది.

ఇంత సేపూ నిద్రపోతున్న ఆకలింకా ఒక్కమారు వెలికి వచ్చింది. ఒక్క అరగంట ఆగాలి. ఆ తర్వాత యింటికి వెళ్ళి హాయిగా భోజనం చేసి వేపచెట్టుగాలికింద మడతమంచం మీద మేను వాల్చవచ్చు: మళ్ళీ అరుణోదయం అయేవరకూ నిద్రపోవచ్చు.

* * *

శేఖర్‌కు మెలకువవచ్చి గడియారం చూసుకునే సరికి ఎనిమిది గంటలైంది.

కిటికీలోంచి ఎండ గదిలోకి వస్తోంది. బాగా ముదిరిపోయింది ఎండ.

రెండుమూడు క్షణాలు కళ్ళు మూసుకుని పక్కమీదనే కూర్చున్నాడు. ఈ కొద్ది సేపట్లో అతని మనస్సు ఖాళీగా వుంది. నిరామయంగా మనస్సును విశ్రాంతిగా వుంచడం అతను కొన్ని

సంవత్సరాల నుంచీ అలవాటు చేసు
కున్నాడు. తర్వాత లేచి నిలుచున్నాడు.

హాయిగా ముఖం కడుక్కుని స్నానం
చేయవచ్చు— అనుకున్నాడు.

స్నానంచేసి, ఫ్లాస్కులో వున్న
వేడివేడి కాఫీ తాగాడు.

తొమ్మిది గంటలయింది.

తన కింకా గంటన్నర టైం వుంది.

భోజనం చేయడం, బడికి వెళ్ళడం
యివే పనులు. సాయంత్రందాకా ఎలా
గడుస్తుందని కాలం, అన్నేళ్ళే లేదు.

ప్రపంచంలో యిసవంటి అదృష్ట
వంతులు ఎందరో వుండరు.

ఏమిటో, రోజులు సజావుగా యే
బాదరబందీ లేకుండా దొర్లిపోతున్నాయి.
గడుసుతనం లేకుండా నింపాదిగా సరసంగా
దొర్లిపోతోంది కాలం. ఇంత కంటే
కోరుకోవలసింది యేముంది?

ఆలోచించుకుంటూ వుంటే కళ్ళు
బరువుగా మూగుతున్నాయి. కళ్ళు నిజం
గానే బరువు. ఎందుచేత? రాత్రి నిద్ర
లేక.

రాత్రంతా— జాగారం.

సీతకోసం స్టేషన్‌కు వెళ్ళడం...
గుర్తు వచ్చింది.

రాత్రి రైల్లో సీతని తను చూశాడు.

ఓ పెట్టెలోనుంచి సీత కేకవేసింది.
రైలు రెండు నిముషాలకంటే ఆగదు.

అంతా జరిగి ఎన్నాళ్ళయింది?—
ఒక శతాబ్దం అయినట్టుంది, అనిపించింది
ముందు.

కాదు రాత్రే బల్లమీద టెలిగ్రాం
సాక్ష్యం. ఇంకా ఇరవైనాలుగు గంట
లయినా కాలేదు.

సీత ఏం చెప్పింది? ఏమిటో గొడ
వగా చెప్పింది.

విషయం అర్థం తెలుసు కోవటాని
కయినా విరామం ఎక్కడుంది? దూరికే
ఉత్తరువులా వినమ్రుడై విన్నాడు తను

సీత యిదివరకు లాగానే వుంది.
తనను చూడగానే నవ్వింది.

'ఏం మాష్టారూ! కులాసాగా
వున్నారా?'

'ఆ! నువ్వు?'

'కనపట్టంలా?' అంది.

'మీకు నిన్ననే ఉత్తరం రాశాను
రేపు టపాలో మీకు అందుతుంది; సావ
కాశంగా చూసుకోండి. ఇంతకీ— నేను
వెళ్ళిపోతున్నాను. మళ్ళీ మనం ఒకరి
కొకరం చూసుకుంటామో లేదో. అందు
కనే రైలుకు రమ్మన్నాను—' అంది.

ఇంతలో యింజను కూత.

ముందుకు నడక.

సీత కిటికీలోనుంచి తల ముందుకు
పెట్టి కుడిచెయ్యి ఊపుతోంది.

తనూ చేయి పైకెత్తాడు.

ఒక్క నిముషం.

సీత మాయమయింది.

ప్లాట్‌ఫారం ఖాళీగా వుంది; తను యింటికి వెళ్ళిపోయాడు.

ఇవాళ టపాలో ఉత్తరం వస్తుందిట. ఆ సంగతి చెప్పడానికే తనని పిలిచింది— యింత హడావుడిగా! పిచ్చిపిల్ల!

ఉత్తరం వస్తుందికదా, ఫరవాలేదు. వెంటనే జవాబు వ్రాసి పడేయాలి.

వ్రాసిపడేస్తే మళ్ళీ ఉత్తరం వచ్చేవరకు యిబ్బంది వుండదు. తన కేమీ బాదరబందీ వుండదు.

శేఖర్ బయలుదేరాడు. అద్దంలో ముఖం బాగానే వుంది.

హోటల్లో నాలుగు మెతుకులు కొరికాడు.

హెడ్‌మాష్టర్ నశ్యం పీలుస్తూ తన వంక విచిత్రంగా చూచాడు.

'గుడ్ మార్నింగ్' అంటూ పుస్తకంలో సంతకం చేశాడు.

వెనక్కి వెళ్ళిపోతూంటే జవాను 'సార్—సార్...' అంటూ పిలుపు.

'మీకో ఉత్తరం సార్.' అందించాడు.

చిరునామా తనదే. కోటు జేబులో వేసుకున్నాడు, వెంటనే క్లాసు.

పిల్లలకు రెండు పీరీడ్లు పాఠం చెప్పడంతో సరిపోయింది.

మూడో అవర్లో విరామం.

హాయిగా కుర్చీలో మేను వాల్చి ఉత్తరం తీశాడు.

సీతరాసినఉత్తరమే. సందేహంలేదు.

అబ్బ యిన్ని పేజీల ఉత్తరం. ఎంత ఓపిగ్గా రాసింది! చదవడానికి ఓపిక కావాలి.

పదహారు పేజీలు.

సీత రాసిన వుత్తరం: చదవకపోతే ఎట్లా?

ఏమిటో గొడవ, అర్థంకాదు. అసలు ఉత్తరాలు రాసే భాష అంటూ ఒకటుందేమో! ఆ భాష తనకు రాదేమో! ముఖ్యంగా సీత రాసే వుత్తరాలు తనకు అర్థంకావు. ఏవో గందరగోళంగా వుంటాయి. అయినా తప్పదుగా. ఓపిగ్గా చదువుకుపోతున్నాడు. మనస్సుకు ఎక్కడంలేదు. అక్కడక్కడా కొంత సులభంగా వుంది.

పేజీలు తిరగేశాడు. ఉత్తరం అయిపోయింది శేఖర్‌కు అర్థం కాలేదు.

"ఇన్ని పేజీలలోనూ తనకోసం, తనకు అర్థం కావడంకోసం ఒక్క ముక్కయినా లేదా?'

మళ్లా మొదలెట్టాడు. మధ్య మధ్య బాగా కనిపిస్తున్న ముక్కలు బిగ్గరగా చదువుకోసాగాడు.

'మీరు మారతారేమో నని చాలా కాలం చూచాను. నా శ్రమంతా వృథా అయింది. మీరు నాకు అర్థంకారు; నన్ను మీరు అర్థం చేసుకోలేరు...

'నా కెన్నో ఆశలు; అవన్నీ మీరు తీరుస్తారని— నన్ను సరిగ్గా చెప్ప




అక్కడ దయ్యం ఉండేది. అందుకని ఆ ఇల్లు పాడుపెట్టారు. ఆ ఇంట్లో రాధతల్లి చనిపోయింది. రాధతల్లి దయ్యమయిందని అందరికీ తెలుసును. కాని, అంత మహా ఇల్లాలును దయ్యమనటానికెవరికీ నోరు రాలేదు.

రాధకు దయ్యమంటే భయమే. ఆ ఇల్లంటేనూ భయమే. ఆ ఇంట్లో ఉన్న దయ్యం పొరుగింటి మహాలక్ష్మమ్మకు పట్టినప్పుడు మహాలక్ష్మమ్మను చూసి రాధ భయపడి, ఒకరోజల్లా కన్ను మూసి ఎరగదు.

కాని, ఆ ఇంట్లోనే ఉంది అమ్మ. "అమ్మేదే" అని తను యేడ్చినప్పుడు, "ఆ ఇంట్లో ఉందమ్మా?" అని అమ్మమ్మ చెప్పలా? అయితే ఆ యింట్లోనే దయ్యం ఉందికదా! అమ్మకు భయం కాదూ? అన్నట్టు అమ్మకు భయంలేదు. తనకు చీకట్లో పోవటానికి భయం వేస్తే అమ్మ తోడు వచ్చేది కాదూ!

రాధకు ఒక్కసారి అమ్మను చూడా లనిపించింది. ఎవరన్నా చూస్తే కోప్పడతారు. అందుకని రాధ ఒకనాడు, ఒక రాత్రివేళ అమ్మ ఉన్న యింటికి—దయ్యం ఉన్న యింటికి బయలుదేరింది.

బిక్కు బిక్కు మనే ఆ ఇంట్లో అడుగు పెట్టినప్పుడు రాధకు భయం వెయ్యలేదు.

"అమ్మా!" అని పిలిచింది.

జవాబు రాకపోవటం చూసి, "నువ్వు లోపల లేవుటే అమ్మా!" అన్నది రాధ, అనుమానంతో.

"నా కోసం వచ్చావుటే, నా తల్లీ?" అన్నది రాధ.

"నీకోసం వచ్చానే!" అన్నది రాధ.

"నేను నీ కోసం కనిపెట్టుకున్నానే!" అన్నది రాధ.

*కొడవటిగంటి కుటుంబరావు*



"ఈనాట్కి జెట్‌లు వొచ్చినయ్‌గాని, ఏనాటినుంచో యీ దేశంలో మా జెట్‌కాలు ఉండాయ్ సార్!"

---

"ఇన్నిరోజులు నాకు కనిప్లేదేమే, అమ్మా?" అన్నది రాధ.

"నేను నీకోసం ఇక్కడే ఉన్నానే" అన్నది రాధ.

"నేను నీ దగ్గిర పడుకోవద్దుటే, అమ్మా?" అన్నది రాధ.

"నిన్ను నిద్రపుచ్చుతాను రావే, తల్లీ" అన్నది రాధ.

మర్నాడు రాధకోసం అందరూ వెతికారు. ఆ వయ్యాల కొంపలో కటిక నేలమీద, ఆ దుమ్ములో బోర్లా పడుకుని గాఢనిద్రలో కనిపించింది రాధ.

రాధను లేపి వాళ్ళవాళ్ళు, అక్కణ్ణించి తీసుకపోయినారు.

"నే నమ్మదగ్గిర పడుకున్నానే? నే నమ్మదగ్గిరే ఉంటానే!" అని మూడేళ్ళ రాధ పెనుగులాడింది.

"అయ్యో, ఇంకేమమ్మే! మీ అమ్మ చచ్చిపోయి దయ్యమయిందే!" అన్నారు రాధ బంధువులు.

రాధ అకారణంగా ఏడవటం మొదలు పెట్టింది. ఏం చేసినా ఆ ఏడుపు పోలేదు. అందర్నీ కొట్టడం మొదలు పెట్టింది. ఎవరో మల్లే మాట్లాడటం మొదలు పెట్టింది.

రాధకు దయ్యం పట్టిందన్నారు. విభూది పెట్టించారు. ముగ్గులు వేయించారు. రాధ పోరు మానలేదు. తనకు పట్టిన దయ్యానికి వచ్చినవాళ్ళమీదా, తన తల్లిని దయ్యమన్న వాళ్ళమీదా రాధ నిప్పులు కక్కేది; పళ్ళు పటపటా కొరికేది; ఏది దొరికితే అది వాళ్ళమీద గిరాటు వేసేది.

వారంరోజుల్లో రాధ చిక్కి శల్యమయి మంచం పట్టింది. రాధగొంతు వెలుగు రాపకుపోయింది. హీనస్వరం పడ్డది. రాధ మంచినీళ్ళుకూడా మానేసింది.

మరో నాలుగయిదు రోజులకు రాధ అంతరించింది.

రాధను తల్లి దయ్యమై పట్టి తీసుకుపోయిందని అంతా అనుకున్నారు.

వనితాపుస్తకం పక్కన
తనువంతా పచ్చడి పచ్చడి...



చూపు లో చూపు

# చక్రనేమి

## కోడూరి కౌసల్యాదేవి

జరిగిన కథ

*[ఇంగ్లీషు లెక్చరర్ చక్రపాణీ, సెనేటుసభ్యుడు అనంతయ్య కూతురు మాధవీ ఇద్దరూ గురువూ శిష్యురాలూ సంబంధం అధిగమించి ప్రేమానుబంధంలో పడిన గుర్తుగా ఉంగరాల మార్పిడిదాకా తెచ్చింది వారి తిరుపతి యాత్ర. తిరుపతినుంచి తిరిగివచ్చిన మాధవి తోటివిద్యార్థుల కోరికపై కాలేజిదేనాటి వినోదప్రదర్శనకార్యక్రమంలో పాల్గొనటాని కంగీకరిస్తుంది*

*మాధవి మేనమామ శ్యాం సల్పిన దుష్ప్రవర్తనల ఫలితంగా అనంతయ్య భార్యఆదిలక్ష్మితో ఘర్షణపెట్టుకుని శ్యాంను ఇంటినుండి వెడలనడుపుతాడు చక్రపాణికి జరిగిన ప్రమాదానికి కారణం శ్యాం అని కూడా తెలిసిపోతుంది అందరికీ.*

*అనంతయ్య పనుపున కేశవరావు పాణిని పిలిపించి తమ మధువనానికి తీసుకునివెళ్ళి తమ ఐశ్వర్యాన్ని గురించీ, మాధవి పుట్టుకనుంచీ తమకు కలిసి వచ్చిన అదృష్టాన్ని గురించీ స్పష్టంగా చెప్తాడు.]* — ఇక చదవండి

చక్రపాణి భోజనం చేస్తూండగా జానకమ్మ అడిగింది. "బియ్యంబస్తా ఎంత? ఇలా ఒక్కసారి కొనుక్కుంటే ఆటివస్తాయి. బియ్యంకూడా సన్నగా బాగున్నాయి."

"కొనలేదమ్మా" అంటూ సంగతంతా చెప్పాడు పాణి.

అంతా విన్న జానకమ్మ "ఆ అనంతయ్యగారు మంచివాడు గనుక సరిపోయింది ఏదో ఒక రూపంగా ప్రతిఫలం ఇచ్చుకున్నారు. అయినా నీ కింత తెలివితక్కువేమిటి? ప్రైవేట్లు చెప్పుకుని వేలువేలు గడిస్తూన్నవా ళ్ళెందరు లేరు?"



ఆమెతో వాదించి లాభం లేదనుకున్నాడు పాణి. "నీ కంతే తెల్సిందిలే" అని సంభాషణ త్రుంచేశాడు.

భోజనానంతరం శయ్యపై జేరిన అతడికి నిద్రపట్టలేదు. చూచిన వింతలు, వినిన విశేషాలూ పదేపదే కనులముందు నిలుస్తున్నాయి. చెవులలో రింగుమంటున్నాయి. 'ఆహా! అనంతయ్యగారి అంతరంగం ఇదా? అందుకా ఈ అతిమర్యాదలు!' అని అతి అచ్చెరువందాడు.

'పెండ్లికొడుకు శ్యాంసుందర్ ఇంట్లోనే ఉన్నాడు — అనుకొని తన ఆలోచన లెప్పుడూ ఆ విధంగా పోలేదు. అందుకే మాధవి అడిగినప్పుడు కూడా వెనుకంజ వేశాడు. కాని అనంతయ్య ఎంత నిండుకుండ! ఎంత జాగ్రత్తగా ప్రయత్నిస్తున్నాడు తనకోసం! ఆహా! ఆ ఏడుకొండలవాడెంత కృపామయుడు! తనను దర్శించి కోరు

కొన్న కోరికను ఇంత జాగ్రత్తగా ఆలించాడా? తన పవిత్ర క్షేత్రంలో చేసుకొన్న నిర్ణయాన్ని ఇంతత్వరలో ఫలవంతం చేయబోతున్నాడా!

'తలంచుకొంటే అనంతయ్యగారు ఆ వైకుంఠంలోని శ్రీనివాసుకినైనా అల్లుడిగా తెచ్చుకోగలరు. మరి ఏమిటి ఆయనకు నాపై ఇంత ప్రత్యేకాభిమానం? నన్ను మించినవాళ్లే లేరా?.. అవును. నా కేం తక్కువ? ఒక్క ధనలోపం మినహా విద్యా వినయ సౌందర్యాలలో వంశ ప్రతిష్ఠలో వారికి అన్నివిధాలా తగినవాడినే. ఇది అహంకారం కాదు— ఆత్మగౌరవం మాత్రమే... ఇంతకూ వారు నన్నూ నారూప గుణాదులనూ కోరి గౌరవిస్తున్నారా లేక తమ ధనాన్ని ఎరగా చూపి తమ హోదాలనూ వైభవాలనూ ప్రదర్శించి నన్ను లొంగదీసుకో జూస్తున్నారా? అవును. అంతే. నన్ను తక్కువవాడిగా భావించి, తమ ఆధిక్యతతో ఆకర్షింపజూస్తున్నారు...లేదు; ఆవిధంగా విఱ్ఱవీగేవారైనట్లైతే ఆ అహంకారంతోనే ఏ మధ్యవర్తులతోనో దర్జాగా అడిగించివుండును. అసలు అటువంటి స్వభావమే అయితే ఇంతకాలం ఆగరు. ఆ శ్యాంసుందర్ కో—లేక అటువంటివాడే మరొకడి కిచ్చేసి ఈ సరికే ఇల్లరికం తెచ్చుకొని వుండును. ఇలా మంచి వ్యక్తి కోసం ఇంత సున్నితమార్గంలో ఇంత జాగ్రత్తగా ప్రయత్నించరు. ధనమదం వున్నవాళ్ళు. వీరికి ఒక్క ధనం విలువే కాదు— వ్యక్తి విలువ, విద్యవిలువ, మర్యాదా మంచితనాల విలువ— అన్నీ తెల్సు. చేయెత్తి నమస్కరింపవలసిన వ్యక్తులు.

'ఇంతకూ ఇది ఇల్లరికమనిపించుకుంటుందా? కాదు. అటువంటి హీనమైనది కాదది. వారి ఇట్లో వుండను. వారి ప్రమేయం వుండదు. మాకోసమై నిర్మింపబడిన ప్రత్యేక మందిరం అది ఎవరిదారి వారిదే, వారి అమ్మాయి విషయంలో వారికి కొన్ని అభిప్రాయాలూ, ఆశయాలూ, నియమాలూ వుండడం సహజం. అందుకు నేను అభిమానపడరాదు... ఇందువల్ల నా వారికి— నా తల్లీ చెల్లెండ్రుకు దూరమౌతానా? ఎలాగ? అవును. ఊళ్ళోనే వుంటాను నిత్యం వారి యోగక్షేమాలు కనుక్కొంటూనే వుంటాను నివాసమైతే మరొకచోటకాని ఇటు వీరిని ఒదులుకోను; అటు వారికీ దాస్యం చేయను ఏది ఏమైనా లక్ష్మీదేవివంటి మాధవిని ఒదులుకోలేను!'

ఆ ఆలోచన రాగానే తిరిగి ఊహాగానాలు మరొక త్రోవ త్రొక్కాయి.

'ఆహాహా! మాధవి! సాక్షాత్తూ ఆ శ్రీలోక సంచారిణి అయిన మాధవీదేవే. ఈ క్షీరసాగర కన్యకోసం ఏనాటినుండి తపస్సు చేస్తున్నానో కదా! పాలకడలి కెరటంలా వుండే ఆ కదలిక. పూరెమ్మ సున్నిత లాస్యంలా వుండే ఆ చిరునగవు.

శిరీష సౌకుమార్యాన్ని మించిన ఆ సుకుమార సున్నితత్వాలు నా కోసమే అవతరించిందా? ఎంత అదృష్టవంతుడను!'

లేచి కిటికీవద్దకు వెళ్ళి నిల్చున్నాడు. అంతా చీకటి అయినా అంత దట్టంగా లేదు. ఫాల్గుణబహుళం గడచిపోయింది. ఇది శుక్లపక్షం. ఇక వెన్నెలలు ప్రారంభం. ఆనాడు విదియ. చంద్రోదయమైనా ఆనాడు చంద్రునికి ఉదయాస్తమయాలు రెండూ ఒకసారే. అందువల్లనే ఎక్కడా జాడలేదు. అయినా కొలదిఆయుః పరిమాణంలోనే అనల్పమైనప్రగతి సాధించినట్టు గటములైన చీకట్లను పారద్రోలినట్లు కన్పించింది వాతావరణం. అక్కడక్కడా ఆ చీకట్లలో మిణుగురుపురుగులు మిలమిలలాడుతూ ఎగురుతున్నాయి. కొద్దిగ చలిగా వున్నట్లు అన్పించి కిటికీరెక్కలు మూసివచ్చాడు. 'ఫాల్గుణమాసపు పగళ్ళు వసంతకాలంలాగే తపతప లాడించినా రాత్రిళ్ళు ఇంకా చలి తగ్గలేదు. బహుశః ఈ సంవత్సరం వర్షం అధికంగా కురియడము వలన కాబోలు!' అనుకుంటూ తిరిగివచ్చి శయ్యాగతుడైనాడు.

వెంటనే బిందుమాధవిరూపం క్షీరసాగర వీచికలా ఒక్కసారి కనులముందు కదులాడింది. మాధవీ తానూ మాధవి మందిరంలో హాయిగా అతిసన్నిహితంగా గడుపుతూన్నట్లు. మధునికుంజపు నీడలలో కేళీవిలాసాలలో మునిగి తేలుతున్నట్టు. మధువనంలో కాలిబాటవెంట— పూలమొక్కలమధ్య— మధుకరి చుట్టూ పరుగులెట్టి ఆడీ పాడుతున్నట్లు, బిందుసాగరంలో జలకేళి జరుపుతున్నట్టు, ఉయ్యాల లూగుతున్నట్లు. పెంపుడుచిలుకలు పలుకరిస్తూన్నట్లు స్వప్నజగత్తులో విహరించసాగాడు. మధువన ద్వారమందలి మధుచక్రాలు తళతళ లాడుతూ అందంగా భ్రమిస్తూన్నట్టు— తన ఊహాసంచయమే ఆ చక్రాకృతి దాల్చి సున్నితంగా పరిభ్రమిస్తూన్నట్లు కలగన్నాడు.

## ౨౦

ఆ దినం నిదుర లేస్తూనే ఇటు చక్రపాణికీ అటు మాధవికీకూడ ఎందుకో ఎంతో ఉల్లాసంగా వుంది. సుదర్శనచక్రాయుధపు టంచుల తళతళలవలె మిలమిల లాడిపోతూంది, ప్రపంచాన్ని చుట్టివేసిన బాలారుణుని బంగరుకాంతి.

మావిరాగం తీస్తూ సావకాశంగా తల దువ్వుకుంటున్న మాధవిని నవ్వుతూ పలకరించింది సరోజిని "ఏమమ్మా అంత సావకాశంగా వున్నావు? కాలేజీ లేదా ఇవ్వాళ?"

"లేదు వదినా. ఇవాళే మా కాలేజీ డే."

"ఓహో!"

"నా ఫ్యాన్సీడ్రెస్ వుండిగా వస్త్రావేమిటి చూడటానికి ?"

"ఎందుకు లెద్దూ."

అలా మాట్లాడుకుంటూండగానే హడావుడిగా రుక్మిణి ప్రవేశించింది.

"ఏమే మాధవీ, త్వరగా రావాలి. ఇవ్వాళ అందరం ముందే ఒకసారి మన మన వేషాలు, నాటకాలు సెక్రెటరీగారిముందు వేసి చూపాలి."

"వచ్చేస్తున్నా; అయిపోయింది."

"ఏమమ్మా రుక్మిణీ, బొత్తిగా రావడం తగ్గించేశావ్ ?" అని నవ్వుతూ పలుకరించింది సరోజిని.

నవ్వింది రుక్మిణి. "ఓ ప్రక్కన చదువూ, ఓ ప్రక్కన అనేక యాక్టివిటీస్ బొత్తిగా తీరడంలేదు వదినా. ఇప్పుడైనా రెండు ముఖ్యవిషయాలు మీతో మాట్లాడాలని వచ్చాను."

"ఏమిటోయ్ అంత ముఖ్య విషయాలు ? మరీ కంట్లోనలుసైపోయావు" అన్నాడు అప్పుడే నిద్రలేచిన కేశవరావు.

"ముఖ్య విషయాలే అన్నయ్యా. మీరు కొంచం నా మాటకు విలువ నిచ్చి వినాలి" అంది రుక్మిణి సీరియస్‌గా.

అక్కడినుండి మెల్లగా జారుకుని గదిప్రక్క వరండాలో ఎవరికీ కన్పించకుండా నిల్చుని జాగ్రత్తగా వినసాగింది మాధవి.

"ఇంట్లోవాళ్ళపైన చెప్తున్నా నని మాత్రం ఏమీ కోపం తెచ్చుకోకూడదు." అంది రుక్మిణి.

"అబ్బ. చెపుదూ త్వరగా. నువ్వేమైనా మాకు క్రొత్తదానవా ?" అంటూ ఆత్రత వ్యక్తపరచింది సరోజిని.

ఒక్క క్షణం ఊరుకుని రుక్మిణి చెప్పింది. "శ్యాంసుందర్ మీ ఇంట్లోనే వుంటూ మీకు చాలా ఘాత తలుస్తున్నాడు."

"అందుకేలే నిన్న వెళ్ళగొట్టేశాం. ఇక వాడిబెడద మనకు లేదు" అన్నాడు కేశవ్

"వెళ్ళిపోయాడా ?" ఆశ్చర్యంగా ప్రశ్నించింది రుక్మిణి.

"ఆ".

"ఎప్పు డన్నయ్యా ? పీడ వదలిపోయిందన్నమాట !" అంటూ చాటుగా నున్న మాధవికూడ మరచిపోయి ఎదుట కొచ్చేసింది.

కేశవ్ సరోజినికూడ నవ్వారు; కాని కారణం చెప్పలేదు బాగుండ దని



"ఇప్పుడు ఆ తెర వెనుకన ఆ అమ్మాయి కాదు—ఆ అమ్మాయి నాన్న ఉంటాడు, ఆ తెర వేపు చూసుకొంటూపోయే వెంగళాయల లిస్టు తయారు చేసుకుంటాడు; మర్నాడే వేట ప్రారంభిస్తాడు — ఇదంతా ఆ అమ్మాయి పెళ్ళి ప్రయత్నం."

---

తిరిగి మాధవే అంది. "అయితే ఇందుకే కాబోలు అమ్మ రాత్రినుంచీ నాతో మాట్లాడటమే లేదు."

అందుకుకూడా ఎవ్వరూ మాట్లాడలేదు.

"వెనక మేష్టారిని కొట్టించినది కరుణాకర మని మన మందరం అపోహపడ్డాం గుర్తుందా? కాదట. నిన్న రూఢిగా తెలిసింది. మీ శ్యాంసుందరమూ, మా కో పనికిమాలిన లెక్చరర్ ఉన్నాడు ముకుందరావని — అతడూనట."

"ఏమిటీ?" ఆశ్చర్యంతో నివ్వెరపోయారు సరోజినీ మాధవీని.

కేశవరావు ఆశ్చర్యపోలేదు. మెల్లగా అన్నాడు. "నీవు చెప్పినదానిలో ముందు సగం నాకూ తెలుసును. కాని ఇదేమిటి? ఆ ముకుందరావు కేమిస్పర్ధ మాష్టారిపై? వాడికీ వాడికీ దోస్తీ ఏమిటి?"

"ఏమో మరి, ఎవరికిమాత్రం తెలుసు? అయితే ఒకటి, ఒక్కలాటి గుణా లున్న వాళ్ళు ఏదోవిధంగా ఒక్కచోటికి పోగౌతారు. వాళ్ళవాళ్ళ వ్యాపకా లేమైనా వాటితో నిమిత్తంలేదు. చెత్తాచెదారం ఏకమైనట్టు చెడుగుణా లున్నవాళ్ళంతా ఒక్కచోటికి జేరుతారు. ఆ ముకుందానికీ మీ శ్యాంకూ చాలా స్నేహమట. ముకుందానికి చాలా ఋస్తుంటాడట శ్యాం."

"అయితే యిదంతా ఒక రౌడీముఠా అన్నమాట!" సాలోచనగా తల పంకించాడు కేశవరావు.

సరోజిని అంది, "ఇటువంటివాళ్ళు ఇంటోనుంచి పోయినంతమాత్రాన సంతోషించక్కర్లేదు. ఇంకా ఏదో ఒక చెడు చేస్తూనే వుంటారు.

"అవును, అది హెచ్చరించటానికే నేను వచ్చాను." అంది రుక్మిణి.

"ఇంతకూ ఇవన్నీ నీకూ తెల్సు?" అడిగాడు కేశవరావు నవ్వుతూనే.

నవ్వి ఊరుకుంది రుక్మిణి.

"వాళ్ళబావ మా కాస్ మేస్ లే, వెంకటేశం అని," అంది మాధవి నవ్వుతూ.

"బావా-భర్తాకూడా" అని సరోజిని హాస్యం చేసింది.

కేశవరావు ఇంకేదో హాస్యపుబాణం విసరబోయాడు. కాని నవ్వుతూన్న రుక్మిణి "ఇక ఆపండి" అంటూ అంతలోనే గంభీరంగా మారిపోయింది. "నేను చెప్పవచ్చిన రెండోవిషయం చెప్పనేలేదు".

రుక్మిణి అలా అంటూండగానే మాధవి మెల్లమెల్లగా వెళ్ళిపోయిం దక్కడి నుంచి.

"ఏమిటది?" అనడిగాడు కేశవరావు. "ఉన్నట్లుండి పెద్ద వ్యవహర్త వయి పోయావే?" అంటూ హాస్యం చేశాడు

"అవ్వకపోతే ఎలాగ. కానీ..." అంటూనే రుక్మిణికూడా నవ్వింది.

"మీ బిందు నన్ను రాయబారం చేయమంది."

"ఏమనో?"

"ఏమనా? ఆవిడ మొన్న చక్రపాణిగారితో తిరుపతి వెళ్ళినప్పుడు ఆయనను గాంధర్వవివాహం చేసుకుందట. ఆపైన యదార్థ వివాహం చేసి మిమ్మల్ని పెళ్ళికం నిలుపుకో మని హెచ్చరించింది."

"నిజమా?" కనుబొమలు చిట్లించాడు కేశవరావు.

"అయ్యో. అట్లా అంటారేం అన్నయ్యా? ఆకాశంలోకి ఎగిరి గంతేస్తా రను కున్నాను?" అంది రుక్మిణి

"సంతోషమే అనుకో. కాని అన్నీ మేము మాట్లాడి నిశ్చయించుకోనిదే దాని కా తొందరేమిటి? ఆ తొందరగుణం పోనిచ్చుకున్నదికాదు."

"అదేమిటి? మీ కోరికకూడ అదేగా?"

"కోరిక అదేకాని దాని కేమైనా స్వతంత్ర ముచ్చామా ఆ విషయంలో? లోకంలో అందరి పెండ్లి ఒకెత్తూ, దాని ఒక్కతె వివాహం ఒక ఎత్తూ నన్న సంగతి మరచి

పోయింది కాబోలు! అందు కింకా ఎన్ని సంప్రతింపు లున్నాయో - ఎన్ని ఒప్పందాలు జరగాలో!..."

"ఇప్పు డైతే నేం? త్వరపడండీ" అంది సరోజిని నవ్వుతూ. "ఏమైనా మీ చెల్లెలు మీ అందరికంటె ఘటికురాలు."

"అసలు మీ ఆడవాళ్లే మహా ఘటికులు." త్రిప్పికొట్టాడు కేశవ్.

"నీలాంటివాళ్ళు నిద్రపోతూంటే మరీ మాలాటివాళ్ళు ఘటికు లవ్వరూ? సరే. నే నొచ్చిన పని అయిపోయింది బాబూ! నా కెందు కిక?" అంటూనే వెనకనుండి కేశవ్ పిలుస్తూన్నా ఆగకుండా పారిపోయింది రుక్మిణి.

"ఏదీ? మాధవి నిలా పిలువు" అన్నాడు కేశవరావు భార్యతో.

"ఎందుకూ? కేకలేస్తారా?"

కేశవ్ మాట్లాడలేదు.

"ముందునించీ విచ్చలవిడిగా త్రిప్పి ఇప్పుడు కేకలేసి లాభ మేమిటి? మామ గారికికూడా చెప్పి ఆ ప్రయత్నా లేవో గట్టిగా చేయండి....మీ నియమాలకు ఆ చక్ర పాణిగారు ఒప్పుకున్నా ఒప్పుకోకపోయినా ఈ వివాహంమాత్రం తప్పదు".

"అయితే నీ కింతా ముందే తెలు సన్నమాట?"

"నిన్న వ్రేలిని క్రొత్త ఉంగరం చూచి అడిగితే అంతా చెప్పింది. ఆయననే కాని వివాహం చేసుకోదట."

"ఊఁ, అంతవరకూ వచ్చిందన్నమాట!"

"అయితే అమ్మ ఏమంటూంది?"

"తమ్ముడు విషయంలోనా? ఏమంటారు? మామూలేగా? ఇంట్లో ఎవ్వరితోనూ మాట్లాడడంలేదు. కంటికి కన్పించేప్పటికి తిట్టేస్తున్నారు, నన్నూ మాధవినీ."

## 31

కళాశాల ఆవరణమంతా ఆహూతులతో కిటకిటలాడ్తూంది. విద్యార్థు లంతా గుంపులు గుంపులుగా జేరి చాలా సరదాగా ఆత్రంగా ఎదురు చూస్తున్నారు కార్యక్రమాల కోసం. రోజూ చాలా కుదురుగా, నమ్రతగా వుండే విద్యార్థినులు కూడా ఇవాళ కొంత స్వేచ్ఛగా ఆనందంగా ప్రవర్తిస్తున్నారు. అవునుమరి! కళాశాల అంతకూ పెద్ద పర్వ దినంవంటిరోజు అది! ఉపన్యాసా లివ్వబోయే వారూ, విద్యలో ఆటపాటలలో వివిధ బహుమతు లందుకొనబోయేవారూ, నాటక నాటికలలో పాల్గొనబోతున్న వారూ, వాలంటీర్లూ, లైసెన్సు పొందినంత ధీమాతో చిత్తం వచ్చినట్లు అల్లరిచేసే

ఇంకా ఆ నవ్వు అణగకముందే కూర లమ్మే మనిషి ప్రవేశించింది. ముదురు నీలంరంగు చీర అస్తవ్యస్తంగా కట్టి, మెళ్ళో ఓ పూసలదండా, ఓ ఇత్తడి గొలుసూ వేసుకుంది. చేతులకు ముదురు ఆకుపచ్చరంగు దుక్కాగాజులు, చెవులకు ఎర్రిరాళ్ళ దుద్దులు, ముక్కున అడ్డబాస, నుదుటివి అర్ధరూపాయంత ముదురు తోపురంగు కుంకుమ బొట్టు, జుట్టంతా రేగి అస్తవ్యస్తంగా వుంది — దానినే కొప్పుగా ముడిచి ఆ కొప్పులో నాలుగుబంతిపూలు కుక్కింది. చంకన ఒక తట్టా, కాళ్ళకు పీమవెండి కడియాలూ, గడ్డంమీద పచ్చాకు బొట్టూ......

"అబ్బ ! ఎవత్తా ఈవిడ ? ఎక్సలెంట్ మేకప్" అంటూ గుసగుసలు ప్రారంభించారు విద్యార్థులు.

"కూరలోయమ్మ కూరలూ.. అఁ : రకరకాలకూరలు ఇటుకరాళ్ళ ఎరువు పోసి, ఆకాశగంగ దెచ్చి అరచేతిలో అల్లారుముద్దుగా పెంచిన పంట బాబూ ఇది..సూడండి బాబూ : చేదు బీరకాయ, ముదు రానపగాయ, కుళ్ళ పొట్లకాయ, పుచ్చు వంకాయ, చచ్చు తలకాయ మీకోసమని ఏరికోరి పట్టుకొచ్చినాను...తింటే జివ్వ లేచిరావాలి. రాజమండ్రి కరేపాకు, గుంటూరు గోంగూరాకు, పాడుచెర్లో తామరాకు, వల్లకాట్లో కుక్కాపుగాకు ఈ స్టూడెంటు కుర్రోళ్ళకు మాంచి పసందుగా వుంటుంది...విందు భోజన మని పట్టుకొచ్చినాను. ఏ ఒక్కాకూర దిన్నా-బాబూ ! జాగర్తగా యినుకోండి, ఈటిలో ఏఒక్కాకూర దిన్నా మళ్ళీ మంచినీ ళ్ళడగరంటే నమ్మండి, సొరగమే కనబడతాది. ఇంక అష్టగ్రహాలు కాదు సరిగదా నవగ్రాహా లేకమైనా మీ కళేబరాల నేమీ జెయ్యలేవు.

ఏం బాబు, అట్ల నవ్వుతారు ? అ అఁ, కుర్రతనాలు, ఎల్తానుమరీ ?

పావుగంటసేపు ఆగకుండా ఊపి ఊపి నవ్వించిం దా వేషం ప్రేక్షకలోకాన్ని. 'వన్స్‌మోర్' కేకలు కూడా విన్పించాయి.

అనంతయ్యకూడ ముగ్ధుడై పోయాడు ఆ నటనకు. 'ఎవరండీ ఆ అమ్మాయి ? చాలాబాగా రక్తికట్టించింది వేషాన్ని, ప్రథమ బహుమతి ఇవ్వవలసిందే' అన్నాడు ప్రక్కనున్న ప్రిన్సిపాల్‌తో.

'నాకూ తెలియదుకాని ఆ అమ్మాయి చాలాబాగానే నటించిందండీ' అన్నాడతడు

అంతలోనే బహుమతీ ప్రదానం ప్రారంభమే అయ్యింది ! ఊళ్ళో జడ్జిగారి భార్యను తీసుకొచ్చారు ఆపని చేయడానికి.

సెక్రటరీ పేర్లు చదువుతున్నాడు. 'ఫ్యాన్సీ డ్రెస్........ప్రథమ బహుమతి

'జె. శ్రీహరి'. కరతాళధ్వనులు మిన్నుముట్టాయి. శ్రీహరి వచ్చి గర్వంగా అందుకున్నాడు బహుమానం.

విద్యార్థినులలో ప్రథమ బహుమతి 'కుమారి బిందుమాధవీకుమారి.' అధ్యక్షులూ, ప్రేక్షకులూ అందరూ ఒక్కసారిగా ఆశ్చర్యపడిపోయారు. అనంతయ్య ముఖంలో ఆనందంతోపాటు ఒక్క గర్వపిచక కూడ లాస్యం చేసింది.

మాధవి చిరునగవు చిందులాడే ముఖంతో వస్తోంది బహుమతి అందుకోవడానికి. ఒకవంక అభినందనపూర్వకమైన హర్షధ్వానాలు, కరతాళధ్వనులు మిన్నుముట్టాయి. అంతలోనే ఒక ప్రక్కనుండి హేళనతో కూడిన పిలికూతలూ, ఇకిలింపులూ; మరొకప్రక్కనుండి 'శ్రీమతి చక్రపాణి, శ్రీమతి చక్రపాణి' అనే కేకలూ వినిపించాయి. ఒక్కసారిగా అభిమాను లందరి వదనాలూ ఉలిక్కిపాటుతో అవమానంతో క్రిందికి వాలిపోయాయి. కరతాళధ్వనులు ఆగిపోయాయి. సంతోషంగా ముందుకు వస్తూన్న మాధవి ఒక్కసారిగా ఉలికిపాటుతో స్థాణువులా నిల్చునిపోయింది క్షణకాలం. మరుక్షణలోనే గిరుక్కున వెనుదిరిగి వెళ్ళిపోయింది - బహుమానం అందుకోనేలేదు. అధ్యక్షపీఠా న్నలంకరించిన అనంతయ్య వదనం లజ్జాభారంతో వాలిపోయింది. కార్యక్రమాలు పూర్తి కాకుండానే వేరే పనుం దని చెప్పి వెళ్ళిపోయాడు.

ప్రేక్షకలోకంలో అధ్యాపకులమధ్య ఆశీనుడై వున్న చక్రపాణి ఎప్పు డిక్కడినుంచి లేచి వెళ్ళిపోయాడో అతడికే తెలియదు.

## 32

"వదినా! మాధవి ఏం చేస్తూంది?"

రాత్రి పది పదకొండు గంటలవేళ, మరొక ఇద్దరు కుఱ్ఱాళ్ళతో కలసి వచ్చిన సుకీర్తిని చూచి ఆశ్చర్యపోయింది సరోజని.



"మాధవేనా? కాలేజీలో లేదా? ఇంటికి రాలేదే!" అంది అయోమయంగా.

రుక్మిణి చాలా ఆందోళనపడింది.
జరిగిన విషయం క్లుప్తంగా చెప్పింది.
అది విని సరోజిని చాలా ఆందోళన
పడి అత్తగారిదగ్గరకు పరుగెట్టింది.



అంతా విని ఆదిలక్ష్మి ఆకాశమంత
ఎత్తున ఎగిరిపడింది "బుద్ధిమాలిన
ప్రవర్తనలు. అదుపాజ్ఞలు లేని
బ్రతుకులు — అంతకంటె ఎక్కువ
మర్యాదలు జరుగుతాయా? అందరూ
కట్టగట్టుకు గంగలో దూకండి. నాకేం?
ఇప్పుడు నేనూ నా సలహా కావలి
సొచ్చాయా?"

ఉస్సురనుకుంటూ ముఖముఖాలు
చూచుకున్నారు రుక్మిణీ. సరోజనీ.
రుక్మిణి వెంటవచ్చిన శ్రీహరీ.
వెంకటేశమూ కూడా చాలా ఆందోళన
పడ్డారు. "పోని మేము ఆఫీసుకు

వెళ్ళి అనంతయ్యగారూ కేశవరావుగారూ అక్కడుంటే విషయం చెప్పివస్తాము" అన్నారు.

"వెళ్ళడం దేనికి? ఫోన్ చేద్దాము" అంది సరోజిని.

ఫోన్ అందుకున్న పావుగంటలో వచ్చివాలాడు కేశవరావు.

విషయ మంతా వివరించారు రుక్మిణీ ప్రభృతులు.

వెంకటేశం అన్నాడు. "ఇదంతా ఆ శ్యాంసుందర్ ముకుందంగార్ల పన్నాగమే. చెట్లను నరకడాని కొచ్చిన గొడ్డలివాడిని చూచి ఒకచెట్టు ఆ వ్యక్తిని నిందిస్తుంటే మరొకచెట్టు "మనలోవాడు వెళ్ళి శత్రుపక్షంలో కలవనిదే ఆ పక్షానికి బలంరాదు - ఆ గొడ్డలి కామ మనజాతిదే చూడ' మందట. అలాగుంది మన సంగతి."

"నిజమే, లేకుంటే ఎప్పుడైనా జరిగిందా ఇలాగ? ఏదో సరదాగా అల్లరిచేయడం వేరు. ఇలా కక్షగట్టినట్లు అల్లరి చేయడం వేరు'' అన్నాడు. కేశవ్. "వెనుక ఎవళ్లో చేయించనిది ఇలాంటి అల్లర్లు చేయరు."

"ఆఁ మరే. నీ చెల్లెలు బుద్ధిగా వుంది అన్నవాళ్ళది తప్పు?" అంది ఆదిలక్ష్మి.

"చాల్లేవమ్మా. నువ్వు అలా అన్నిటికీ వ్యతిరేకంగా ఉండబట్టే గొడవలు ఇంత వరకూ వస్తున్నాయి. కాలేజీలు ఎలా గుంటున్నాయో నువ్వేమైనా తెల్సుకునే మాట్లాడుతున్నావా? ఈ కోతుల అల్లరి కేమిటి? బరి తెగించిపోయి తిరిగేవాళ్ళనికూడా ఏమీ అనరు. ఎంతో బుద్ధిగా వుండేవాళ్ళను ఏదోఒకటి అంటారు. ఈ బుద్ధితక్కువవాళ్ళ వాగుళ్ళకూ గుణాలకూ ముడి పెట్టకు."

''ఇంతకూ ఇప్పు డేం చేయాలో అది ఆలోచించండి" అంది రుక్మిణి.

అంతలో అనంతయ్య కారుహారన్ విన్పించడం, మరునిముషంలో ఆయన లోపలికి రావడం జరిగాయి.

"బిందు ఏదీ?'' అన్నారు అతి సాధారణంగా ముఖాన చెమట ఒత్తుకుంటూ. "ఏమిటి స్నేహితు లంతా ఇలా వచ్చారు?''

ఎవరికీ నోరు కదలలేదు. ఏం చెప్పాలో తెలియక చూస్తున్నారు.

కేశవరావు అన్నాడు. ''మీరు కాలేజి ఫంక్షన్ ప్రిసైడ్ చేయడానికి వెళ్ళారు కదూ?"

"అవును, అయితే? అక్కడినుంచి వెళ్ళిపోయొచ్చి చాలా సేపైంది.'' కను బొమలుచిట్లించి అన్నాడు.

"బిందు......" అర్ధోక్తిలోనే ఆపేశాడు కేశవరావు.

"ఊఁ. బిందు?''

"ఇంటికి రాలేదట." కడకు చెప్పగలిగాడు.

"రాలేదూ? ఎవరన్నారు? అదేమిటి దాని కారు షెడ్‌లోనే వుందిగా? అది రాక పోతే కారు ఎలా వచ్చిం దంటారు ఇంటికి?"

అనంతయ్య చెప్పడంతో అందరూ అటు చూచారు. 'నిజమే మనం ఖంగారులో చూడనేలేదు !' అనుకున్నారు.

సరోజని త్వరత్వరగా బిందు గదిదగ్గరకు పరుగుతీసింది. కాని బిందు అక్కడ లేదు !

అనంతయ్య అన్నాడు. "ఖంగారు పడకండి. చూడండి. ఎక్కడో ఇంట్లోనే వుంటుంది. అమ్మాయి కారువెనకనే నా కారూ వచ్చింది. ఆ కారు గేటులో ప్రవేశించాకనే నా కారును త్రిప్పేశాను మరో పనిమీద."

రుక్మిణిమెల్లగా అంది సరోజనితో. "బాబయ్యగారి కెంత ముందాలోచన ! అక్కడ పైళ్ళిజు పుచ్చుకోకుండా అభిమానంతో వచ్చేస్తోందని జాగ్రత్తగా వెన్నంటి కాచుకున్నా రిన్నమాట!"

వెతకగా వెతకగా మాధవి జాడ దొరికింది. భవనం మూడంతస్తులలోనూ ఎక్కడా అయితే లేదుకాని, మధువనంలో బిం దు సా గ రం ఒడ్డున ఒంటరిగా కూర్చుని దుఃఖిస్తూండడం చూచిన మోతీ వచ్చి సంకేతాలతో తెలియ పరిచింది.

"సరే, మీ రంతా వెళ్ళిరండమ్మా. పాపం చాలా ప్రేమగలవాళ్ళు కనుక వచ్చారు. అమ్మాయి విషయం నేను చూచుకుంటాను లెండి;" అని అందర్నీ పంపేశాడు అనంతయ్య.

"ఇంతకీ చక్రపాణిగా రేంచేస్తున్నారో ! ఆయన దసలే బేతత్వం" అంది సరోజని.

"ఇంటిదగ్గరే వున్నారు. మేం వచ్చేప్పుడు చూచేవచ్చాం. మా వీధిలోనేగా!" అంది రుక్మిణి.

"రే పొకసారి రండి. కాస్త మాధవిని హుషారు చేద్దురుగాని," అంటూ సరోజని వారిని సాగనంపింది.

ఆదిలక్ష్మి రుసరుస లాడుతూ విశ్రమించింది.

ఫాల్గుణ శుద్ధ తదియ. చంద్రాస్తమయమై చాలాసే పైనా సన్నని వెన్నెలరేఖ లున్నాయి జగాన్నావరించి. అనంతయ్య స్విచ్ వేయడంతో ఒక్కసారి తోటంతా విద్యుద్దీపాలతో కళకళ లాడిపోయింది.

'ఎవరా లైట్లు వేశా'రనుకుంటూ ఉలిక్కిపడి చూసిన మాధవి 'బిందూ అని వినవచ్చిన అనంతయ్య పిలుపుకు గజగజ లాడిపోయింది.

తండ్రి ఎదుట ఎప్పుడూ ఎందుకూ అంత భయపడలే దామె. అసలు జీవితంలోనే ఎప్పుడూ అంత భయంతో బాధపడలేదు.

"ఎవరో బుద్ధితక్కువవాళ్లేదో అంటే ఇంత బాధ పడాలా?" అన్నాడు తల నిమురుతూ.

ఎన్నడూ చిన్న మందలింపైనా మందలించని తండ్రినుండి ఈనాడీ విషయంలో ఎటువంటి కటువచనాలు వినాల్సొస్తుందోనని వణికిపోతున్న బిందుకు ఆ సాంత్వనవచనాలతో పన్నీటిజల్లులు పైన చిలకరించినట్లయింది. కళ్లవెంట అశ్రుధారలు స్రవంతులు కాగా "నాన్నా" అంటూ చుట్టేసింది తండ్రిని.

ఆమె శోకవేగం కొంత తగ్గేవరకూ మౌనం వహించాడు అనంతయ్య. తర్వాత ఒక సిమ్మెంటుసోఫాపై కూర్చుంటూ "ఇలా కూర్చోమ్మా" అని ప్రక్కనే కూర్చోబెట్టుకున్నాడు.

"ఇదంతా ఆ శ్యాం చేసిన పని. నీ కారువెనకనే నా కారూ వచ్చింది. అక్కడ నాకు గేటుదగ్గర శ్యాం కన్పించాడు. సగర్వంగా నవ్వుతున్నాడు నన్ను చూచి."

ఆశ్చర్యంగా వింటోంది మాధవి

"నువ్వు ఇంటి కొచ్చాక నేను మళ్ళీ ఊళ్ళోకి వెళ్ళాను వాడి సంగతి ఆరా తీయ



డానికి. ఊళ్ళో ఎక్కడో హోటల్లో ఉంటున్నాడట. మన ఇంట్లోనుంచైతే తరిమేయగలం గాని ఊళ్ళోనుంచి తరమలేం కదా? అయినా వాడికి బుద్ధి చెప్ప గల అవకాశం ఎప్పుడో రాక పోదులే."

"మా మాష్టార్ని కొట్టించినది కూడా వాడేనట నాన్నా."

"అవును, విన్నాను. రాత్రి కేశవ్ చెప్పాడు. ఇంతేకాదు, ఇందులో మీ మెష్టరు ముకుందం జోక్యంకూడా ఉన్నదట. సరే, కానీయ్. ఎప్పుడో నల్లుల్ని రాచి నట్టు రాచేస్తాను."



"ముకుందమా? వాడి కేంపని?" ఆశ్చర్యంగా ప్రశ్నించింది బిందు.

అనంతయ్య సమాధాన మివ్వలేదు. చాలాసేపు మౌనంగా ఉన్నాక "చూడు బిందూ, ఒక్కమాట అడుగుతాను చెప్తావా?" అన్నాడు.

'ఏమి 'టన్నట్లు చూచింది మాధవి.

చూడమ్మా నవ్వూ పెద్దదాన వైనావు వివాహం చేసేయా లనుంది నాకు. నీ కింకా చదువుకోవా లనుందా, పెళ్ళి చేసుకోవా లనుందా?"

ఆ సూటిప్రశ్నకు సమాధాన మివ్వలేక తల వాల్చింది మాధవి.

అది అంగీకారంగా తీసుకుని పై విషయానికి పోయాడు అనంతయ్య.

"నాకు చక్రపాణిగారితో సంప్రతించా లని వుంది. చక్కటి వాడు, ఎమ్మే పాసయాడు బుద్ధిమంతుడు. మంచి సాంప్రదాయమైన కుటుంబం. అన్ని విధాలా నీకు తగ్గవాడు."

ఆశ్చర్యంగా విప్పారిన నేత్రాలతో వినసాగింది మాధవి.

"మీ అమ్మకు మాత్రం శ్యాంసుందర్‌పై మక్కువగావుంది; మరి నీ అభిప్రాయ మెలా వుందోకూడ నాకు తెలియాలి నీ కెవ రిష్టమైతే వాళ్ళనే ప్రయత్నిస్తాను. ఒక వేళ ఇష్టం లేకుంటే బలవంతం లేదు. మరికొంత కాలం ఆగుదాం. ఆలోచించుకుని చెప్పు." పరీక్షగా చూచాడు కూతురి ముఖకవళిక లెలా వున్నాయో నని.

విపరీతానందాశ్చర్యాలతో మాట్లాడలేకపోయింది మాధవి. తండ్రి ఎదుటే లేక పోతే లేచి ఆ వసమంతా స్వేచ్ఛగా తిరుగుతూ నాట్యం చేయా లన్పించింది. అక్కడకూ సంతోషం పట్టలేక పాదాల దగ్గ రున్న మోతీని లేవదీసి ముద్దుపెట్టుకుంది.

"ఏం? చక్రపాణిని బాగా ఎరుగుదువుగా?" తిరిగి ప్రశ్నించాడు.

అలలు అలలుగా ఎగసి వస్తూన్న సంతోషభారంతో యిక అక్కడ నిల్వలేక రెండుచేతులతో ముఖం దాచుకుని పరుగు పరుగున వెళ్ళిపోయింది మాధవి.

అనంతయ్య తృప్తిగా నవ్వుకున్నాడు.

మాధవి ఆ పరుగు రుగు తిన్నగా తన గదిలోకి పరుగెత్తింది శ్రీ వెంకటేశ్వరస్వామి పటంముందు మోకరిల్లింది; "నీ వింత దయామయుడివా? నా కోరిక ఎలా చెప్పాలా అని బాధపడుతూండగా దాని కీవిధంగా పరిష్కారం ఏర్పరచావా? అంతా మన మేలుకే నన్నట్లు చెడుకూడా మంచికే నన్నమాట!"

## 33

చక్రపాణి విషయాన్ని మరీ తీవ్రంగా తీసుకు బాధపడతా డనుకున్న అందరూ, అసలు ఏమీ జరుగనట్టే నిశ్చింతగా నిర్వికారంగా వుండడం చూచి చాలా ఆశ్చర్య పోయారు.

ఉదయం పేపరు చూస్తూ కూర్చున్న అతడిని రుక్మిణి హాస్యం చేసింది చనవుగా, అదే విషయం ఎత్తి.

తేలికగా నవ్వేశా డతడు. "అనుకోనీ భయ మేమిటి? ఎలాగూ జరిగేదేగా? కాకుంటే వాళ్ళు కాస్త ముందుగానే లోకానికి తెలియజెప్పేశారు. అంతే మనకేంటి విచారించటానికి?"

రుక్మిణి పకపకా నవ్వింది. "మా మాధవి బలే గట్టిదండోయ్, ఏమ్మ తెన్నెంత మార్చేసింది: మీ బలహీనతత్వమంతా తీసి పారేసింది; ఏం మంత్రం వేసిందోగాని!"

మధురంగా నవ్వాడు చక్రపాణి. "మీ స్నేహితు లంతా మంత్రగత్తెలే అనుకుంటా. వెంకటేశాన్ని కనుక్కుంటా నుండు; ఆ మంత్రం ఈ మంత్రం ఒకటి అవునో కాదో!"

దానితో రుక్మిణి సంభాషణకు స్వస్తి చెప్పి పారిపోయింది.

"ఊం, నాకు తెల్సులే. నీ నోరు కట్టించటాని కిది మంచి మంత్రం" అని వెనుక నించి అత డనడం ఆమె వినకపోలేదు.

"ఏమి టన్నయ్యా రుక్మిణి అనేది?" అనడిగింది ఇందిర తర్వాత.

"ఏదో వుంది కాని అమ్మ నిలా పిలువు" అన్నాడు.

తొలిరోజున ఫంక్షన్స్ జరగడంవల్ల ఆ పేశ కళాశాలకు సెలవు. జానకమ్మ వచ్చి దగ్గర కూర్చుంది.

"ఒకవిషయం చెప్తాను జాగ్రత్తగా ఆలోచించి, నిర్ణయం చెయ్యాలమ్మా నువ్వు. రఘుకుకూడా ఇప్పుడే ఉత్తరం వ్రాశాను, ఒకసారి రమ్మని."

"చెప్పు, ఏమిటది?"

"జ్ఞాపక ముందా, తిరుపతియాత్రలో ఒకసారి బిందు మనయింట్లో శాశ్వతంగా వుండగల అదృష్ట ముంటే బాగుండు నన్నావ్ ?"

"అవును, అన్నాను."

"ఆ అదృష్టం వస్తోంది."

"ఏమిటీ ?" ఆశ్చర్యాన్నుంచి తేరుకోవడానికి చాలా సేపు పట్టిం దామెకు. "కల కాదుగదా?" అన్నది చివరకు.

"కాదమ్మా. నిన్న కేశవరావుగారు నాతో చాలా విషయాలు మాట్లాడారు..."

సంగతు లన్నీ విన్న జానకమ్మ ఆకసాని కెగిరి గంతు వేయలేదు. వదనంలో దరహాసచంద్రికలు లేవు. పైగా ముఖంలో అప్రసన్నత స్పష్టంగా తాండవించింది.

"అయితే నీ దారేదో నువ్వు చూచుకుంటున్నా వన్నమాట? ఎదిగివున్న చెల్లెళ్ళిద్దరూ ఏమైపోతారు ? లోక మేమనుకుంటుంది ?"

వింటూనే అప్రతిభు డై పోయాడు చక్రపాణి. "అ దేంమాటమ్మా? పెళ్ళైనంత మాత్రాన స్వజనాన్ని వదలుకొంటారా ? మాధవి నీ కోడ లవ్వడం నీకుమాత్రం ఆనందదాయకం కాదూ?"

"ఆనందంకాదు.భయం;" నిర్మొహమాటంగా చెప్పింది జానకమ్మ. "అంతస్థులు దాటిన అటువంటి పెళ్ళిళ్ళు ఎన్నోబాధలు పెడతాయి తర్వాత. నేను మొదటినుంచీ మొత్తుకుంటూనే వున్నాను. ఏదో ప్రలోభం లేకుంటే అంతటివాళ్ళకు మనపై ఇంత ఆదరాభిమానా లేమిటని ? ఇకనైనా ఆ రాకపోకలు తగ్గించి హద్దుల్లో నీ వుండు "

"అలా తీసిపారేయకమ్మా మాధవితో నా వివాహం ఖాయం అదిమాత్రం తప్పదు."

"అయితే నేనూ స్పష్టంగా చెప్తున్నాను విను వాళ్ళ కెంత ఆస్తిఅయినా వుండనీ, వాళ్ళయింటికి నీవు ఇల్లరికం వెళ్ళడానికి వీలులేదు. నా కొడుకు కావలసిన వాళ్ళకు నాయిల్లు పనికిరాదేంటి ?''

"అలా ఆలోచిస్తే అలాగే తోస్తుంది. కాని చూడు, అది ఇల్లరికం కాదు. వాళ్ళ ఇంట్లో వుండను ఇదంతా వేరు నా వివాహ మైన మర్నాటినుండే అది నాఇల్లే అవుతుంది. అందరం అక్కడేవుండొచ్చు నా స్వాతంత్ర మేమీ పోదు. నా ఉద్యోగం నాకు వుండనే వుంటుంది "

"వీల్లేదు." ఖరాఖండిగా అంది జానకమ్మ. "నా ఇల్లు విడచి నే నెక్కడికీరాను. ఎంత లక్షాధికారి కూతురై తేమాత్రం నా కొడుకును పెళ్ళాడినది నా ఇంటికి కోడ రికానికి రావలసిందే. వెనుక నువ్వు అనంతపురంలో ఉండగా ఏదో ఒక సంబంధం వచ్చింది ఇలాగే. అప్పుడు నువ్వే ఇల్లరికాని కొప్పుకోలేదు మరి ఇప్పుడీ మార్పేమిటి నీలో ? వాళ్ళ ఆస్తిపాస్తులన్నీ చూచి మోజుపడుతున్నావా ? ఆ మాధవి తళుకు బెళుకులు చూచి మైమరచిపోతున్నావా ?"

నవ్వాడు చక్రపాణి. "నీ ప్రశ్నలోనే సమాధానమూ వుంది. అప్పు డంగీకరించ లేదు. ఇప్పు డంగీకరించా నంటే ఏమిటిమరి? ఒక్క మాధవేకాదు — ఆ ఇంట్లో అందరి సహృదయతా అర్థం చేసుకున్నా నన్నమాట. డబ్బుకేం — ఎవరికైనా వుంటుంది. కాని అటువంటి ఉత్తములు వుండరు. అది నేను గ్రహించాను. వాళ్లకూ కావాలంటే వరుడే దొరుకకపోడు. మన మంచితనం గ్రహించారు గనుకనే మననే కోరుతున్నారు. అది నువ్వు అర్థంచేసుకో."

"నేను చెప్పేది ఒకటే మాట. కట్నం ఎంత యిస్తారో నికరంగా తేల్చుకుని, తీసుకుని వివాహం చేసుకో. పిల్ల లక్షణంగా మనింటికి కాపురానికి రావా లని చెప్పు.

ఎవరి తాహతేంతో అంతి. వాళ్ల మేడల్లోనూ కార్లలోనే లేదు జీవితం. నీకొచ్చే కట్నంతో పద్మ పెళ్ళి చేయాలి."

'మనుష్యుల నాలుకలు ఎప్పు డే విధంగా మెలికలు తిరుగుతాయో ఊహించలేం' అనుకున్నాడు చక్రపాణి లోలోపల.

పైకిమాత్రం ప్రశాంతంగా చెప్పాడు. "నేను డబ్బుమనిషిని కానమ్మా. నీకూ తెలుసు. కట్నాలూ కానుకలూ ఏమీ తీసుకో నని. నేను వివాహమాడేది కేవలం మాధవికోసం. ఇంకొకరి డబ్బుతో చెల్లెలిపెళ్ళి చేసే హీనస్థితిలో లేను. వాళ్ళ సంగతి నేనూ రఘూ ఎలాగో చూచుకుంటాము. చెల్లెళ్ళకు లోటు చేస్తామా? ఈ విషయంలో మాత్రం ఆలాటి పట్టుదలలు పెట్టుకోకమ్మా. ఇది వివాహం, యావ జ్జీవిత సమస్య. నచ్చిన పిల్లను మరచిపోవడం చాలా కష్టం."

"మరచిపో మనీ ఆ పిల్ల వద్దనీ నే ననలేదే?"

"మరి నీవు చెప్పిన షరతులకు వా రంగీకరించరుగా?"

"అందుకని ఇక లోకంలో పెళ్ళికూతురే లేదన్నట్టు దానికోసం వాళ్ళింటికి వెళ్ళిపోతా వన్నమాట?"

ఉస్సు రంటూ లేచాడు చక్రపాణి కూర్చున్న చోటునుండి; "నే నింకా చెప్పినది గాలి కెగిరిపోయిం దన్నమాట? వాళ్ళింటికి వెళ్ళిపోను. ఆ అమ్మాయిమాత్రం ఇక్కడకురాదు. నేనే వెళ్ళి వస్తూంటాను. ఇంతకంటె ఎలా చెప్పాలో నాకు తెలియదు. అయినా తొందరేం? నువ్వూ బాగా ఆలోచించు. నేనూ ఆలోచిస్తాను. ఎవ్వరికీ మాత్రం రహస్యం చెప్పకు; నువ్వే ఆలోచించుకో."

## 34

మాధవీ,

రెండు రోజులుగా నువ్వు కళాశాలకు రావడంలేదు. బహుశః కళాశాల వార్షికోత్సవ సందర్భంలో జరిగిన విషయమై బాధపడుతున్నా వనుకుంటాను. తెలివి తక్కువవాళ్ళ మాటలు లెఖ్ఖజేసి బాధపడకూడదు. లేత మనస్సువల్ల ప్రతీదీ తీసుకుని బాధపడ్తున్నట్లున్నావ్. అటువంటి పెద్ద ఆలోచన లేమీ పెట్టుకోకు. ఇది లోకం; నాల్గురకాల విషయాలకు తట్టుకోవడం నేర్చుకోవాలి. పరీక్షలుకూడా దగ్గరకు వస్తున్నాయి. బాగా చదవాలి; రెగ్యులర్‌గా కాలేజికి అటెండవ్వు.

—చక్రపాణి

పాణి మాధవికి వ్రాసిన ఆ ఉత్తరం ఎవరిచేతిలో అయితే పడకూడదో సరిగా

ఆ ఆదిలక్ష్మి చేతిలోనే పడింది. ఇహ ఆవిడ ఆగ్రహానికి అవధులు లేకుండా పోయాయి. ఒక్కసారి తారామండలానికి లేచింది.

"నలుగురూ అన్నారంటే అనరుమరి? వాడికీ దీనికీ ఉత్తరాలుకూడా ప్రారంభమయ్యాయి. ఇకనేం? పరు వేమీ నిలవక్కర్లేదు."

విషయం ఇంట్లో ప్రతిఒక్క వ్యక్తికీ తెలిసేవరకూ ఆవిడ అలా విలయ తాండవం చేస్తూనేవుంది.

మధ్యాహ్న భోజనానికి ఇంటికి వచ్చిన అనంతయ్యను మరీ దులిపేసేసింది ఆదిలక్ష్మి. "ప్రపంచంలో ఇంకెవరికీ లేరు కూతుళ్ళు. మీ ఒక్కరికే వుంది. ఇలా భయభక్తులులేకుండా పెంచండి. ఇక పరువు నిలవక్కర్లేదు."

సంగతంతా విని అనంతయ్య ఏమీ మాట్లాడలేదు. మాట్లాడితే ఆ వాగ్వాదం ఎంతవరకూ పోతుందో అతడికి తెలుసు.

భోజనం ముగించి కూతురి గదిలోకి వెళ్ళాడు. తండ్రిని చూచి రేడియో వింటూన్న మాధవి లేచి దగ్గరకు వచ్చింది.

"అయితే కాలేజీకి వెళ్ళడంలేదామ్మా నువ్వు?" అనడిగాడు.

మాధవి తల వాల్చి నేల రాస్తూ నిల్చుంది. సమాధానం చెప్పలేదు.

అనంతయ్య తిరిగి రెట్టించాడు. అప్పటికీ సమాధానంలేదు.

ఇక లాభం లేదని కోడల్ని కబు రంపగా ఆమె వచ్చి నిల్చుంది.

"ఏం సరోజినీ? అమ్మాయి కాలేజీ మానేసిందా? మీ రెవరైనా మాన్పించేశారా?"

సరోజిని చెప్పింది. "ఈ ఎకనామిక్సు, హిస్టరీ ఇవన్నీ ఆవిడ కనవసరమట. ఈ చదువుల అర్థ మేమిటో ఆవిడకు బోధపడటం లేదట. చదువుకుంటూండీ, సంస్కారం లేకుండా అడవిమనుషులలాగ కసీ కక్షలతో ప్రవర్తించే విద్యార్థులమధ్య కూర్చో నంటూంది."

అనంతయ్య ఆశ్చర్యపోయాడు. 'అద్దూ పాద్దూండే కుమార్తెలో ఎంతలో ఎంత మార్పు వచ్చిందీ? ఎంతగా ఎదిగిపోయిందీ!' అని ఆశ్చర్యపోయాడు. పైకి ప్రకాశంగా అన్నాడు. "చక్రపాణిగారు వ్రాసినది నిజం. అర్థమైనవాళ్ళనూ లెక్క జేసుకోకూడదు. కాలేజీ చదువులవల్ల కొన్ని లాభా లున్నాయి. మానకు."

అప్పటికీ మాధవి మాట్లాడలేదు.

సరోజిని అంది; "పోనీండి. ఇష్టం లేనిపనికి బలవంతం దేనికీ? ఉద్యోగాలు చేయనివాళ్ళకు డిగ్రీ వున్నా లేకపోయినా ఒకటే. విజ్ఞాన ముంటే చాలు."

"సరే" తల పంకించాడు అనంతయ్య. "ఊరికే కూర్చోకు. సోమరిగా కూర్చో



వడం, తిరగడం మంచిదికాదు. ఏమైనా మంచిమంచి పుస్తకాలు చదువుకో" అని.
'మార్కులు బాగా రావాలని ట్యూషన్‌కూడా పెడ్తే మొదలే లేకుండా పోయింది'
అని తనలో తాననుకుంటున్నట్టు అంటూ వెళ్ళిపోయాడు.

## 35

'సప్తమీ శనివారం సాయంత్రం మాటాడశానికి వస్తున్నాను. ఇంటివద్దనే ఉండగలరు' అని ఉత్తరం పంపించాడు కేశవరావు చక్రపాణికి.

"తిధి నక్షత్ర వార వర్జ్యాలన్నీ సరిచూచుకుని చల్లనివేళ వస్తున్నాడు. పెళ్ళి మాటలకే" అంది జానకమ్మ.

"అవును. మరి మన మేంచెప్పాలో స్థిరంగా నిశ్చయించుకోవా'' అన్నాడు పాణి.

ఆ ఉదయమే వచ్చిన రఘునాధరావు అక్కడే వున్నాడు.

"ఏంరా, నువ్వేమంటావు?" అనడిగాడు పాణి రఘును. ఆ ఇద్దరన్నదమ్ములూ ఇద్దరు స్నేహితులలాగా మెలగుతారు, ప్రతి విషయంలో ఒకరి సలహా వొకరు తీసుకుంటూ

రఘు అందంగా నవ్వాడు. ''వెంటనే లక్షణంగా చేసేసుకొమ్మంటాను.''

"అది సరే. మరి అమ్మవాదనకూడా వినాలిగా?''

"ఏం? నా మాట తప్పంటావా?" అడిగింది తల్లి.

"ముమ్మాటికీ తప్పే" అన్నాడు రఘు ''మనకు అమ్మాయి ప్రధానం కాని మిగతా విషయా లన్నీ కాదు. అన్ని యోగ్యతలూ వున్నపిల్లను ఇటు బీదయింట్లో దైనా కట్నకానుకులకోసం ముఖం చూచుకొని విడనాడకూడదు అటు అంతఃపుర కాంత అయినా జడిసి బెదిరిపోకూడదు మనస్సులోని మధురత్వాన్ని ధనాభావం నశింపచేయలేదు ; ధనాధిక్యత విరచివేయనూలేదు.''

"సరే, ఎప్పుడూ మీ ఇద్దరిదీ ఒకజేపాట నా మాట వింటారు గనుకనా? కట్నాలు పుచ్చుకోకుండా, వెనుక ఏమంత ధనధాన్యాలు ఒరిగి ఒలికిపోతున్నా యనీ బీరాలు పోవడం? చెల్లెళ్ళ నేం జేస్తారు?"

"లక్షణంగా పెళ్ళిళ్ళు జేసి ఏ లోపం లేకుండా అత్తిళ్ళకు పంపుతాం. ఆ భయం నీ కేమీ వద్దు. మరొకళ్ళ డబ్బుతో పెళ్ళి చేస్తే వాళ్ళకు లోకువైపోమూ?"

"మరి పెళ్ళి పూర్తిగా పళ్ళింట్లో పడుంటే మగవాడికి ఆ దెంత లోకువో ఆలోచించావా?''

విసుగ్గా పెట్టాడు రఘు ముఖం "నీకు ఆలోచన తక్కువ వాళ్ళింట్లో పడుండే దానికైతే మేము మాత్రం అంత అభిమానంలేకుండా ఒప్పుకుంటామా? వాళ్ళమ్మాయి ఇక్కడికి రాదు. అంతేకాని ఇత దక్కడ పడివుండదు వెళ్తూ వస్తూ వుంటాడు. అదైనా వాళ్ళింటికికాదు ఆ అమ్మాయికి కేటాయించిన ఇల్లన్నమాట అన్నయ్య ఉద్యోగందారి ఉద్యోగందె. వాళ్ళపై ఆర్థికంగా ఏమీ ఆధారపడడు గౌరవ మర్యాద లకు లోపం వుండదు ఇక లోకువెయ్యే దేమిటి?"

"ఏమో? పెళ్ళయిన తర్వాత ఇప్పు డున్న మంచితనా లుంటాయన్న నమ్మక మేమిటి? పూర్తిగా మా అల్లుడు మా యింట్లోనే వుండా లంటే అప్పు డేది దారి?"

"ఆలోచించ వలసిందే'' అన్నాడు రఘు "ఏ మన్నయ్యా? అటువంటివాళ్ళా?" అనడిగాడు పాణిని.

"కాదురా."

"అమ్మాయి ఎటువంటిది?''



చాలా మంచిది. అమ్మకే తెల్సు, పోనీ నువ్వు చూస్తావా?''

"ఒద్దొద్దు. నిన్నాకర్షించిం దంటే మరి సందేహంలేదు. నేననేది... ఒకవేళ ఏకారణం వల్లనైనా నువ్వు ఇక్కడికి వచ్చెయ్యమంటా వనుకో, మారు మాట్లాడకుండా వచ్చేస్తుందా?''

"నిస్సందేహంగా. ఇప్పుడే రమ్మన్నా వచ్చేస్తుంది. అవన్నీ మనకంటే ముందుగానే ఆవిడ ఆలోచించింది.''

"అయితే మరి ఆలోచన అనవసరం క్షణం ఒప్పేసుకో.'' నిర్ధారించేశాడు రఘు.

"వీల్లేదు. ఎంతమాత్రం వీల్లేదు " కంయ్యిమంది జానకమ్మ. "తర్వాత తర్వాత వాళ్ళ గుణగణాలమీద మనకు నమ్మక మేమిటి? ఇప్పుడు దారితప్పి నడవడం దేనికి? ఎన్నివేలిస్తారో కట్నం నిర్ణయించుకుని తీసుకోవడం, లక్షణంగా అందరికోడళ్ళ మాదిరిగానే ఆపిల్ల మనింటికి రావడం, అంతే మిగిలిన వన్నీ నా కనవసరం."

"సంబంధం చేసుకున్నాక ఎలాగూ వస్తూ పోతూనే వుంటారమ్మా. ఇవన్నీ

ఊరికే ముందుమాటలు. కాకుంటే లక్షాధికార్లు గనుక వాళ్ళమ్మాయి. సౌఖ్యం విష యంలో అమాత్రం కోరిక లుండడం, శక్త్యానుసారం ఏర్పాట్లు చేసుకోవడం సహ జమే.''

"ఏమో. నా కెంతమాత్రం అలా యిష్టంలేదు.''

''నాకు తెలియదు కాని ఇంగ్లీషువాళ్ళు వివాహమవ్వగానే కొడుకుకైనా కూతురి కైనా సరే వేరే ఇల్లూ సంసారం ఏర్పాటు చేసేస్తారట. క్రమంగా ఈ పద్ధతులు మనలోనూ వస్తాయి, వస్తున్నాయి. అలా కలవరపడకూడదు.''

''ఛ. ప్రతీ విషయంలోనూ అద్వైత మార్గంలో ప్రవర్తించడం, ఎదురు నాకే నీతులు బోధించడం; నా ఒళ్లో పెరిగా మని మరచిపోకండి. ప్రపంచాన్ని కాచి వడ పోసి అనుభవాలు జీర్ణం చేసుకున్నవాళ్ళం–మాముందు మీ రెంత? మీ చదు వెంత? ఒక్కమాట చెప్తున్నాను. నామాట కాదని ఈ వివాహం చేసుకుంటే తర్వాత అనుభ విస్తావు. లక్షాధికార్లతో సంబంధం – పాముతో చెలగాటం. ఇలాటిపెళ్ళి ఇంట్లో ఒక్కళ్ళు చేసుకున్నా ఆపైన కుటుంబ మంతా సర్వనాశనమే."

అంటూనే విసవిసా లేచి వెళ్ళిపోయింది.

అన్నదమ్ము లిద్దరూ అప్రతిభులై చూచారు.

''ఈ ముసలాళ్ళ చాదస్తాలు లెఖ్ఖజేయకూడ దన్నయా; పెద్దవయస్సేకాని పెద్ద తెలివి వుండదు."

"కాదు రఘూ,'' నీరసంగా మందస్వరంతో అన్నాడు. ''వాళ్ళు చాదస్తులే కాని వాళ్ళ శాపాలు నిజమౌతాయి. పెద్దవాళ్ళ ఆశీర్వాదబలం లేనిదే ఎంత మంచిపనైనా ఎటువంటి సహృదయంతో చేసినా కష్టాలు తప్పవు.''

"అయితే ఏమంటావు?" నీళ్ళు కారిపోతూ అడిగాడు రఘు.

"అమ్మ ఉద్దేశ్యా లన్నీ వారికి చెప్దాం, ఆపైన భగవన్నిర్ణయం."

"అసలు సువ్వొక చాదస్తుడవు. రాజాలాంటి సంబంధం కాలదన్నుకుంటావా?" అంటూ విసుక్కున్నాడు రఘు.

"అమ్మకు ఆలోచన తక్కువైనా అమ్మపట్ల మన బాధ్యతా గౌరవాలు మనం మరచి పోకూడదు రఘూ. "తనవాళ్లే శత్రువులైతే జీవిత మెంత నరకమౌతుందో చూడు.''

"ఒక వేళ వారు ఒప్పుకున్నా. కోడలు ఈ ఇంటికి వచ్చినా అమ్మ ఆమెను ఆదరించలేదు. అది ఈ దేశంలోని చాలమంది స్త్రీలలోని బలహీనత, ఎటూ ఇంటి

చక్రపాణి రోజూ కాలేజీకి పుదయం వెళ్ళి సాయంత్రం రావడంతో మాధవి పరిస్థితి మరీ క్లిష్టంగా తయారైంది. పాణి యింట్లో లేని సమయాలలో జానికమ్మ చేసే విమర్శలకూ, పద్మ విసిరే విసుర్లకూ అంతుండదు. ఇక పాణి యించుమించు పగలంతా యింట్లో లేకపోవడంతో జానకమ్మ విజృంభించిపోయింది. ఇరుగుపొరుగు వాళ్ళను చేరదీసి చేసే వ్యాఖ్యానాలకు అంతూ పంతూ లేకుండాపోతోంది. వాళ్ళ సంభాషణదగ్గర కూర్చుంటే, "మాకు కాపలా కాస్తున్నావా?" అంటుంది. గదిలోనే వుండిపోతే "మనుష్యుల పొడ కిట్టదు. గుళ్ళో లింగంలా కూర్చుంటుంది లోపల" అంటుంది. ఇక మార్గ మేమిటో తోచకుండావుంది.

## 45

కాలేజీనుంచి వచ్చిన పాణికి నవ్వుతూ ఎదురువెళ్ళింది మాధవి. కాని అతడి ముఖంలో చిరునవ్వు మచ్చుకైనా కన్పించలేదు. కాళ్ళూ, చేతులూ కడుక్కొచ్చి మౌనంగా మంచంమీద పడుకున్నాడు.

"అన్నయ్యా. ప్రొద్దున్న సినిమా కెళ్దా మన్నావ్‌కదూ, వెళ్దామా?" అంటూ వచ్చింది యిందిర.

"పద్మా, నువ్వూ వెళ్ళండమ్మా" అని డబ్బిచ్చి పంపేశాడు.

ఆశ్చర్యపోయింది మాధవి. "వంట్లో బాగుందా? అలా గున్నా రేమిటి?"

"బాగానేవుందిలే" అంటూ గోడవైపుకు తిరిగి పడుకున్నాడు. మాధవి కేమీ అర్థం కాలేదు. ఆ వారంరోజులూ అలా పాణి ముభావంతో, మాధవి సంశయంతో కొట్టుకుపోయారు.

ఆదివారం మధ్యాహ్నం యింట్లో అందరూ నిద్రపోతున్నారు. చక్రపాణి గదిలో తీరిగ్గా వాసాలు లెఖ్కపెడ్తూ పడుకున్నాడు. కాస్సేపటికి కాలేజీలో రేపు చెప్పవలసిన పాఠాలు కాస్త చూచుకోవాలని గుర్తు వచ్చింది. మంచంమీదినుంచి లేచి బీర్వాలో పుస్తకం తీసుకోవాలంటే బద్ధక మన్పించింది.

"ఇందిరా" అని పిల్చాడు; పలుకలేదు.

"మాధవీ" సమాధానం లేదు.

కాస్సేపు చూచి మళ్ళీ పిల్చాడు. ఎవరూ పలుకలేదు. విసుగ్గా లేచి హాల్లోకి వచ్చాడు. తల్లీ, చెల్లెళ్ళూ నిద్రపోతున్నారు. మాధవికోసం గదు లన్నీ వెతికాడు. లేదు. వసారాలో కొచ్చి నిల్చుని దొడ్డి వైపు దృష్టి సారించాడు. మిట్టమధ్యాహ్నపు ఎండ తీక్షణంగా వుంది. మొక్కలూ, పూలూ వాడిపోయి తలలు వాల్చివున్నాయి.

నూతిగట్టుమీద కాకులు నీళ్ళకోసం వెతుక్కుంటున్నాయి. సపోటా చెట్టుక్రింద మాత్రం కాస్త నీడగా వుంది. ఆ నీడలో తిన్నెమీద చెక్కిట చెయ్యి చేర్చి ఆలోచనా నిమగ్నురాలై వుంది మాధవి, అశోకవృక్షం క్రింది సీతాదేవిలాగ. "మాధవీ" అని పిల్చాడు ఆశ్చర్యపోతూ పాణి. పరధ్యానంగా వున్న మాధవి చెవుల కా పిలుపు సోకనేలేదు. పాణి దగ్గరగా నడచి వెళ్ళి భుజం మీద చెయ్యి వేసేసరికి తొట్రుపడ్తూ లేచి "ఏం, ఇలా వచ్చారు ? ఏం కావాలి ?" అనడిగింది.

"ఏమి టిక్కడ కూర్చున్నావ్ ?"

"వూరికేనే. ఏం తోచక" అంటూ ముఖం త్వరగా ప్రక్కకు త్రిప్పుకుంది.

ఆ కంఠంలో ఏదో అస్వాభావికత గోచరించిన పాణి అనుమానంగా భార్య ముఖం తన కభిముఖంగా త్రిప్పుకున్నాడు.

"ఏమి టిది ?" బలవంతంగా అణచుకోబోతున్న కన్నీళ్ళను చూచి విభ్రాంతితో అడిగాడు.

మాధవి మాట్లాడలేదు.

"అమ్మ ఏమైనా అందా ?" అన్నాడు తిరిగి. ఇక ఏడుపు ఆపుకోడం మాధవి తరం కాకపోయింది. కన్నీళ్ళు ధారాపాతంగా ప్రవించసాగాయి. "ఎవ రేమన్నా మీరు ప్రాణంగా చూచుకుంటా రని ఆశపడ్డాను, కాలి పారాణైనా ఆరనిదే మీకుకూడా బరువై పోయాను;" వెక్కి వెక్కి ఏడ్వసాగింది.

క్షణం నిర్ఘాంతపోయాడు చక్రపాణి. "ఏమిటి మాధవీ, ఈ నిష్ఠురా లన్నీ నా మీదేనే ? నాకు నువ్వు బరువా? పొరపాటుగా ఏమో వూహించుకు బాధపడ్తున్నావ్" అని ధారాపాతాలైన కన్నీళ్ళను తుడిచాడు.

"బరువు కాకపోతే ఎందు కంత ముభావంగా వుంటున్నారు? అపురూపంగా చూచుకోనే మీరు అసలు మాట్లాడుతున్నారా నాతో ;" అంది ఇంకా వెక్కెక్కిపడ్తూ.

దీర్ఘంగా నిట్టూర్చాడు పాణి. "నువ్వు బాధపడ్తా వనే నే నేమి చెప్పడంలేదు. కాని ఎటూ నీ బాధ తప్పలేదు. మనస్సు బాగుండక ముభావంగా వుంటున్నానేమో. దానికే నువ్వు పెడర్థాలు తీసి బాధపడితే ఏం చెయ్యను చెప్పు ? ఇప్పుడుకాదు. జీవితంలో మరెప్పుడైనా నిన్ను నిర్లక్ష్యం చెయ్యగలనా ?"

"మన స్సెందుకు బాగుండలేదు ?" కళ్ళొత్తుకుంటూ ఆశ్చర్యంగా అడిగింది.

"ఇన్నాళ్ళనుంచీ నువ్వు బాధపడ్తా వనే నీ దగ్గర దాచాను. ఇక తప్పదు మరి. ఇలాకూర్చో చెప్తాను" అంటూ తిన్నెమీద కూలబడ్డాడు వుస్సురని నిట్టూర్చుతూ. అక్కడే కొంచం ఎడంగా కూర్చుంది మాధవి.

నొక నరకంగా చేయక మానదు. అందువల్ల ఆవిడమాట ఆధారంగా తీసుకుని నువ్వు అవకాశాలు జారవిడుచుకోకు."

చక్రపాణి మౌనం వహించడంతో మరి సంభాషణ సాగలేదు.

సాయంకాలం వచ్చిన కేశవరావుకు బ్రహ్మాండమైన స్వాగతం ఇచ్చారు, చక్రపాణి, రఘునాధరావులు. ఎన్నో ఫలహారాలు, పళ్ళూ సిద్ధంచేశారు కానికేశవరావు నవ్వుతూ అన్నాడు, "అనవసర శ్రమ పడ్డారు. నేను యిక్కడ ఒక్క చుక్క మంచితీర్థంకూడా తీసుకోదలచుకోలేదు."

"ఫర్వాలేదులెండి అవన్నీ పూర్వాచారాలు," అని నచ్చచెప్పబోయాడు రఘు.

"ఏదో, నమ్మిక అలా వుండనీయండి, బలవంతం వద్దు."

"సరే " ఆ తర్కం అంతతో ఆగిపోయింది.

జానకమ్మకూడా వచ్చి కూర్చోవడంతో అసలువిషయానికి నాందీ ప్రస్తావన ప్రారంభమైంది.

"చక్రపాణిగారు మీకు విషయా లన్నీ వివరించా రనుకుంటాను," అంటూ జానకమ్మతో సంభాషణ ప్రారంభించాడు కేశవరావు.

అరగంటసేపు సాగినచర్చ విఫలమైంది.

ఉదయకమలంవంటి వదనంతో వచ్చిన కేశవరావు ఉత్సాహ మంతా చచ్చిపోయింది కలువమొగ్గలాగా ముకుళించుకుపోయింది ముఖం.

"ఇది ఇల్లరికమూకాదు, మీరు స్వతంత్రమూకోల్పోరు, గౌరవానికేమీ భంగమూ వాటిల్లదు మీ ఉద్యోగం మానుకొమ్మనికూడా మా అభిమతం కాదు. ఉద్యోగాన్నింకా ఇంకా పెద్దదిగా చేయించాలనే నాన్నగారి ప్రయత్నంకూడా. మరి మీ రెందుకింత ఆలోచిస్తున్నట్టు?" అనడిగాడు.

ఆలోచ నేమీ లేదండీ. పెద్దవాళ్ళ కేదో కొన్ని సెంటిమెంట్సుంటాయి చూడండీ ......" అంటూ నసిగాడు

చిన్నగా నవ్వాడు కేశవరావు. "అసలు గొడ వంతా అదేకదండీ. ఈ పెద్దవాళ్ళ 'సెంటిమెంటల్ వ్యూస్' వల్లనే బిందు వివాహసమస్య ఇలా గుంది."

రఘూ, పాణీ ముఖముఖాలు చూచుకున్నారు 'మా నాన్నగారి నమ్మకాలేలేకుంటే మా బిందు నీ వరకూ వచ్చేదా ?', అన్నట్లు తోచిందతడి ధోరణి వారికి.

రఘు అందుకు సమాధానంగా అన్నాడు "ఎలాగో ఓలాగు ముడిపెట్టేసుకునే వాళ్ళ పెళ్ళి ళ్ళెప్పుడూ తొందరగానే అయిపోతాయండీ; ఎటొచ్చీ మనలాటి వాళ్ళున్నారే — 'అన్నివిధాలా అనుకూలవతి, సుగుణరాశి కావాలి; కట్నం తీసుకోను'

అనే మా అన్నయ్యలాటి ఆదర్శపురుషుడూ. 'మా అమ్మాయి కోరికలూ, మా కోరికలూ అన్నీ తీరా' లనుకునే మాలాటివారి అమ్మాయిలూ కాస్త ఆలస్యంగా వుండిపోతారు."

అర్థం జేసుకున్న కేశవరావు నవ్వేశాడు. "మీరు నన్నపార్థం జేసుకున్నట్టున్నారు; మాటసందర్భం చెప్పానేకాని మరోభావం, వ్యంగ్యంలేదండీ. మిమ్మల్ని బాధించినట్టుంది నాధోరణి, ఏమీ అనుకోకండి. బుద్ధిపూర్వకంగా అన్నమాటకాదు."

ఆ సరళధోరణి. చూచిన రఘు 'ఎందుకన్నానా?' అని లోలోన నొచ్చుకున్నాడు.

"వా డెప్పుడూ హాస్యధోరణిలో వుంటాడులెండి. దానితో కొంచం అతిగా మాట్లాడతాడు. మరోఉద్దేశ్య మేం లేదు" అంటూ సర్దేశాడు చక్రపాణి.

"అయితే బాబూ? ప్రపంచంలో కూతురు మీ ఒక్కరికే వుందా? ఇం కెవరికీ ఆడపిల్ల ల్లేరా? పెళ్ళిళ్ళు చేసి పంపుకోవడంలేదా? వాళ్ళందరికీ గారాలు లేనట్టేనా?" అంది జానకమ్మ కేశవరావు నుద్దేశించి.

నిజాని కామాటకు కోపంవచ్చింది కేశవరావుకు. అయినా ప్రశాంతంగానే పైకి అన్నాడు. "ఇప్పుడు మీ చిన్నబ్బాయిగారూ మేమూ మాట్లాడుకున్న విషయా లవే కదండీమరి! ఎవరి సంతానంపట్ల వారికి ప్రేమ వాత్సల్యా లెప్పుడూ వుంటాయి; కాని కొన్నికొన్ని కారణాలవల్ల కొందరిలో అవి మరీ ఎక్కువగా వుంటాయి నేను మళ్ళీ చెప్పనవసరంలేదు— మీకూ తెలుసు బిందును నాన్నగారు కుమార్తెగా ప్రేమించడంకంటె తనను దయదలచి కటాక్షించిన శ్రీదేవినిగా పూజిస్తారు; ఇంటి సిరిగా, వెలుగుగా గౌరవించి ఆరాధిస్తారు. అందుకే ఆమె విషయంలో కొన్ని కొన్ని నమ్మకాలు పెట్టుకున్నారు. లేకుంటే ఈపాటికి బిందు మరొక జమీందారుకు గృహిణిగా వెళ్ళిపోయివుండేది. ఇందులో వ్యంగ్యం, ఎత్తిపొడుపూ వున్నా యని మాత్రం అనుకోకండి. యదార్థమే చెప్పాను."

జానకమ్మముఖం కొంచం మాడింది

పాణికీ రఘుకూ కూడ కొంత అభిమానం అనిపించినా తల్లి ప్రశ్నకు అది తగిన సమాధానమే గనుక తప్పనిసరిగా మౌనం వహించవలసివచ్చింది.

తిరిగి కేశవరావు అన్నాడు "ఇందులో మీరు ఏ మాత్రము అనుమానింప తగినది లేదు ఒక్కటి ఆలోచించండి కుమార్తె సౌఖ్యంకోసమే అహోరాత్రాలూ తల్లడిల్లిపోయే ఆయన అల్లుని ఒక చక్రవర్తిగా పూజించి గౌరవిస్తారే కాని కించపరచీ, చిన్నచూపు చూచీ కొంచపరచరు; కుమార్తెను చిన్నబుచ్చరు. ఆమెఅత్తవారిని చిన్నచూపు చూడరు. బిందుకూ, ఆమె సంసారానికీ సకలసౌకర్యాలు అమర్చడంవరకే కాని మా



ప్రమేయమే వుండదసలు. వివాహమైన క్షణంనుండి మాధవీమందిరం ఇక మీఇల్లే. లోకంలో అన్ని ఆనందమైన సంసారాల్లోలాగే మీరూ వుంటారు. బిందు మాకళ్లెదుట అక్కడే వుండాలి ఏమీ శ్రమపడకుండా ఇంతవరకూ ఎలా గడచిపోయిందో ఇక ముందుకూడ జరిగిపోవాలని మా కోరిక. ఆ ఒక్క కోరిక మినహా మరేంలేదు, కట్నం మీరెంత కోరితే అంత మీచేతి కిమ్మంటే ఇస్తాం. అమ్మాయిపేర వెయ్యమంటే వేస్తాం. ఆ విషయంలో ఎలాగైనా మాకేమి పట్టింపులేదు. చెప్పండి ఎంత కావాలో. మా అమ్మాయిమాత్రం మా గడప దాటకూడదు.''

ఈ సారి జానకమ్మ ముఖం వికసించడం స్పష్టంగా కనిపించింది కాని ఆమె యేమో చెప్పేలోగా పాణి అన్నాడు." క్షమించండి కేశవరావుగారూ. నే నటువంటి వాడిని కాను. డబ్బుప్రమేయం లేదు నాకు. మీ రసలు ఆ ప్రసక్తే ఎత్తరాదు. రెండవ విషయమే ఆలోచించాలి."

"అవునండి, మే మిద్దరంకూడ కట్నాలు తీసుకొనరాదనే నిర్ణయించుకున్నాము. మాకు వ్యక్తులే ప్రధానం," అని బలపరిచాడు రఘునాథ్.

జానకమ్మ ముఖంలో మళ్లీ వికాసం మాయమైంది.

"మరి ఏమంటారు?" అడిగాడు కేశవరావు.

సోదరు లిద్దరూ మౌనం వహించారు.

"సరే, ఆలోచించండి బాగా. ఏ వ్యవహారమైనా అంత నిముషాలమీద తొందరగా జరిగిపోదుకదా? మీరు అహంభావం అనీ, అతిశయ మనీ అనుకోకుంటే ఒక్క మాట చెప్తాను. ఎవరో ఒకరు మీకూ దొరకవచ్చు, మాకూ దొరకవచ్చు కాని మీలాంటివారు మాకు లభించరు, మావంటివారు మీకు దొరుక రన్నది పరమసత్యం. మరి నేను వుంటాను."

"మీకు ఇది ఎలా ఉందో కాని నాకుమాత్రం చాలా బాధగా వుంది. నాన్నగారు మరీ బాధపడతారు మీరంటే నాన్నగారికి చాలా ప్రేమ ముఖ్యంగా బిందును ఓదార్చ లేనేమో నని భయంగావుంది" అంటూ నిష్క్రమించాడు కేశవరావు.

ఆరాత్రి పాణి సమంగా భోజనమే చేయలేదు; రఘు గమనించాడు

తర్వాత రాత్రి పడుకున్నాక రహస్యంగా అడిగాడు "ఆ అమ్మాయికీ నీకూ చాలా స్నేహ ముందా అన్నయ్యా?"

చక్రపాణికి అత్యంత ఆత్మీయు డైన స్నేహితుడు తమ్ముడు రఘునాధరావే. అందువల్లనే దాపరికం లేకుండా తమ ప్రయణగాధనూ, తిరుపతికొండలపై అది పటిష్ఠతరమైన విధమూ, చేసుకున్న నిర్ణయాలూ వివరంగా చెప్పేశాడు.

అంతా విన్న రఘు చాలా బాధపడ్డాడు, "ప్చ్, ఇంత జరిగాక కూడా నువ్వింకా ఆలోచించడ మేమిటి? మీ మీ పట్టుదలలతో మధ్యన ఆవిడ ఎంత క్షోభిస్తుందో తెల్సుకోలేకుండా వున్నావ్. ఇది నీకు తగ దన్నయ్యా"

విషాదంగా నవ్వి ఊరుకున్నాడు చక్రపాణి"

"అన్నయ్యా ఒక్క మాట"

"జరిగే దేదో జరగనీ నా మెదడు వేడెక్కిపోతోంది" అంటూ అటు తిరిగి పడుకున్నాడు చక్రపాణి. రఘు మరి మాట్లాడలేదు.

**Printed and Published by A. Sudhakar Rao from Yuva Press, 5-9-88, Public Garden Road, Hyderabad-1 Controlling Editor Sri "CHAKRAPANI",**

## ఫారం 4

జి ఓ. మిసలేనియస్ నెం. 1647

ప్రకటన క్లాజు నెం. 8 అనుసరించి

| | | |
|---|---|---|
| 1. | ప్రకటన జరుగు స్థలము | యువ ప్రెస్, 5-9-88 పబ్లిక్ గార్డెన్ రోడ్ హైదరాబాద్. |
| 2. | ప్రకటన కాలక్రమము | ప్రతినెల ఒకటవ తేదీ. |
| 3. | ముద్రణకర్త పేరు, జాతి, చిరునామా | ఎ సుధాకరరావు, హిందువు, 5-9-88 పబ్లిక్ గార్డెన్ రోడ్, హైదరాబాద్. |
| 4. | ప్రకటనకర్త పేరు, జాతి, చిరునామా | ఎ. సుధాకరరావు, for యువ ప్రెస్, హిందువు, 5-9-88 పబ్లిక్ గార్డెన్ రోడ్, హైదరాబాద్, |
| 5. | సంపాదకుని పేరు, జాతి, చిరునామా | చక్రపాణి (ఎ. వి సుబ్బారావు,) హిందువు 5-9-88 పబ్లిక్‌గార్డెన్ రోడ్, హైదరాబాద్ |
| | యజమాని | చక్రపాణి (ఎ. వి. సుబ్బారావు) |

పైన యివ్వబడిన వివరము లన్నియు నా ఎరుక నమ్మకముల మేర సత్యములే అని ఇందుమూలముగా వక్కాణించుచున్నాను.

హైదరాబాద్
ది 1-3-1964

*(Sd.)* ఎ. సుధాకరరా
ప్రకటనకర్త.

